# పోతన కవితాసుధ

వ్యాఖ్యానం

డా. పి. యశోదారెడ్డి



ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

POTANA KAVITA SUDHA - A Commentary on 108 selected poems from Potana's "Andhra Maha Bhagavatam" by Dr. P. Yasoda Reddy, Reader in Telugu, Post Graduate College, Osmania University.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాదు – 500 004

ప్రచురణ : 349

ప్రథమ ముద్రణ : 1983

ప్రతులు : 2,000

వెల రూ. 5-00

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాదు,
హైదరాబాదు - 500 004

ముద్రణ :
మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్
1–1–694/2/ఎ, గాంధీనగర్,
హైదరాబాదు–500 380.

# తొలిపలుకు

మహాకవి, మానవోత్తముడు, "ధనమదాంధుల కొలవేల తాపసులకు"ని ప్రశ్నించిన ధీరోదాత్తుడు బమ్మెరపోతన. తన కవితాపారమ్యంతో తెలుగుసాహితిని, తెలుగు ప్రజాళిని పునీతం చేసినవాడు పోతన. తాను కవిగా నమ్మిన ఆదర్శాలను తన జీవితంలో కూడా ప్రతిబింబింపజేసి, త్రికరణశుద్ధిగా కవితాకళను ఆరాధించిన మనీషి పోతన.

1982లో తెలుగునాడంతటా పోతన పంచశతి మహోత్సవాలు జరిగినవి. ప్రభుత్వం ఉదారంగా ముందుకువచ్చి సంస్కృతి ప్రియత్వాన్ని, కళాభిజ్ఞతనూ ప్రదర్శించింది.

ఈ ఉత్సవాలను పురస్కరించుకుని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ మూడు పుస్తకాలను ప్రచురించాలని నిశ్చయించింది. i) బమ్మెర పోతన భాగవతంలోని 500 పద్యాలను ఎంపిక చేసి ప్రకటించడం. ii) పోతన భాగవతంలోని సాహిత్య తాత్త్వికాంశాలను పరిశీలిస్తూ, విద్వాంసులు వెలయించిన వ్యాసాల సంకలనాన్ని ప్రచురించడం. iii) పోతన భాగవతంలోని ఎంపిక చేసిన 108 పద్యాలకు సరళవ్యాఖ్యానం వ్రాయించి ప్రచురించడం. వీటిలో "మహా భాగవత కల్పకుసుమమాల," "భాగవత వైజయంతిక" ఇప్పటికే పాఠకలోకం అందుకున్నది. ఇప్పుడు పోతనభాగవతంలోని 108పద్యాలకు డా॥ శ్రీమతి పి. యశోదారెడ్డి

గారు వెలయించిన సరళవ్యాఖ్యాన గ్రంథం 'పోతనకవితాసుధ'గా తెలుగు ప్రజలకు అందించగలుగుతున్నాము.

డా॥ శ్రీమతి పి. యశోదారెడ్డిగారు చక్కని భాషలో, పోతన కవితామహత్వాన్నీ, కవితా సౌందర్యాన్నీ ఈ పుస్తకంలో అందించినారు. అకాడమీ పక్షాన ఆమెకు ధన్యవాదాలను సమర్పించుకుంటున్నాను. ఈ ప్రచురణ కోసం ప్రత్యేక నిధులు మంజూరు చేసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి అకాడమీ పక్షాన అనేక ధన్యవాదాలు.

హైద్రాబాదు.
26—12—1983

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

# రెండు మాటలు

క. పలికెడిది భాగవతమఁట
పలికించు విభుండు రామభద్రుండఁట నేఁ
బలికిన భవహరమగునఁట
పలికెద వేఱొండుగాథఁ బలుకఁగ నేలా!

భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధ జనుల వలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపఱుతు.

ఆ.మ.భా (1-16, 17.)

పోతనవంటి మహానుభావుడూ, మహాకవీ తాను వ్రాయబోతున్న గ్రంథాన్నిగూర్చి "పలికెడిది భాగవతమఁట" అంటూ మరే ఇతర విశేషణాన్ని చేర్చకుండా మిన్నకున్నాడు. ఏ అలంకారాలూ లేకుండ కేవలం 'భాగవతం' అంటూ ఆ అద్వైతి ఉపయోగించిన పదానికి అర్థాలు చెప్పడానికి ఎందరికో మోతకోలుగా చాలా గ్రంథాలు బయలుదేరవలసి వచ్చింది. అప్పుడు అర్థమైంది భాగవతం అంటే సామాన్య గ్రంథం కాదని. అయితే ఆ గ్రంథం ఎటువంటిదీ అన్నప్పుడు చిలుకపాఠం అప్పచెప్పినట్లుగా ఇది సాత్వతసంహిత, పరమహంససంహిత, గీతార్థ

నిర్ణయసారం, సకలవేదసారం, మోక్షశాస్త్రం, జీవేశ్వర తత్త్వ నిర్ణయశాస్త్రం, బ్రహ్మవిద్యాస్వరూపం, ఉపనిషద్రహస్యం అంటూ చెప్పవచ్చు. కానీ అసలు విషయాన్ని గ్రహిస్తూ పాలకు పాలూ, నీటికి నీరుగా వేరు చేయగల శక్తి కేవలం హంసలకూ పరమహంసలకు మాత్రమే చెల్లుతుంది.

పైగా ఈ భాగవతాన్ని పలికించినవాడు రామభద్రుడట! అంటే పోతన ముఖతః జాలువారిన ఈ పద్యాలకు అపౌరుషేయత్వం కలిగింది. ఈ విషయం భాగవత ప్రాశస్త్యాన్ని మరింత అధికతరం చేసింది. సాక్షాత్తుగా శ్రీరామచంద్రుడు పలికించిన భాగవత పురాణగాథను పలికినంత మాత్రంతోనే సద్యఃఫలంగా మోక్షాన్ని ఇస్తుందట. ఇక ముముక్షువైన వానికి ఇంతకన్నా కోరవలసింది ఏముంది? ఇంతటి మహామహిమోపేతమైంది భాగవతం. కనుకనే విజ్ఞుడైన పోతనామాత్యుడు నిజంగా భాగవతాన్ని తెలుసుకుని పలకడం సర్వజ్ఞుడైన శివుని అంతటివాడికైనా, సకల సృష్టికర్తేకాక సకల విద్యాముఖుడైన బ్రహ్మ అంతటివాడికైనా కూడా తరంకాదు అంటూ ఖండితంగా చెప్పినాడు. మరి తానెట్లు వ్రాయగలిగినాడంటూ ప్రశ్నించేవారికి సమాధానంగా విబుధులైన జనులవల్ల విన్నంతా కన్నంతా తనకు తెలియవచ్చినంత తేటపరుతును అంటూ చెప్పినాడు. శ్రీ పరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్ర, సహజ పాండిత్యుడైన పోతనామాత్యుడే ఇంతటి వినయ సంపత్తిని ప్రదర్శిస్తూ చెప్పడం కేవలం ఆ గ్రంథంపై ఈ మహాకవికి ఉన్న పూజ్యభావాన్ని మాత్రమే తెలుపుతుంది. తరువాత పోతన భాగవత గ్రంథాన్ని అనువదించడంలో తనకున్న అర్హతలను ప్రకటిస్తున్నట్లుగా ఆంధ్రపాఠక లోకంలో

ఉన్న విభిన్న రుచులను సంతృప్తిపరుస్తూ భాగవతంలో తాను కేవలం సంస్కృతాన్ని కానీ, కేవలం తెనుగును కానీ స్వీకరిస్తూ పద్యాలను వ్రాయక, అందరు మెచ్చే విధానంలో వ్రాస్తానంటూ చెప్పి సంస్కృతాంధ్రాలపై తనకున్న అధికారాన్ని సగర్వంగా చాటుకున్నాడు. ఈ విధంగా అర్హతలనూ అధికారాలనూ ప్రదర్శించడం ఆదికవి నన్నయ్య నుండీ వస్తున్న సంప్రదాయమే. అయితే పోతన తన మాటను ఎంతవరకు నిలబెట్టుకున్నాడు అంటే ఆలోచించినప్పుడు మనకు గ్రంథముఖంతో చెప్పిన దానికన్నా అధికతరమైన చాతుర్యాన్నే ప్రదర్శిస్తూ ఎంతో గహనమైన తత్త్వరహస్యాన్నికూడా రసగుళికలవంటి పద్యాలల్లో పొదిగి పాఠకులకు రసానందాన్ని అందివ్వగలిగినాడు అనే విషయం స్థిరపడుతుంది.

భాగవతం ప్రధానంగా ఆముష్మిక ధర్మమార్గ ప్రదర్శకమైన గ్రంథం. భారతీయమైన సంస్కృతిని పురస్కరించుకుని పురాకృత కర్మవశంతోనే జనన మరణాలు కలుగుతుంటాయి అనే నమ్మకం ఏర్పడింది. ఆ కర్మ ప్రాధాన్యంతోనే రాగద్వేషాది వశంగతమై చిరకాలంనుండి ఈ సంసార చక్రం మానవులను పీడిస్తూనే ఉంది. 'పునరపి మరణం పునరపి జననమ్' అనే ఈ సంసార చక్రభ్రమణం ఆగినప్పుడుగాని ఈ తాపత్రయ బాధలు ఉపశమింపవు. ఈ రహస్యాన్ని గుర్తించిన వివేకచిత్తులు ఈ బంధంనుండి విముక్తిని పొందేందుకు అనేక తరణోపాయాలను సూచించినారు. అవే జ్ఞాన, కర్మ, వైరాగ్య, భక్తి రూపాలుగా ప్రాచుర్యాన్ని పొందినాయి. పురుషార్థసాధనకు కర్మ, జ్ఞాన, భక్తి, వైరాగ్యాలూ ప్రధానమైనవే. ఈ యోగప్రవక్త శ్రీకృష్ణుడనే

భావన మనలో వేళ్లూనగా ఆ కృష్ణుడొక ధర్మప్రవక్తగా ఆరాధింప బడుతున్నాడు. అందుకే భాగవతం ఈ నాల్గింటినీ ప్రతిపాదిస్తూ ఉపాఖ్యానాలు చెప్పింది. ధర్మరూపమైన కర్మయోగంతో అంతః కరణం పరిశుద్ధమౌతుంది. పరిశుద్ధమైన అంతఃకరణంలోనే జ్ఞానోదయమౌతుంది. ఈ జ్ఞానంతో తత్త్వచింతనం ఏర్పడ్తూ మనస్సు జ్ఞానజనితమైన నిర్వేదంపైపు మళ్లుతుంది. నిర్వేదం మోక్షానికి రాజమార్గం. కానీ ఇంతటి నిరీహతో కర్మాచరణం చేయడంకానీ, వేదవిహితమైన యజ్ఞయాగాది రూపకర్మానుష్ఠానం చేయడంకానీ ప్రస్తుతపు పరిస్థితులల్లో సాధ్యపడదు. అందుకే విజ్ఞులైనవారు 'భక్తి' అనే ఒకసులభమైన మార్గాన్ని కనిపెట్టినారు.

సంస్కృత భాగవతంలో భాగవత మాహాత్మ్యన్ని వర్ణిస్తూ 'భక్తిచరిత్ర' చెప్పబడింది. ఆ కథను అనుసరించి శ్రీహరి 'భక్తి' ప్రాణప్రియ. ఈమెను హరి తన సత్వరూపంతో రచన చేసి ఆమెను తన భక్తులకు పోషించుమంటూ నియోగించినాడు. శ్రీహరి ఆజ్ఞను తప్పక పాలించిన ఆ 'భక్తి' ని అనుగ్రహిస్తూ ఆమెకు 'ముక్తి'ని దాసిగనూ, జ్ఞానవైరాగ్యాలను పుత్రులుగనూ ప్రసాదిస్తూ తన భక్తులను వైకుంఠధామంలో పోషిస్తూ ఈ భూలోకంలో ఛాయారూపంలో ఉండుమంటూ ఆజ్ఞాపించినాడట. ఈ కథను గురించి సూక్ష్మంగా ఆలోచిస్తే 'ముక్తి'ని పొందేం దుకు భక్తి చాలా ఉత్తమమూ, సులభమూఐన మార్గం అని తోస్తుంది. ఈ భక్తే శ్రీహరికి చాలా ఇష్టమైన కారణంతో ఆ భక్తిని సలిపినవారిని ఆ భగవంతుడు తప్పక అనుగ్రహిస్తాడు అనే సారాంశం తేలుతుంది. జ్ఞానవైరాగ్యాలను భక్తికి పుత్రు లంటూ చెప్పడంతో భక్తివల్లనే ఈ రెండూ సాధింపబడుతాయి

అనే విషయం కూడా బోధపడుతుంది. ఈ విషయాన్నే పోతన మరింత గట్టిగా ప్రచారం చేసినట్లు

"చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ
జిక్కఁడు దానముల శౌచశీలతపములన్
జిక్కఁడు యుక్తిని భక్తినిఁ
జిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ!"
ఆ.మ.భా. 7-243.

అంటూ రచించినాడు.

ఈ కలియుగంలో చిత్తశాంతికి భక్తిమార్గం ఎంతో సులభమైన బాట. ఈ భక్తిమార్గాన్ని అవలంబించడానికి అందరూ అర్హులే. ఇందుకు జాతిమత వివక్షతగానీ స్త్రీపురుషభేదం కానీ ధనికుడూ నిరుపేద అనే తారతమ్యంకానీ, చదువుకున్న వాడూ చదువురానివాడనేవ్యత్యాసంకాని అడ్డంకులుకావు. భక్తుడు పరిశుద్ధమైన వాక్కుతో, మనస్సుతో, చేతలతో ఈశ్వరుణ్ణి సేవిస్తే అదే భక్తి. అయితే ఈ భక్తికూడా అనుకున్నంత సులభంకాదు. పూర్వజన్మసుకృత విశేషంచేతగానీ అది అందరికీ అలవడదు. సర్వేంద్రియాలను నియమిస్తూ చిత్తాన్ని భగవంతుని పరంచేస్తూ ఫలాభిసంధిరహితంగా పరమప్రేమతో ప్రవర్తించడం భక్తికి చిహ్నం. భక్తుడైనవాడు అనన్య శరణాగతితో అచంచలమైన విశ్వాసంతో ఉంటాడు. ఆ ఆత్మవిశ్వాసమే కుదురుపడ్తూ అన్నిటికీ ఆ సర్వేశ్వరుడే కర్త, తాను కేవలం ఉపకరణం మాత్రమే అనే

భావంతో నిర్వికారంగా మసలగల్గుతాడు. నిర్వికారమైన ఈచిత్తం లోనే భగవదాకృతి కాపురంచేస్తుంది. అప్పుడా భక్తుడు సర్వాన్ని మరచి తనలోఉన్న భగవంతునిపై హృదయం ద్రవీభూతమౌతూ ఉంచే నిరతిశయమైన ఆనందానుభూతిని పొందుతూ ఉంటాడు. ఈ అనుభూతివల్ల అనాదిఐన పుణ్యాపుణ్యరూపమైన కర్మవాసనా కోశం నశిస్తుంది. తద్వారా ఆతడు ద్వంద్వ రహితుడై బ్రహ్మా నందరూపమైన మోక్షప్రాప్తిని పొందగలుగుతాడు.

ఈ భక్తి తొమ్మిదివిధాలుగా వృద్ధినిపొందుతుంది. అదే నవ విధభక్తులుగా పేరుమోసింది. శ్రవణమూ, కీర్తనమూ, స్మర ణమూ, పాదసేవనమూ, అర్చనమూ, వందనమూ, దాస్యమూ, సఖ్యమూ, ఆత్మనివేదనమూ అనే తొమ్మిదింటికీ ఉదాహరణంగా భాగవతంలో పోతనామాత్యుడు కథలల్లో పాత్రలను చొప్పించి నాడు. ఈభక్తినే శ్రీధరులవారు తొమ్మిది వేర్వేరు భూమికలుగా ప్రదర్శించినారు. 1. స్వామిసేవ, 2. ఆ హరికృప, 3. సద్ధ ర్మంపైశ్రద్ధ. 4. భగవత్కథాశ్రవణమూ, 5. భగవద్రతి, 6. దేహద్వయ వివేకాత్మజ్ఞానము, 7. దృఢభక్తిభావము 8. భగవ త్తత్వజ్ఞానము, 9. సర్వజ్ఞత్వాది భగవద్గుణావిర్భావము లంటూ పేర్కొన్నారు.

శ్రీ మధుసూదన సరస్వతి ఈ భక్తిని పదకొండుగా విభ జించినారు 1. మహాపురుషులసేవ, 2. వారిదయకు పాత్రుడగుట 3. వారుచేసే ధర్మాలపై శ్రద్ధచూపుట, 4. భగవద్గుణ శ్రవణం 5. భగవంతునిపైప్రేమ, 6. భగవత్స్వరూపాన్ని తెలుసుకునే కోరిక 7. ప్రేమాభివృద్ధి 8. స్ఫురణము 9. భగవద్ధర్మనిష్ఠ,

10. ఆ భగవంతుని గుణాలను తనకుఆరోపించుకొనుట11. పరమ ప్రేమ. నిజంగా ఆలోచిస్తే ఇవన్నీ భక్తి భేదాలు కాకుండా భక్తుడైన వాడు తరతరాలుగా భక్తి మార్గంలో ముందడుగు వేస్తూ చివరమెట్టుగా పరమప్రేమతత్త్వంతో అనురాగరసాంబుధిఐన ఆపరతత్త్వాన్ని చేరడమే అని చెప్పవచ్చు.

అందుకే భాగవతంలో పోతన ఉత్తమ జీవితానికి జ్ఞానం ఎంతముఖ్యమో పూజ్యుల ఎడల భక్తితత్పరతలూ అంతేముఖ్యం అంటూచెప్పి పూజ్యపూజకు వ్యతికరం ఏర్పడినప్పుడు మహానర్థం సంభవిస్తుందని సూచించినట్లు గజేంద్రుని పూర్వజన్మను వర్ణిస్తూ ఇంద్రద్యుమ్నోపాఖ్యానాన్ని చెప్పినాడు. ఇదే భారతీయులను పాప భీతులుగాచేస్తూ వారికి మహాపురుషులనుగౌరవించే వినయసంపత్తిని చేకూర్చింది. ఇంతేకాకుండా మనలో కర్మసిద్ధాంతానికీ, పూర్వాపరజన్మలపై నమ్మకానికీ బలీయమైన ఆధారాన్ని కల్పించింది.

ఇట్లే భాగవతం తత్త్వబోధను చేయడంలో ఒకసున్నితమైన మార్గాన్ని అవలంబించింది. ప్రధానంగా ఈ గ్రంథం ఐహికవాంఛలను తగ్గిస్తూ ఆముష్మిక ఫలసాధనకొరకే ప్రయత్నించ వలెనంటూ ఉపదేశిస్తూ ఒకకథను ప్రారంభించి చివరకు ఆ కథానాయకుడు సంసారబంధాలన్నీ వదిలి వైకుంఠధామునితో సాయుజ్యాన్ని పొందినట్లు చెబుతుంది. ఈ సందర్భంలో తత్త్వోపదేష్టలైనవారు - వారు దేవతలైనా, భూసురులైనా, నరులైనా, దానవులైనా, బ్రహ్మర్షులైనా సరే వారినోటివెంట వెళ్లినవాక్కులు వేదవాక్యాలవలె సర్వ ధర్మాలకు ఆలవాలమై మానవుణ్ణిప్రాపంచిక సుఖాలనుండి విముక్తిని పొంద జేయడానికి తోడ్పడుతూ ఉంటాయి. అందుకే పోతన భాగవతంలో కేవలం భక్తిభావరంజిత

పైన పద్యాలేకాక ప్రస్తావికంగా చెప్పిన పద్యాలు కూడా అపురూపాలై నీతిబోధకాలై రసానందాన్ని కలిగిస్తూ ఉంటాయి. ఇందులో నానాధర్మవిధులూ, రాజ, గృహ, దాన ధర్మాలూ, శాస్త్రవిజ్ఞాన తపఃప్రభావాదులన్నీ చేరిఉన్నాయి.

ఈ భక్తిని ప్రధానంగా ఆర్తభక్తి. సహేతుక భక్తి. నిర్హేతుకభక్తి అంటూ మూడువిధానాలుగా విభజించినారు. తిరిగి అహేతుకభక్తి ఆసక్తి భేదంతో పది విధాలైంది, గుణమాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి, దాస్యాసక్తి. సఖ్యాసక్తి, కథాసక్తి. ఆత్మనివేదనాసక్తి. తన్మయాసక్తి, పరమ విరహాసక్తి వాత్సల్యాసక్తి, అనేవి ఇందులో భేదాలు. తిరిగి ఈ అహేతుక భక్తి -జ్ఞాన, మౌఢ్యభేదాలతో— రెండువిధాలు.

భక్తి రసాయనం ఈభక్తిని గుణప్రాధాన్యంతో నాల్గుగా విభజించింది. 1. రాజసభక్తి, 2. తామసభక్తి. 3. సాత్త్వికభక్తి, 4. మిశ్రమభక్తి. ఈ భక్తి తిరిగిఉపాధిని పురస్కరించుకుని శుద్ధము వ్యామిశ్రితం అంటూరెండువిధాలు. ఉపాధి రహితమైంది శుద్ధము. ఉపాధి సహితం వ్యామిశ్రితం అంటూ పేర్కొన్నారు. ఇవేగాక ప్రేమయొక్క పరమోత్కృష్టరూపమే మధురభక్తి అంటూ రూపగోస్వామి చెప్పినారు. భక్తి రసాయనంలో మధుసూదన సరస్వతి—

"శృంగార మిశ్రితా భక్తిః కామజా భక్తిరిష్యతే
సంబంధజా రతిర్యాతి పూర్వోక్తాంరసతాం ద్వయోః
ఏకో వత్సల భక్త్యాఖ్యః ప్రేయోభక్తి స్తథాఽపరా
భయజా రతి రధ్యాస్తేరసం ప్రీతి భయానకమ్"

(భ ర. 68, 69)

అంటూ వ్రాస్తూ, శృంగారంతో మిశ్రితమైన భక్తి కామంనుండి జన్మిస్తుందనీ. సంబంధ జనితమైన భక్తి, వాత్సల్యభక్తి అనే పేరుతో ప్రీయోభక్తిగనూ, భయకారణ జనితమైన భక్తి నుండి ప్రీతి భయానకం అనబడే మిశ్రమ భక్తి ఉద్భవిస్తుందనీ తెలిపినాడు. వీరిని పురస్కరించుకుని దాస్యభక్తి భగవంతునిపై ప్రీతీ, భయమూ ఈ రెంటితో ఏర్పడుతుందని గ్రహింప వచ్చును. అవును దాసుల లక్షణం అదేకదా !

ఈ మధురభక్తిని ఆధారంగా చేసుకుని భక్తులెందరో భగవానుని తల్లిగా, తండ్రిగా, బిడ్డగా, ప్రభువుగా, స్నేహితుడుగా, ప్రియుడుగా భావించి ఆరాధించినారు. ఈభావంలో ఒక అనిర్వచనీయమైన ఆనందతన్మయత్వాదులు ఇమిడి ఉన్నాయి. తమకు ఎంతో ప్రియమైనవ్యక్తితో సంపూర్ణంగా సంలీనం పొందుతూ తాదాత్మ్యంతో మాధుర్యాన్ని అనుభవించడం ఒక్క ఈ మధురభక్తి విధానంలోనే సాధ్యం. అందుకే ఈభక్తిని ఉజ్జ్వలభక్తిఅనీ, సర్వోత్తమభక్తిఅనీ, పరమప్రేమ రూపము అనీ భావించినారు. అనిర్వచనీయమైన భక్తిని రూపగోస్వామి 'రసరాట్టు' అన్నాడు. ఈ మధురభక్తి రసాన్ని పోతన అనన్య సాధారణమైన శైలీరామణీయకంతో రచించినాడు. లీలామానుష విగ్రహుడైన శ్రీకృష్ణునిపై గోపికలకు ఎంత ప్రగాఢమైన ప్రేమ ఉందో పోతన రచనకూడా అంత సుందరంగా, ఉజ్జ్వలంగా ఉంటూ పద్యాలన్నీ సుకుమార పదబంధాలతో కూడీ, కాంతిగుణశోభితాలై మనోహరంగా ఉంటాయి. కొన్నితావుల్లో కాలిఅందెలు ఘల్లుఘల్లున రవళిస్తూ ఉంటే గోపికలు శ్రీహరి సన్నిధి నర్తించినట్లుగా పోతనపద్యాలు చెవికి ఇంపునింపుతూ ఉంటాయి. మరికొన్ని పద్యాలు లోకమోహ

నమైన నీలమేఘశ్యాముని మోహనమురళీనాదం వలె మననూ మరపిస్తూ ఆ మురళీగానాన్ని తవిలి తమ్ముతామే మరచిన ఆలమందల వలె, చిలుకాగోరువంకల వలె, గోపికలవలె మననూ వెంటగొని పోతుంటాయి. మరికొన్ని పద్యాలు, అవి దైవరతికమైన దివ్య శృంగారమో శుచిరుజ్జ్వలమైన శృంగార రసమో తెలియనీయక సర్వాన్నీ శృంగారపులకితం చేస్తూ ఆనంద ధన్యత్వాన్ని పాఠకులకు కలిగిస్తూ ఉంటాయి.

ఇల్లే మాతా పుత్ర స్థానంలో ఉన్న యశోదాకృష్ణుల లీలను వర్ణించే సందర్భంలో పోతన పద్యాలు ప్రమోదులను చిగురింప చేస్తూ సర్వజగత్తును ఆనంద రసపులకితం చేస్తున్నవి. అల్లరి కృష్ణయ్యను పట్టుకుంటానంటూ ఆ వెర్రిగోపమ్మ పెట్టిన పరుగులూ,ఆతుంటరి ఆమెకు చిక్కక గజ్జెలు ఘల్లన నజ్జలు తొక్కడం మాని పరుగులు తీయడమూ, అది చూసిన గోపకాంతలు పకపకా నవ్వడమూ, యశోదగట్టిగా తొడలమీద వేసుకుని చన్నివ్వడమూ, ఆ చిన్నడు అమృతధారగా వర్షించే ఆ యశోద పాలుతాగి పరమయోగోద్భవామృత రసపానలీల చొక్కి నిద్రించడమూ,గోపమ్మలు తమఇంటి వెన్నలు దొంగిలిస్తూ తమ కోడండ్ర అధరామృతాన్ని దొంగిలింప చేసిన ప్రయత్నానికి విస్తుపోతూ నందగోపుని భార్యతో చాడీ చెప్పడం ఇవన్నీ సహజ సుందరాలై వ్యథాపూరితమైన ఈ సంసారపుబాధను కొంత ఉపశమింపజేస్తూ ఈ సంసారం నిస్సారం కాదు, సారవంతమే సుమా అనే తృప్తిని కలిగిస్తాయి. ఈ తృప్తి శాంతికి మూలమై పరబ్రహ్మను గూర్చి ఆలోచింపజేస్తుంది. ఇంతటి ఆనందాన్ని పంచిన ఆ శిశువు ప్రాకృత మానవుడుకాక పరమాత్ముడనే భావం కుదిరినప్పుడా ప్రేమ భక్తిగా మారు

తుంది. అదే మోక్షకారి. అందుకే పోతన పద్యాలకు ఆ శక్తి ఉంది.

ఇట్లే పోతనామాత్యుడు 'కల్యాణాత్మకమైన విష్ణుకథలా కర్ణింపుచున్ ముక్తకైవల్యుండెవ్వడు తృప్తుడౌ'నంటూ ఇంకా విన గోరిన వారికి రుక్మిణీ కల్యాణాన్ని వర్ణించినాడు. ఈ ఘట్టంలో పోతన బాగాకలిగిన తెలుగువారింటి ఆడపడచు సంబరాలన్నీ తప్పక వర్ణిస్తూ ఆకాలంనాటి బొమ్మలపెళ్లిళ్లూ, బొమ్మరిళ్లూ, సఖులతో వియ్యాలందుకోవటం, గుజ్జన గూళ్లలో వంటకాలు వండుకోవటం మొదలైన విషయాలన్నీమరొక్కసారి మనకళ్లకుకట్టేట్లు చేసినాడు. ఇంతేకాకుండా ఆ కాలపు రాజకన్యలు ఎంతో తెగువతో తాము మనసిచ్చిన ప్రియులకు ఇష్టబ్రాహ్మణునితో సందేశం పంపడమనే ఆచారం ఉన్నట్లు చాటీ ఈనాటికన్నా ఆనాడే వివాహ విషయంలో కన్యలకు స్వాతంత్ర్యం ఎక్కువగా ఉండేదేమో అనే భావాన్ని కలిగించినాడు. ఇంకొక విశేషం; ఈ సందర్భంలో రుక్మిణీదేవి శ్రీకృష్ణుని గుణవిశేషాలన్నీ పొగుడుతూ "నిన్నునే కన్యల్ గోరరు? కోరిదే మును రమాకాంతాలలామంబు'' అంటూ చెప్పి శ్రీకృష్ణుడు సాధారణ మానవుడుకాక జగన్నాయకుడైన ఆదినారాయణమూర్తి అనే భావాన్ని దృఢపరిచింది. ఆ తరువాత రుక్మిణీదేవి "ప్రాణేశ నీ మంజుభాషలు వినలేని కర్ణరంధ్రంబుల కలిమి యేల" అంటూ చెప్పి పంపిన సందేశంలో భగవంతుని విరహాన్ని క్షణంపాటు సహింపలేని ఒక భక్తశ్రేష్ఠుని తహతహపాటును ధ్వనింపచేస్తూ రుక్మిణీదేవిని మహాభక్తురాలిగా చిత్రించినాడు. ప్రియురాలి ప్రణయ సందేశంలో శృంగారభక్తిని చూపగలిగిన చతురుడు పోతన. ఇక సత్యభామను వర్ణించేప్పుడూ ఈ సత్యభామ

నరకాసురునితో యుద్ధం చేసే సందర్భంలో పోతన తెలుగుసాహిత్యంలో సాహిత్యరసపోషణుడుగా స్తుతింపబడిన నాచన సోమనాథుని పురస్కరించుకుని అహమహమికతో పద్యరచన చేసినట్లు కానవస్తుంది. ఈ సందర్భంలో 'వేణిం జొల్లెము వెట్టి', 'జ్యావల్లీధ్వని గర్జనంబుగ', 'రాకేందుబింబమై రవిబింబమై,' 'పరుజూచున్ పరుఁ జూచు' 'బొమ్మా పెండ్లిండ్లకు బోనొల్లనను బాల' మొదలైన పద్యాలు శబ్దాలంకారశోభితాలై, సంస్కృత సమాసప్రౌఢితో పాండితీస్ఫోరకాలై, రాజసంతోడ సింపారుతూ పోతనామాత్యుని కవితాశక్తికి నికషోపలాలై మనకు ఆనందాన్ని కలిగిస్తాయి. పోతన శ్రీకృష్ణలీలలనూ, గోపికా భ్రమరగీతాలను వర్ణించేప్పుడే కాకుండా ప్రహ్లాదచరిత్రనూ, వామనావతారఘట్టాన్నీ, గజేంద్రమోక్షాన్నీ వ్రాసేటప్పుడు కూడా భగవత్పరమైన తన చిత్తవృత్తిని ద్రవీభూతం కావించుకుని తన్మయుడై ఈ పద్యాలను రచించినాడా అనే భావం కలుగుతుంది. ఉదాహరణకు ప్రహ్లాదుడు చెప్పిన 'అజ్ఞుల్ కొందఱు', 'మందారమకరంద' 'అంధేందూదయముల్' 'కంజాక్షునకుగాని కాయంబు కాయమే' 'సంసారజీమూతసంఘంబు విచ్చునే' అనే పద్యాలను పేర్కొనవచ్చును.

ఈ సందర్భంలో పోతన

"అలుకనైనఁ జెలిమినైనఁ గామంబున
నైన బాంధవముననైన భీతి
నైన దగిలి తలఁప నఖిలాత్ముఁడగు హరిఁ
జేరవచ్చు వేఱు సేయఁ డతఁడు"

అంటూ చెప్పి భాగవతంలో విరోధభక్తి లేదా వైరభక్తి అనే మరొక్క విధమైన భక్తి విధానాన్ని ఎంత రమ్యంగా పరి పుష్టం చేసినాడు! ఇందులో విరోధి సర్వకాల సర్వావస్థలల్లో వైరిని హతమార్చవలెనంటూ తదేక చిత్తంతో ప్రవర్తిస్తూ భ్రమరకీటన్యాయంతో ఆ పరమాత్మనే చేరడం సిద్ధిస్తుంది. ఇదే హిరణ్యకశిపునిపట్ల జరిగిన వింత.

పోతన తెలుగుభాగవతంలో గహనాలైన తత్వరహస్యా లను శ్రీధరులవారి వ్యాఖ్యాసాహాయ్యంతో తెలుగుచేసినాడంటూ పెద్దలు చెబుతుంటారు. సందేహం కలిగిన తావులల్లో పోతన కవి తన తృప్తికోసం వ్యాఖ్యను చూస్తే చూడవచ్చునేమో కాని గ్రంథం మాత్రం స్వకపోల కల్పితంవలె పద్యాలన్నీ గలగలపారే సెలఏర్లవలె వడివడిగా సాగిపోతూనే ఉంటాయి. నిజానికి మూలరామాయణ, భారత, హరివంశాదులవలెభాగవతం సులభమై సుబోధంగా ఉండదు. సామాన్యపు సంస్కృత పరిజ్ఞానం ఉన్న వారిని పాదపాదానికీ నిలువరిస్తూనే ఉంటుంది. విషయ కాఠి న్యానికి తోడూ భాషకూడా సరళమైందిగా నాకు కనబడలేదు. అటువంటి పౌరాణికపు గ్రంథాన్నీ పోతన ఒక కావ్య ప్రబంధం వలె సంతరించినాడు. భాగవతం చదివేప్పుడు మనం ఎంత భక్తి భావనియమితులమై గంభీరంగా కూర్చున్నా ఆరచన ఆవేశపూరితమై మనదృష్టిని బలవంతంగా అలంకారాలవైపూ, నుడికారపు సొంపు వైపూ, పద్యపు నడకవైపూ, ఎత్తుగడ విధానంవైపూ, ప్రాస విశేషాలవైపూ, ఒక్కొక్కచోట కొంతమేరను అతిక్రమించిన శృంగారగర్భితమైన మధురభక్తివైపు మళ్ళింపచేస్తూనే ఉంటుంది. అందుకే సాహితవేత్తకు భాగవతం ప్రధానంగా రసవంతమైన

కావ్యం. గౌణంగా భక్తిప్రబోధక గ్రంథం అనే చెప్పవచ్చు. గంగా ప్రవాహంవలె ఒడ్డులొరసి పారే కవిత్వాన్ని చెప్పనేర్చిన పోతన తన భాగవతంలో నీతులనూ, ధర్మాధర్మస్వరూపాలనూ, సంభాషణలనూ, తవితర్కధర్మాలనూ సాధారణంగా కందం, ఆటవెలదుల్లో చెబుతుంటాడు. కొన్నిసార్లు ఉత్పలమాలనూ, ఎక్కడో మత్తేభాన్నికూడా ఈ విషయాలల్లో వాడుతూ ఉంటాడు. సాధారణంగా ఉపయుక్తాలైన పదాలన్నీ చిన్నవిఐ పొడిపొడిగా ఉంటాయి. అయినా ఆ చోట్లల్లో ప్రాసవిశేషాలనూ చొప్పిస్తూ పద్యానికి విచిత్రగతినీ చెవికి విందునూ కల్పించే చమత్కారం పోతనకే దక్కిందేమో అనే భావన కలిగే రచన పోతన సొమ్మని చెప్పవచ్చు. పోతన దృష్టిలో భాగవతం అంటే భక్తులచరిత్ర అనే భావంకూడా ఉండి ఉంటుంది. అందుకే ఆయన భాగవతంలో—

“అరవిందాక్ష పదారవింద
మకరందాసక్తులై యున్న స
త్పురుష శ్రేష్ఠుల వృత్తముల్
వినక దుర్బుద్ధిన్ విలంఘించి దు
ర్నర వార్తా కథన ప్రపంచములు
గర్ణ ప్రాప్తముల్ సేసి వా
సరముల్ వ్యర్థతఁ ద్రొబ్బుచుండఁ
జనదీ సంసార మోహంబునన్.

అంటూ జనులను హెచ్చరించినాడు.

ఈ విధంగా పోతన ఒక్కొక్కప్పుడు మూలగ్రంథాన్ని పెంచుతూ అమూలమైన కల్పనచేస్తూ రచించిన కమ్మని పద్యాలెన్నో భాగవతంలో ఉన్నాయి. ఈతవచ్చినవాడికి కాని లోతు తెలియదు కదా !

ఇంతకుముందే భాగవత కుసుమమాలలో మనవిచేసినట్లుగానే 108 భాగవత పద్యాలకు సులభంగా తాత్పర్యరూపమైన వ్యాఖ్యవ్రాసే భాగ్యం నాకు దక్కింది. ఆ భాగ్యవిశేషం నాకు దక్కుతుంది అని మురిసిపోయినానేకాని నిజంగా నా సామర్థ్యాన్ని గూర్చి తలచనేలేదు. అయినా భారాన్ని మోసే విభుడు ఉండగా నా కొచ్చిన చిక్కేముందీ ! అనే మొండి విశ్వాసంతో ఉన్నాను. ఆధైర్యమే నాతో ఈ పనిచేయించింది అంతే! ఎందరో మహానుభావులుండగా నాకే అదృష్టం దక్కడం 'నోచినవారి సొమ్ములని నోమని వారలకేల వచ్చు ధరన్' అన్నట్లుగా ఉంది.

నేను వ్రాపిన విషయాన్ని గూర్చి నేను చెప్పడం అంత బాగుండదు. అయినా ఒక్కమాట. ఈ వ్యాఖ్య వ్రాయడంలో ప్రధానంగా నేను పాటించవలసిన నియమాలు: 1. భాషాసారళ్యం, 2. అంతగా లోతైన తత్త్వార్థాలవైపుగానీ, అలంకారాలవైపుగానీ వెళ్లకుండా ఉండడం. సాధ్యమైనంతవరకు వ్యవహార సిద్ధమైన భాషలోనే సులభంగానే ఈ వ్యాఖ్య నడిచింది. కానీ విషయ గౌరవాన్నిబట్టి కొంత బిగువైన శబ్దాన్ని ప్రయోగించక తప్పలేదు. ఎంతో మెలకువను చూపుతూ చిన్న పద్యాలనే ఎన్నుకున్నాను. ఎన్నో పద్యాలు ఆ పద్యం చదువుతున్నప్పుడు సులభంగానే ఉంటాయి, కానీ వ్యాఖ్యానంలో మాత్రం పోతన అనుకున్నంత

సులభంగా చిక్కదు. అప్పుడు ప్రసిద్ధమైన అర్థాన్ని కాకుండ సాంకేతికమైన వేరే అర్థాన్ని స్వీకరింపవలసి వచ్చింది. పోతన భాగవతంలోని అనేక సీసపద్యాలు శబ్దగుణ మాధుర్యంతో జాలు వారుతూ కైలీరామజేయకంతో ఒప్పులొలుకుతూ ఉంటాయి. ఆ పద్యాలను సులభమైన తెలుగులో అందించే ప్రయత్నం చేయడం అంటే పోతన పద్యాల సొగసును చెడిపి కుప్పలు పెట్టడమే అవుతుంది. ఈ రహస్యం పద్యాన్ని వ్రాసి కొంత ముందుకు సాగిన తరువాతకాని తెలిసిరాలేదు. అందుకే అటువంటి పద్యాలు కొన్ని వదిలిపెట్టవలసి వచ్చింది. అవసరం ఉన్న చోట కొంత లోతైన అర్థాన్నీ, కొంత వ్యంగ్య వైభవాన్నీ, అలం కారపు సౌభాగ్యాన్నీ పదబంధపు చమత్కారాన్నీ మచ్చుగా అంది వ్వక తప్పలేదు. ఈ వ్యాఖ్యాన సందర్భంలో నేను శ్రీధరీయాన్ని కానీ, వీరరాఘవీయాన్ని కానీ సంప్రదించలేదు. నా ఆలోచనకు తోచిన విధానంలో తాత్పర్యాన్ని ఇస్తూ విశేషార్థాలను విపులీకరణ రూపంలో ఒక్క పేజీ దాటనివియమంతోనే సాగించినాను. విషయం మీ ముందున్నది. భాగవతంలోని 108 పద్యాలనన్నా తప్ప కుండా ఈ వ్యాఖ్యానం చదివిస్తే నా కృషికి ఫలం దక్కినట్లే. ఎంతో ఆదరాభిమానాలతో ఈ ఫలితాన్ని నాకు దక్కించిన సాహిత్య అకాడమీ పెద్దలకు సర్వదా కృతజ్ఞురాలను.

పి. యశోదారెడ్డి

# పోతన కవితాసుధ

శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలన కళాసంరంభకున్ దానవో
ద్రేక స్తంభకుఁ గేళిలోల విలసద్దృగ్జాల సంభూత నా
నాకంజాతభవాండకుంభకు మహానందాంగనాడింభకున్.

పోతనామాత్యుడు వ్రాసిన ఆంధ్ర మహాభాగవతంలో శ్రీకార రూపంలో ఉన్న మొదటి పద్యం ఇది. సాధారణంగా నిర్విఘ్నంగా కొనసాగేందుకు కావ్యప్రారంభంలో ఇష్టదేవతకు నమస్కారాలు చెబుతూ, కొంత కథావస్తువును కూడా సూచిస్తూ, మంగళాచరణంగా ఒక పద్యాన్ని వ్రాసే సంప్రదాయం ఉంది. పూర్వమహాకవుల సంప్రదాయాన్ని పాటిస్తూనే పోతనకూడా శ్రీకృష్ణుని స్తుతిస్తూ ఈ పద్యాన్ని చెప్పినాడు.

ఉత్తమమైన మోక్షపదాన్ని చేరేందుకొరకు లోకరక్షణకు ఒక ప్రయత్నంగా, అదే ఒక ఉద్యమంగా కలవాడినీ, భక్తులను పోషించే కళలో ఆవేశమూ, ఉత్సాహమూ కలవాడినీ, దానవులు అంటే దుర్మార్గుల ఉద్రేకాన్ని అరికట్టే వాడినీ, క్రీడ సల్పే ఆసక్తితో ప్రకాశించే చూపుల వల్లనే జన్మించిన అనేక బ్రహ్మాండాలకు కడవవంటి వాడినీ అంటే రక్షకుడైన వాడినీ (తన పొట్టలో ఇముడ్చుకున్న వాడినీ), నందగోపుని భార్య యశోదా దేవికి బాలకుడైన శ్రీకృష్ణుని చింతిస్తాను, అంటూ పోతన ప్రారంభం చేసినాడు.

ఈ పద్యంలో పోతన కేళీలోలమైన చూపు మాత్రం చేతనే సర్వలోకాలను సృజిస్తూ, ఆ లోకాలనూ, ఆ భక్తులనూ రక్షిస్తూ దుష్టులను శిక్షించే సమర్థుడైన మహానందాంగనా డింభకుణ్ణి మోక్షపదవి కోసం చింతిస్తానంటూ చెప్పి, శ్రీ కృష్ణుడే సర్వ-జగన్నాయకుడైన శ్రీహరి అనే విషయాన్ని స్థాపించినాడు. ఈ పద్యంలో ఇంకొక విశేషం కూడా ఉంది. మోక్షం అంటే పరమమైన సుఖం. ఆ సుఖం కోసం 'మహానందాంగనా డింభకుణ్ణి' అంటే మహానందం అనే స్త్రీకి బిడ్డడైన శ్రీకృష్ణుని ధ్యానించినాడని చెప్పవచ్చు. అంతే కాదు; కృష్ణుడు అంటే భూమికి సుఖాన్ని ఇచ్చేవాడని కూడా అర్థం ఉంది. అందుకే శ్రీకృష్ణుడే స్వయంగా బాలరూపంలో ఉన్న పరమానందం. సాక్షాత్తు మోక్షపు మొలక. ఆ ధ్యానం పరమసుఖాన్నే కలిగిస్తుంది.

క. పలికెడిది భాగవతమఁట
పలికించు విభుండు రామభద్రుండఁట నేఁ
బలికిన భవహరమగు నఁట
పలికెద వేఱొండు గాథ బలుకఁగనేలా.

మహాభక్తుడైన పోతన సర్వం దైవాయత్తంగా భావిస్తూ భాగవత గ్రంథ కర్తృత్వానికి కూడా ఆ శ్రీరామచంద్రుణ్ణే అధికారిగా నిల్పుతూ చెప్పిన పద్యం ఇది.

ఈ పద్యం ఎంతో చిన్నది. కంద పద్యం. పదాలన్నీ సరళంగా ఉండి, సులభంగా అర్థమౌతాయి. కానీ ఎంతో లోతైన భావం ఇందులో ఇమిడి ఉంది. చెప్పే గ్రంథమేమో భాగవతం

అంటే భక్తుల చరిత్రమూ, ఆ భక్తులకు కుదురైన శ్రీహరి చరిత్రమూ. మరి ఆ శ్రీహరిలీలలు అనంతాలు కదా. అవి వర్ణించ డానికి ఎవరికి సాధ్యం? అందుకే పలికించే విభుడు ఆ రామ భద్రుడే! అంటూ వ్యక్తం చేసినాడు పోతన. "పలికింతు విభుండు రామభద్రుండట" అంటూ చెప్పి పోతన శ్రీరామచంద్రునికి 'విభు' శబ్దంతో జగన్నాయకత్వాన్నీ, 'భద్ర' పదంతో లోక రక్షకత్వాన్ని సంక్రమింపజేస్తూ రామచంద్రుడు సాక్షాత్తు శ్రీహరే సుమా అంటూ తెలియ చేసినాడు. అప్పుడు పలికించే ప్రభువు శ్రీహరికాగా, పలికేది శ్రీహరిచరితం అంటే భాగవతం ఐంది. ఇంతకంటే పుణ్యంకానీ, పుణ్య వస్తు సంకీర్తనం కానీ ఇంకేముంటుంది? ఇటువంటి కథను పలకడం వల్ల ఏమిటీ లాభం? అంటే భవ హరం, ఇకమీద జన్మ లేకపోవటం. అందుకే పోతన వేరే కథను చెప్పడం ఎందుకూ? సంసార బంధాలు నసిపోయే ఈ హరికథనే చెబుతానంటూ భాగవతాన్ని ప్రారంభం చేసినాడు. ఇంత చిన్న పద్యంలో పోతన భాగవత ప్రాశస్త్యాన్నీ, పుణ్య వస్తు సంకీర్తనం వల్ల కలిగే ఫలాన్నీ, జగన్నాయకుని సర్వాధి పత్యాన్నీ, తనకున్న మోక్షపు చూపునూ సూచించినాడు.

ఉ. క్షోణితలంబునెన్నుదురుసోకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయ సుందర వేణికి రక్షితానత
శ్రేణికిఁ దోయజాతభవచిత్తవశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామ శుక వారిజ పుస్తక రమ్యపాణికిన్.

ఆంధ్రభాగవతప్రారంభంలో ఇష్టదేవతాస్తుతి సందర్భంలో పోతన సరస్వతీ దేవిని పురస్కరించుకుని చెప్పిన పద్యం ఇది.

ఇసుకకుప్పల వంటి సొగసైన పిరుదు గలదానికీ, తుమ్మెదల బారు వంటి నల్లటి అందమైన జడ కలదానికీ, తనచేత రక్షింప బడి నమస్కరిస్తున్న భక్త సమూహం కలదానికీ, పద్మ సంభవు డైన బ్రహ్మ మనస్సును ఆపుకునే మాటసొంపు కలదానికీ, అక్ష మాలతో, చిలుకతో, కమలంతో, పుస్తకంతో ఎంతో ఒప్పైన చేయికలిగిన శారదాదేవికి, నానుదురు భూమికితాకగా, మొక్కుతూ స్తుతి చేస్తాను, అంటూ వ్రాసినాడు.

ఈ పద్యంలో ప్రాసస్థానంలో ఉన్న మూర్ధన్య 'ణ'కారం పద్యానికి అంతటికీ వెలుగు తెచ్చింది. తిరిగి ఈ 'ణ' కారమే పాదపాదానికీ పునరుక్తమౌతూ మరింత శబ్దాలంకారపు సొంపును నింపింది. లేనినాడు ఈ పద్యం సర్వసాధారణమైందే. ఈ పద్యంలో పోతన చిత్రకారుడు శారద బొమ్మగీచినట్లుగా ఆమెను సాలంకారంగా వర్ణించినాడు. పోతన పరిశుద్ధమైన వాక్కు కొరకు, వేదముఖుడైన బ్రహ్మ మనస్సునే వశీకరించుకునే శక్తి కలిగిన, తీపిమాట తల్లిని కొలవడం సమంజసంగానే ఉంది.

మ. హరికిన్ పట్టపుదేవి పున్నెముల
ప్రోవర్థంబు పెన్నిక్క చం
దురుతోఁబుట్టువు భారతీగిరిసుతల్
తోనాడు పూబోఁడి తా
మరలందుండెడి ముద్దరాలు
జగముల్ మన్నించు నిల్లాలు భా
సురతన్ లేములవాపు తల్లి సిరి
యిచ్చున్ నిత్యకల్యాణముల్.

పోతన ఆంధ్ర భాగవత ప్రారంభంలో లక్ష్మీదేవిని స్తుతిస్తూ వ్రాసిన పద్యం ఇది.

శ్రీహరికి పట్టపుటిల్లాలూ, పుణ్యాలరాశీ, సంపదలన్నీ నిలిచిఉండేచోటూ, చందమామకు తోడపుట్టిన ఆడబిడ్డ, భారతీ పార్వతులతో కలిసి ఆడుకునే పూవువంటి మెత్తని శరీరం కలిగిన స్త్రీ, కమలాల్లో నివసించే ముగ్ధ, సర్వలోకాలూ మన్ననతో చూచే ఇల్లాలూ, ఎంతో ఘనంగా దారిద్ర్యాలన్నిటినీ తొలగించే తల్లి శ్రీదేవి నిత్యకల్యాణాలనూ ఇస్తుంది అంటూ ఆశీఃపూర్వకంగా పద్యాన్ని చెప్పినాడు.

ముక్కుతిమ్మనాదుల ముద్దు పలుకులకు ఈపద్యం ఒరవడి ఐనట్లు గోచరిస్తుంది. దాదాపు పద్యం అంతా అచ్చతెనుగు మాటల్లోనే సాగింది. ఈ మత్తేభంలో ఉన్న నాల్గవపాదమధ్యంలో ఉన్న సిరి అనే విశేష్యానికి మూడు పాదాలూ విశేషణాలే అయినా పాదంలో ఏ పదానికి ఆపదమే సంపూర్ణంగా ఉంది. స్వయం సంపూర్ణాలైన ఈ పదాలన్నీ పొందికగా చేరుతూ ఆ శ్రీదేవిని కొలిచివచ్చినట్లుగా పద్యపాదంలో ఇముడ్తూపద్యానికీ ఆ కలుముల తల్లికీ నిండుతనాన్ని చేకూర్చినాయి. దీర్ఘసమాస భూయిష్ఠంగానూ, అలతి అలతి పలుకులతోనూ పద్యాన్ని నడిపించే సామర్థ్యం ఉన్నవాడు పోతన అనే విషయాన్ని ఈ పద్యం రుజువు చేస్తుంది.

ప్రపంచంలో లేమి వలని బాధ చాలా పెద్దది. ఈ దారిద్ర్యాన్ని తొలగించే శక్తి కేవలం లక్ష్మీదేవికే ఉంది. ఎందుకంటే ఆమె 'అర్థంబు పెన్నిక్క' అంటే సంపదలు ఉండే చోటు, ఆ అధికారాన్ని కలిగిన తల్లి కాబట్టే జగాలన్నీ మన్నిస్తాయి. అందుకే ఆ తల్లి అనుగ్రహ విశేషం అవసరం. ఆమె ఒక్కసారి కటాక్షించిందీ అంటే జగాలన్నిటికీ నిత్యకల్యాణమూ వచ్చుతోం దమే. మనం కూడా శారదా దుర్గలతోపాటు శ్రీదేవికి నతులుచేద్దాం.

తే. చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబులోనుగాఁ దలఁపడేని
గలుగనేటికిఁ దల్లుల కడుపుచేటు.

దాదాపు నలభై యాభై సంవత్సరాల క్రితం వరకూ ,పల్లెటూరి బళ్ళల్లో ఓనమాలతోపాటు కంఠస్థం చేయించే పద్యాలల్లో ఇదొకటి. పద్యం ఎంతో చిన్నది. పదాలన్నీ ఏ చిక్కూ లేకుండా సూటిగా అర్థాన్ని ఇస్తాయి. అయినా ఈ పద్యం మానవుని పుట్టుకలో, మనుగడలో ఉన్న పరమార్థాన్ని తెలిపేది.

పోతన కేవలం మాధవుణ్ణే భజిస్తూ, మంచినీ, మానవుణ్ణీ కాదనలేదు. అందుకే ఆకవి 'చేతులారంగ' అంటే చేతుల నిండుగా తృప్తితో శివపూజ చేయనివాడూ, 'నోరునొవ్వంగ' అంటే ఎల్లప్పుడూ హరినామ, గుణకీర్తనం చేయనివాడూ, సత్యమూ, దయా, మొదలైన మంచి గుణాలను గూర్చి ఆలోచించనివాడూ పుట్టడం కూడా వ్యర్థమే. వాడిజన్మ తల్లికడుపు పంటగా కాకుండా, తల్లికడుపు మంటగా నిలుస్తుంది అంటూ కొంత ఘాటుగానే మందలించినాడు·

ఈ పద్యంలో ·చేతులారంగ' అనే పదం పిసలైన తెలుగు పలుకుబడి. ఇట్లే నిండుతనాన్నీ, తృప్తినీ, సంపూర్ణమైన ఇష్టాన్నీ సూచిస్తూ ·మనసారా' 'నోరార' 'కడుపార' అనే జాతీయాలు మన తెలుగువారికి సొమ్ములైనవి.

ఈ పద్యంలో పోతన మొదటి పాదంలో ·శివపూజను' గూర్చి చెప్పి ,రెండవ పాదంలో 'హరికీర్తి' అన్నాడేమిటి? అనే

సందేహం రావచ్చు. శివ, కేశవ భేదం సామాన్యులకే కానీ సర్వజ్ఞులకు కాదు. అందుకే ఆ మహాకవి ఏ పేరైనాసరే దేవుడు ఒక్కడే: మన ఆపదలను తొలగించేవాడు 'హరి'; మనకు శుభాలను ఇచ్చేవాడు 'శివుడు'; ఈ రెండూచేసేవాడు పరాత్పరుడే. అందుకే శివకేశవులకు భేదం లేదు అంటూ లోకానికి చాటినాడు. ఇంతేకాదు, ఇంతకన్నా ముఖ్యంగా మానవుడు దయాగుణం కలిగి ఉండవలె, ఎదుటివాడి బాధలకు ఆనందించ కూడదు మాటకు నిలుకడ కలిగి ఉండవలె అని అన్నాడు. ఈ విషయం అన్నిటి కన్నా ముఖ్యమైందీ, కష్టతరమైంది కూడా! కనుక పోతన ఈ చిన్న పద్యంలో మానవ జీవితపు లక్ష్యాన్ని ఇమిడ్చి చెప్పినాడు అని చెప్పవచ్చు.

సీ. మెఱుఁగు చెంగటనున్న మేఘంబుకై వడి
 నువిద చెంగట నుండ నొప్పువాఁడు
 చంద్రమండల సుధాసారంబు పోలిక
 ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు
 వల్లీయుత తమాల వసుమతీజము భంగి
 బలువిల్లు మూఁపునఁ బరఁగువాఁడు
 నీలనగాగ్ర సన్నిహిత భానుని భంగి
 ఘన కిరీటము దలఁ గలుగువాఁడు
ఆ. పుండరీకయుగము బోలు కన్నులవాఁడు
 వెడద యురమువాఁడు విపుల భద్ర
 మూర్తివాఁడు రాజముఖ్యుఁడొక్కరుఁడు నా
 కన్నుఁగవకు నెదురఁ గానఁబడియె.

శ్రీమన్నారాయణుని కథను వర్ణించే కుతూహలంతో పరమేశ్వరి ధ్యానంలో మునిగిన పోతన మనోనేత్రాలకు కనిపించిన శ్రీరామచంద్రమూర్తి వర్ణనం ఈ పద్యం.

మెరుపు సమీపంలో ఉన్న మేఘంలా మెరుపు వంటి శ్రీ పక్కన ఉండగా చూడ చక్కనైన వాడూ, చంద్రమండల సారమైన వెన్నెలవలె కాంతివంతమైన ముఖంలో అమృతప్రాయమైన చిరునవ్వు వెన్నెలలు చిందేవాడూ, తీగె అల్లుకున్న చీకటిమ్రాను వలె పెద్ద విల్లును భుజాన మోపినవాడూ, కాటుకకొండ శిఖరాన్ని సమీపించిన సూర్యునివలె ఘనమైన కిరీటాన్ని తలపై ధరించినవాడూ, తెల్లతామరలవంటి స్వచ్ఛమైన కన్నులవాడూ, విశాలమైన వక్షస్థలం ఉన్నవాడూ, సర్వమంగళాలకు కుదురైన విగ్రహం కలవాడూ, రాజశ్రేష్ఠుడైన వాడొక్కడు నాకండ్లముందు ప్రత్యక్షమైనాడు, అంటూ పోతన ఆ స్వామి మంగళాకృతిని వర్ణించినాడు.

ఈ పద్యం ఆపాతమధురమైంది. అంటే శబ్దం చెవిలో పడగానే తియ్యని తీపిని అందించేది. చిత్రకారుడు కుంచెను చేతబట్టి శ్రీరామభద్రుణ్ణి తీర్చిన విధానంలో సాగిన పద్యం ఇది. శ్రీరామచంద్రమూర్తి నీలమేఘశ్యాముడనేది ప్రసిద్ధమైన విషయం. అందుకే పోతనామాత్యుడు ఆ నల్లని కాంతికిఅనువైన ఉపమానాలనే గ్రహించవలసి వచ్చింది. ఇక్కడ కేవలం నలుపే ప్రధానం కాదు. ఆ స్వామిలోగాంభీర్యం, ప్రాభవం, వైభవం, అభయం, వాత్సల్యం అన్నీ ఉండవలె. అంతేకాదు; ఆ శ్యామలాంగుడు ఒంటరివాడుకాడు, అనపాయినియైన అమ్మవారుప్రక్కనేఉన్నవాడు. ఎప్పుడూ పాయని వింటినీ తదితర రాజచిహ్నాలనూ ధరించికూడా ప్రసన్నంగా చిరునవ్వులు చిలుకుతున్నవాడు. అందుకే ఆ మంగళ

మూర్తిని మేఘంలా, చీకటిమాగ్రినులా, నీలపుకొండగా ఉపమిస్తూ ఆ స్వామి అలంకారాలను తీవియగా, సూర్యునిగా చెప్పినాడు. స్వామికి చైతన్యాన్నీ, కాంతినీ సమకూర్చేది హ్రీంకారరూపిణీ, హ్లాదినీశక్తి అయిన అమ్మవారు. అందుకే ఆ తల్లి మెరుపు వంటిది. లోకాలను శాసించేదక్షతతో కిరీటాన్నీ వింటినీ ధరించి ప్రసన్నుడై, భద్రమూర్తితో ఉన్నవాడు కాబట్టి మంగళకారకుడు. భక్తజన మందారమైన భగవంతుడు భక్తులకు ఎల్లప్పుడూ వరదుడేకదా!

ఆ. వేదకల్పవృక్ష విగళితమై శుక
ముఖసుధాద్రవమున మొనసియున్న
భాగవత పురాణ ఫల రసాస్వాదన
పదవిఁ గనుఁడు రసిక భావవిదులు.

పోతన భాగవత ప్రారంభంలో ఆ భాగవత గ్రంథమాహాత్మ్యాన్ని పొగడుతూ వ్రాసిన పద్యం ఇది.

పోతన దృష్టిలో భాగవత పురాణం ఒక ఫలం. అయితే ఈ పండు సామాన్యమైంది కాదు. అది వేదం అనే కల్పవృక్షం నుండి జారిపడినట్టిది. అంతేకాదు; ఆ పండు శుక ముఖామృత రసంతో తడిసినట్టిది. ఇన్ని తీరుల తీపిని పెంచుకున్న ఈ భాగవత ఫలరసాన్ని ఆస్వాదించే స్థితిని పొందండి, అంటూ రసజ్ఞులను కోరినాడు.

సాధారణంగా భారతీయమైన సంస్కృతికి మూలాధారం అని చెప్పబడే పురాణ వాఙ్మయం అంతా వేదోపబృంహణార్థమే అనే నమ్మకాన్ని పురాణేతిహాస గ్రంథాలను తెలుగు చేసిన కవు

లందరూ ప్రచారం చేసినారు. ఆమార్గాన్ని అనుసరిస్తూనే పోతన కూడా భాగవత పురాణాన్ని వేదకల్పకం ఫలించిన పండుగానే స్థిరపరిచినాడు. కానీ అన్ని పురాణపు పండ్ల వంటిది ఈ పండు కాదు. ఇది శుక ముఖ సుధాద్రవంలో మొనసింది. ఇక్కడ "శుక" శబ్దానికి ఉన్న రెండర్థాలను పోతన ఎంతో జాణతనంతో వాడుకున్నాడు. శుక = చిలుక; శుక = వ్యాసమహర్షి కుమారుడైన శుకయోగి. ఇక్కడ ఈ రెండర్థాలు పంచచ్ఛ శుద్ధితో పొదిగి అర్థస్వారస్యాన్ని ఇనుమడింప చేసినాడు.

భాగవత గ్రంథాన్ని వేదవ్యాసుడు వ్రాసినా, మృత్యుముఖంలో ఉన్న పరీక్షిన్మహారాజుకు వినిపిస్తూ సూతపౌరాణికుని ద్వారా ప్రచారంలోకి కొనివచ్చింది శుకుడే. అందుకే ఈ భాగవతం అనే ఫలరసానికి శుకుని మాటతీపి రుచిని పెంచింది. ఇక రెండవ అర్థంలో చిలుక కొరికిన పండుకు తీపి ఎక్కువ అనే విషయం అందరికీ తెలిసిందే. ఇన్ని విశిష్ట లక్షణాలతో కూడుకున్న ఫలరసాన్ని అనుభవించడం కూడా ఒక భాగ్య విశేషమే. ఆ అనుభవానికి అందరూ నోచుకోరు. అందుకే పోతన ఆ భాగవత ఫలరసానుభవ పదవిని పొందుమంటూ రసిక భావవిదులైన వారిని కోరినాడూ, హెచ్చరించినాడు.

సీ. నారాయణుని దివ్యనామాక్షరముల పైఁ
గరఁగని మనములు కఠిన శిలలు
మురవైరి కథలకు ముదితాశ్రు రోమాంచ
మిళితమై యుండని మేను మొద్దు

చక్రికి మ్రొక్కని జడుని యొదలనున్న
కనక కిరీటంబు గట్టెమోపు
మాధవార్పితముగా మనని మానవుని సిరి
వనదుర్గ చంద్రికావైభవంబు

ఆ. కైటభారి భజన గలిగి యుండనివాఁడు
గాలిలోన నుండి కదలు శవము
కమలనాభుపదము గననివాని బ్రదుకు
పసిఁడికాయలోని ప్రాణి బ్రతుకు.

నారాయణుని యందు భక్తి కలిగి బ్రతుకలేని జీవిజన్మం వ్యర్థం అంటూ శ్రీశుకుడు పరీక్షిత్తుకు తెలియ చెప్పిన సందర్భం లోనిది ఈ పద్యం.

నారాయణుని దివ్యమైన పేరును సూచించే అక్షరాలు చెవి సోకగానే భక్తుని మనస్సు ద్రవించి పోతుంది. ఆ విధంగా ద్రవీభూతంకాని చిత్తాలు కఠినమైన బండరాళ్లతో సమానం. అట్లే మురవైరి ఐన శ్రీహరి కథలు వింటూ పట్టరాని సంతోషంతో కండ్ల వెంబడి ఆనందాశ్రువులు రాలుతుండగా శరీరంపై పులకలు ఎత్తవలె. అట్లా కాని మేను అది మొద్దుతో సమానం. వాడు రాజైనా సరే శ్రీహరికి నమస్కరించని ఆ మూర్ఖుని తలపై ఉన్న బంగారు కిరీటం, అదొక కట్టెల మోపుతో సమానం. భాగ్య వశంతో మానవునికి సంపదలు కలిగినప్పుడు ఆ సంపత్తిని శ్రీహరికి అర్పితంగా, అంటే ఆయనకు ప్రీతినికలిగించే మంచి పనులకు, ఉపయోగిస్తూ జీవించవలె. లేనినాడు ఆ ధనం అంతా

అడవి కొండల్లో కాసిన వెన్నెల వైభవం వలె వ్యర్థ మౌతుంది. అట్టే శ్రీమహావిష్ణు భజన చేయనివాడు జీవచ్ఛవం వంటివాడు. అంటే బ్రతికి చచ్చిన వాడే. ఊపిరి లోపల ఉంది కాబట్టి ఆ శవప్రాయమైన శరీరం కదులుతూ ఉంది; అంతేకాని సప్రాణి ఐనవాడు కాడు. నిజంగా వాడు జీవితుడైతే హరిభజన తప్పడు కదా! ఈ విధంగానే బొడ్డుతామర వేల్పైన ఆదివిష్ణువు పదాన్ని చూడలేని వాని బ్రతుకు పట్టుకాయలో జీవించే పట్టుపురుగు వంటిదిగా ఉంటుంది. అందుకే జీవించే ప్రతి జీవికి శ్రీహరి కీర్తన, వందన, శ్రవణ, రాగాతిశయరూపమైన భక్తి ముఖ్యం అంటూ ప్రబోధించినాడు పోతన.

ఇక్కడ కమలనాభు పదం అంటే ఆ హరిస్థానమైన వైకుంఠపదం అనీ, ఆ స్వామి పాదసేవనమూ అనే అర్థాలు గ్రహించవచ్చు. కమలనాభుని పదాన్ని కనడం సామాన్యం కాదు. అర్హతలకు తగినట్లుగా ఈ రెంటిలో ఒక అర్థాన్ని స్వీకరించవచ్చు.

క. భూషణములు వాణికి నఘ
పేషణములు మృత్యు చిత్త భీషణములు హృ
త్తోషణములు కల్యాణ వి
శేషణములు హరిగుణోపచిత భాషణముల్.

శౌనకాదిమహర్షులు సూతుని, తమకూ సమస్తభూతజాలానికీ సుఖాన్ని ప్రసాదించే శ్రీహరికథలను చెప్పమంటూ ప్రార్థిస్తూ, ఆ హరికథా మాహాత్మ్యాన్ని వారే పొగడినప్పటి పద్యం ఇది.

శ్రీహరిగుణాలను ఏరికూర్చిన సంభాషణలన్నీ పలుకులకు అలంకారాలుగా ఉంటాయి. అవి పాపాలన్నింటినీ పిండిపిండి చేస్తాయి, అంటే తొలగిస్తాయి. సమస్తజీవుల ప్రాణాలకు ఉత్తరాధికారులై, ప్రాణులందరికీ భయాన్ని కలిగించే మృత్యుచిత్తానికే భయాన్ని పుట్టిస్తాయి. ఇంతేకాదు ఈ శ్రీకృష్ణగాథలు హృదయాలకు సంతోషాన్నీ, తృప్తినీ కలిగిస్తాయి. ఈ కథలు ఎప్పుడూ మంగళాత్మకాలై విశిష్టమైన శుభాన్ని చేకూరుస్తాయి.

సాధారణంగా ఒకదృష్టితో లౌకికవిషయంతో కూడుకున్న కథలు మన మనస్సులకు అశాంతినీ, సంక్షోభాన్నీ కలిగించవచ్చు; కానీ అలౌకికాలైన హరి గుణవిశేషాలూ, ఆ గుణాలతో వృద్ధి పొందిన కథలూ పురుషోత్తముని కథలుగా పరిపూర్ణంగా ఉంటాయి. మంచినంతా ప్రోగుచేసి చెప్పవచ్చు. అప్పుడది పుణ్యవస్తుకం అవుతుంది. పుణ్యకథాసంకీర్తనం కానీ శ్రవణంకానీ చెప్పేవారి వాక్కుకు అలంకారంగానూ వినేవారి చెవులకు విందుగానూ ఉంటుంది.

పోతన ఈ పద్యంలో శ్రీహరి గుణసంకీర్తన, శ్రవణాదులు పాపవిధ్వంసకాలై శుభాలను కురిపిస్తాయి అనే భావాన్ని ప్రచారం చేసినాడు.

కం. హరి మయము విశ్వమంతయు
హరివిశ్వమయుండు సంశయము పనిలేదా
హరిమయము గాని ద్రవ్యము
పరమాణువు లేదు వంశపావన వింటే !

కాలం సమీపింపగా పారమార్థికపు చింతతో సులభమైన తరణోపాయాన్ని చెప్పుమని ప్రశ్నించిన పరీక్షిత్తుకు శుకయోగి సకలశరణ్యుడు శ్రీహరే అంటూ చెప్పి, ఆతనిపై ధారణ కుదిరే ఉపాయాన్ని బోధిస్తూ, శ్రీహరి సర్వమయత్వాన్ని విశదపరుస్తూ చెప్పిన చిన్న కందపద్యం ఇది.

సకల చరాచరరూపమైన ఈ జగత్తుఅంతా హరిమయమే. అసలైతే హరికూడా విశ్వమయుడు- అంటే విశ్వమంతాతానే నిండుకుని ఉన్నవాడు. అందుకే, ఓ వంశపావనుడవైన పరీక్షిన్మహారాజా! హరిమయంకాని పదార్థం ఈ ప్రపంచంలో పరమాణువు- అంతే స్వల్పాతి స్వల్పమైంది-కూడాలేదు, విన్నావా; అంటూ సర్వసముడైన శుకయోగి వ్యక్తంచేసినాడు.

ఈ పద్యాన్ని బాగా ఆలోచించిచూస్తే ఇందులో ఉపనిషద్రహస్యరూపమైన మహార్థం ఇమిడి ఉన్నట్లు గోచరిస్తుంది. "ఈశావాశ్య మిదం సర్వం యత్ కించజగత్యాం జగత్" అనే మహావాక్యార్థాన్ని పోతన గ్రహించి శ్రీహరి సర్వవ్యాపకత్వాన్నీ, సర్వాధిపత్యాన్నీ స్థాపిస్తూ చెప్పినట్లుతోస్తుంది. పిపీలికాది బ్రహ్మపర్యంతం హరిమయమే ఐనప్పుడు ఇక ఆహరి ఉన్నాడా? లేడా? అనే ప్రశ్నకు తావేలేదు. ఇక చేయదగ్గది మాత్రం ఆయనపై మనస్సు కేంద్రీకరిస్తూ నిలకడను అలవరచుకోవడం మాత్రమే. చివరి మెట్టులోఉన్నవారు చేయకతప్పనిపని ఇదేసుమా, అంటూ పోతన సూటిగా చెప్పినాడు.

క. జోజో కమలదళేక్షణ !
జోజో మృగరాజ మధ్య! జోజో కృష్ణా!
జోజో పల్లవ కరపద !
జోజో పూర్ణేందువదన జోజో యనుచున్.

చూడవచ్చిన గోపకాంతలు కృష్ణయ్యకు తలనూనెలంటి, లాలపోసి, జోలలు పాడిన విధానాన్ని వర్ణించిన పద్యం.

జోజో కమలరేకులవంటి కన్నులు గలతండ్రీ ! జోజో సింహమువంటి నడుముకలవాడా ! జోజో కృష్ణా ! జోజో పల్లవ కరపద అంటే చిగురుటాకులవంటి మెత్తని పాదాలూ, చేతులూ కలవాడా : జోజో పున్నమచంద్రునివంటి మోముకలవాడా! జోజో కన్నా! అంటూ జోలపాటలు పాడినారు.

పోతన్నవ్రాసింది కందపద్యమైనా, శ్రీకృష్ణునివిశేషణాలకు ముందు చేరిన 'జోజో' అనే రెండక్షరాలు చదివేవారిని జోజో మ్మంటూ జోకొడ్తూ జోలపాటగా భ్రమింప చేస్తున్నవి. తమకు గారాబాల చెండైన పాపను ప్రేమకొద్దీ పర్ణిస్తూ మురిపాలు ఒలికిస్తూ బజ్జోనాన్నా అంటూ రాగాలు తీస్తూ అనురాగాలు చిందిస్తారు; అవే జోలపాటలూ, లాలిపాటలూ. కృష్ణయ్యజోలలూ, రామయ్య లాలిపాటలే మన కన్నయ్యలకూ, చిన్నమ్మలకూ ఈ నాటికీ పనికి వచ్చేపాటలు. ప్రతిచిన్నారినీ నిద్రపుచ్చే సమ్మోహనాస్త్రం ఈ జోలపద్యం.

తే. పాపనికి నూనెఁ దలయంటి పసుపుఁ బూసి
బోరుకాడించి హరిరక్ష బొమ్మటంచు

జలము లోకకొన్ని చుట్టి రాజల్లి తొట్ల
నునిచి దీవించి పాడిరయ్యువిదలెల్ల.

చిన్నికృష్ణయ్యను చూడవచ్చిన గోపకాంతలు వారి వారి ఆచారాలను పురస్కరించుకుని ఆప్యాయతలను చూపిన విధానాన్ని వర్ణిస్తూ చెప్పిన పద్యం ఇది.

పసిపాపనికి తలనూనె అంటీ, పసుపుపూసీ, లాలలుపోసీ, కొన్నినీళ్ల కొప్పెర్లలో మిగిలించి మిగిలిన నీళ్ళను చేతులతో తీసుకుంటూ చుట్టుతిప్పి, హరిరక్ష పో అంటూ చల్లి, దీవిస్తూ తొట్టెలలో ఉంచీ పాటలు పాడినారట.

పల్లెటూళ్ళలో ఇప్పటికీ పసిపిల్లల మాడుకు రోజుకూ నాలుగైదు సార్లైనా నూనెఅంటడం పరిపాటి. కేవలం ఇంటివారే కాదు. చూడవచ్చిన స్త్రీలూ పసివారికి నూనెలంటడం ఆప్యాయతకు చిహ్నం. ఇట్లాగేచంటివాళ్లను కాళ్ళపై వేసుకునినీళ్లుపోసీ, కొన్ని నీళ్ళ దిష్టితీసినట్లుగా పసిపాపచుట్టూ తిప్పి చల్లుతూ 'శ్రీరామరక్ష' అంటూనో, హరిరక్ష అంటూనో వీపుమీదకొట్టి పాపను పైకితీసుకుంటారు. అట్లాగే గోపెమ్మలంతా చిన్నికృష్ణయ్యకు నూనెలంటీ, లాలలు పోసీ, హరిరక్షగా నీళ్ల చుట్టురా చిలుకరించీ, తొట్టెలల్లో వేసి పాటలు పాడుతూ ఆనందించినారు. గ్రామీణాలైన ఆచారాలను బాగా ఆకళించుకున్న పోతన వాటిని తప్పక వర్ణిస్తూ భాగవతానికి సహజత్వాన్ని కల్పించినాడు.

ఆ. ఏమి నోముఫలమొ యింత ప్రొద్దొక వార్త-
వింటి మబలలార ! వీనులలర

మన యశోద చిన్నిమగవానిఁ గనెనఁట
చూచివత్తమమ్మ ! సుదతులార!

యశోద నీల్లాపి మగబిడ్డను కన్నది అనేవార్త గొల్లపల్లె అంతా వ్యాపించింది. తమకు ఏలికఐన నందగోపునికి ఇంతకాలం సంతానం కలుగలేదు. వయసు కొంత పడమటికి తిరిగే కాలాన ఆయన ఇల్లాలు యశోద కడుపు పండి కొడుకు పుట్టినాడు. అందుచే గొల్లభామలంతా చేరి సంబరంతో చూచివత్తాంరండే అంటూ ఒకరిని ఒకళ్లు పిలుస్తు ఉన్నతీరును వర్ణించిన పద్యం ఇది.

ఏమి నోము నోచుకున్నామో కానీ ఓ చెలులారా! ఇంత కాలానికి మన చెవులన్నీ సుఖపడేటట్లు ఒక మంచి సమాచారం విన్నాం. మన యశోద చిన్నిమగబిడ్డను కన్నదంట, చూచివత్తాం పదండే తల్లులారా! అంటూ నడిచినారట.

ఈ పద్యం ఎంతో సరళమై సహజంగా ఉంది. పల్లెటూరి ఆడవాళ్లకు ఏ స్త్రీ ఐనాసరే గొడ్డువీగి సంతానవతికావడం సంతోష కారణం. అందులోనూ కానక కానక కన్నసంతానం. అదీ మొగ బిడ్డ కావటం. ఆ పుట్టింది ఎవరికో కాదు, తమ ఏలికసాని యశో మ్మకే. అందుకే గోకులంలో గోపెమ్మ లందరికీ ఆవార్త అంద రికీ ఆనందాన్ని కలిగించే చల్లనిదయింది.

సీ. తనువున నంటిన ధరణీ పరాగంబు
పూసిన నెఱిభూతి పూఁత గాఁగ
ముందట వెలుఁగొందు ముక్తాలలామంబు
తొగల సంగడికాని తునుక గాఁగ

ఫాలభాగంబుపైఁ బరగు గావలిబొట్టు
కాముని గెల్చిన కన్నుగాఁగ
కంఠమాలికలోని ఘననీల రత్నంబు
కమనీయమగు మెడకప్పు గాఁగ.

ఆ. హారవల్లు లురగహారవల్లులు గాఁగ
బాలలీల బ్రౌఢబాలకుండు
శివుని పగిది నొప్పె శివునికేంటి సకును
వేఱు లేమిఁ దెలుప వెలయునట్లు.

శ్రీకృష్ణుడు యశోదకు అద్దాలబిడ్డడై పెరుగుతూ కనువిచ్చి చూడ నేర్చి, నవ్వనేర్చి, అడుగులువేయనేర్చి పెరుగునప్పటి స్థితిని వర్ణిస్తూ చెప్పిన పద్యం ఇది. ఈ పద్యంలో పోతన హరిహరులకు అభేదాన్ని చెబుతూ శ్రీకృష్ణునికి శివత్వాన్ని రూపింపచేసినాడు.

తన శరీరానికి అంటుకున్న భూమిరజము అంటే దుమ్మే నిండుగా పూసుకున్న విభూతిపూత కాగా, ముక్కుచివర పెట్టిన పెద్దముత్యమో, లేక ముంగొప్పున అంటే ముందర కట్టిన కొండికి పెట్టిన ముత్తెపు సొమ్మో కలువల సఖుడైన చంద్రుని తునక కాగా అంటే చంద్రరేఖకాగా, నుదుట రక్షగా పెట్టిన కావిరి బొట్టు అదే మసిబొట్టు మన్మథుని దహించిన మూడవ కన్నుకాగా మెడకండలో ఉన్న పెద్ద నీలమణి అందంగా మెడను అలంకరించిన నలుపుకాగా, మెడను పెట్టిన దండలు పాముపేర్లు కాగా, బాలలీలలోఉన్న ప్రవృద్ధుడూ, నేర్పరియైన ఈ పిల్లవాడు శివునికే

తనకూ భేదంలేదు అంటూ తెలిపే కొరకే వెలసినట్లు శివుని విధంగా అందగించినాడు- అంటూ పోతన ఉత్ప్రేక్షించినాడు. శివుడు విభూతిపూత కలవాడూ, బాలేందు రేఖను ధరించినవాడూ, నుదుట మూడవ కన్ను ఉన్నవాడూ, కంఠంలో గరళాన్ని నిలుపడంతో నల్లనైన కుత్తుక గలవాడూ, పాములను దండలుగా వేసుకున్నవాడూ—ఈ లక్షణాలన్నీ ఆయా విశేషాలచేత శ్రీకృష్ణునికి ఆపాదిస్తూ 'వాడే వీడు' అంటూ అభేద ప్రతిపత్తిని కల్పిస్తూ పోతన రచించినాడు. ఈ సంభావనవల్ల శివుడు వేరూ కేశవుడు వేరూ అనే భావం సన్నగిల్లి, దేవుళ్ళంతా ఒక్కటే అనే ఆస్తిక భావాన్ని అలవర్చుకోవాలంటూ పోతన కల్పించిన సుందర కల్పనం ఇది. విభేదంలోకూడా అభేదాన్ని చూచే ఉదారబుద్ధి పోతనామాత్యుడు.

క. చాలదు భూదేవత్వము
చాలదు దేవత్వ మధిక శాంతత్వంబున్
చాలదు హరి మెప్పింప వి
శాలోద్యములార! భక్తి చాలిన భంగిన్.

భక్తి ప్రభావాన్ని గూర్చి బోధిస్తూ ప్రహ్లాదుడు చెప్పిన పద్యం ఇది.

విశాలమైన ప్రారంభమూ, గొప్ప ప్రయత్నమూ తలపెట్టిన ఓ జనులారా! శ్రీహరిని మెప్పించడానికి భక్తి చాలినంతగా—అంటే భక్తికి చేతనైనంతగా—బ్రాహ్మణత్వం అంటే కులీనత శక్తివంతం కాదు, దేవత్వమూ తగినంతది కాదు, పోనీ ఎంతో గొప్పదైన శాంతత్వమూ సరిపోదు— అంటూ చెప్పినాడు.

పోతన దృష్టిలో హరిని మెప్పించడానికి 'భక్తి' ఒక్కటే సాధనం. ఆయనను మెప్పించి వశీకరించుకోవడానికి విప్రులైన దేవతలుకానీ, పరమహంసలైన మునులుకానీ, అన్ని ఉపాధులను మరిచి ఆ స్వామినే నమ్ముకున్న భక్తులవలె సమర్థులు కారు. ఈ పద్యంలో పోతన 'చాలిన' 'చాలదు' అనే తెలుగు పదాలను వాడి, గట్టి అర్థాన్ని అందులో ఇమిడించినాడు. ఆయన హృదయాన్ని అందివ్వడానికీ భక్తి మాహాత్మ్యాన్ని ప్రకటించడానికీ ఇదే అర్థంలో మరే ఇతర సంస్కృత పదాన్ని వాడినా ఈ బిగువు చాలి ఉండేదికాదు. ఈ పద్యం చాలు పోతనకు తెలుగు జాతీయంపై ఉన్న అధికారాన్ని ప్రకటించడానికి.

ఒక మహాప్రయత్నాన్ని ప్రారంభించిన వారికి పోతన, భక్తిని ఉపకరణంగా స్వీకరించుమని, సూచన చేసినట్లుగాకూడ విశాలోద్యములారా! అనే సంబోధన ధ్వనిస్తుంది.

ఉ. చప్పుడు సేయకుండుమని జంకె యొనర్చిననల్గిపోవఁగా
నప్పుడు బారసాచి తన నవ్వుల విందులు వచ్చిరంచు న
వ్వొప్పఁగఁజీరు తల్లిదెసకొత్తిలికృష్ణుడు రంతుసేయుచు
న్నప్పుడు వచ్చి చన్గుడుచు నవ్వొలయన్ మొలగంట
మ్రోయఁగన్.

ఏమి నోముఫలమోకానీ నీలమేఘశ్యాముడైన శ్రీహరి యశోదకు కొడుకైనాడు. ఇంక ఆ తల్లీకొడుకుల సంబరాలు వింప గావలె చాలడం లేదు. దినమొక్క ఆటగా, క్షణమొక్క లీలగా గడుస్తుంది వారికి. ఆ చల్లని తల్లి సాక్షాత్తు బ్రహ్మానందంలో

మునిగితేలుతూ ఉంది. శ్రీకృష్ణుని బాలలీలను వర్ణిస్తూ పోతన చెప్పిన పద్యం ఇది.

వద్దు సేయకు మంటూ తల్లి బెదురుచూపగానే కొడుకు అల్గుతూ దూరం జరిగిపోతాడు. అప్పుడు తల్లి రెండు చేతులు బారగా చాస్తూ నవ్వులు అలంకరించిన ముఖంతో ''నా నవ్వుల పండుగలూ, నా నవ్వుల అతిథులు వచ్చిరమ్మా!'' అంటూ పిలిచే తల్లి దిక్కుకు దగ్గరగా ఒదుగుతూ రంతుచేస్తూ, మొలగంటలు మ్రోగగా, నవ్వుతూవచ్చి యశోదమ్మ చనుకుడుస్తాడు చిన్ని కృష్ణుడు అంటూ వర్ణించినాడు.

ఈ పద్యంలో పోతన నిజంగానే నవ్వులవిందు చేసినాడు. రంతు చేయకుమంటూ తల్లి చూపిన బెదరింపులూ, అందుకు కృష్ణులవారి అలకలూ ఉత్తుత్తవే! బుంగమూతితో కళ్లు మరింత పెద్దవి చేసిన కమలదళాక్షుని అలుక ఎడ్డితల్లి యశోదమ్మను జలజలా పారించింది. అప్పుడే ఆమె రెండు చేతులు నిండుగా చాచి 'నానవ్వుల బువ్వలూ', 'నానవ్వుల విందులూ,వచ్చిరోలేదో? వచ్చిరొచ్చిరంటూ' 'ముఖమంతా నవ్వుపులుముకుంటూ ఆ త్రిజ గన్మోహనుణ్ణి పిలుచుకుంది. మసితాకని మనస్సుల పిలుపుకట్టే మైనంలా కరిగే కరుణామయుడు శ్రీహరి; పైగా తల్లికి మురిపాలె బిడ్డడూ. అనురాగరసం వర్షించే ఆ పిలుపు విని ఊరుకుంటాడా? ఉరుకుతూ వస్తాడు. కానీ రావటంలో కూడా బెట్టుసరే! మెల మెల్లగా తల్లి వైపుకు ఒదుగుతూ,మొలగజ్జెలతోపాటు తానూ రంతులు చేస్తూ వచ్చివచ్చి అమృతాలు వర్షించే తల్లి రొమ్మును అందుకుని నవ్వులు అందగిస్తున్నాడు చిన్ని కృష్ణయ్య. ఈ పద్యపు భావన

ఎంతో సహజమై సుందరంగా ఉంది. పసిబిడ్డల సహజచేష్టను కృష్ణవ్యపదేశంతో ఇంత కమ్మగా వర్ణించి విందు చేసిన పోతన స్మరణీయుడు.

క. ఓయమ్మ : నీ కుమారుడు
మా యిండ్లను బాలు పెరుగు మననీఁడమ్మా
పోయెద మెక్కడికైనను
మాయన్నల సురభులాన మంజులవాణీ!

శ్రీకృష్ణుడు నడకనేర్చి గొల్లపల్లెలో ఇల్లిల్లా తిరుగుతూ, అల్లరి పనులు మొదలు పెట్టినాడు. ఈ తులువ చేష్టలు పాలూ మీగడల దోపిడీతో మాత్రమే పోలేదు. అవి క్రమిమించి రాగాన పడ్డట్లు కొంత మితిమీరినవి. పెద్దింటి బిడ్డ ఆగడాలు సహించలేని గోపికలందరూ యశోదను చేరి కృష్ణయ్య అల్లరి చేష్టలు వర్ణించి చెప్పి చివరకు తాము చేయదలచుకున్న పని నివేదించుకున్నప్పటి పద్యం ఇది.

ఇంపైన మాటలు చెప్పే ఓ యశోదమ్మా! నీ కొడుకు మా ఇండ్లలో పాలుగానీ పెరుగుగానీ ఉండనీయడు తల్లీ, మా తోబుట్టువుల ఆవులమీద ఒట్టు! ఇక్కడ ఉండలేము ఎక్కడికైనా పోతాము అంటూ చెప్పినారు. పాలూపెరుగులు అమ్ముకుని జీవించేవారు గొల్లలు. వారికి జీవనాధారం ఐన ఈపాలనూ పెరుగునూ ఉండనీయక కృష్ణయ్య తింటూ ఒలకబోస్తూ ఆగడంచేస్తున్నాడు. బెదురుపెట్టడానికి వీలులేదు. పెద్దగొల్లబిడ్డ కదా! ఏమీ అనకుండా చూచీ చూడకుండా ఉందామన్నా వీలుపడదు. అట్లా అయితే బ్రతికే గడవదు. అందుకే ఓ యశోదమ్మా! నీకు ఎన్ని

సార్లు చెప్పినా కమ్మగా మెత్తని మాటలు చెప్పి పొమ్మంటు న్నావు! ఈసారి అట్లా కుదరదు. మా ఇండ్లూ వాకిండ్లూ వదలి ఎక్కడికన్నా పోతాం. పోరని అనుకుంటావేమో మా అన్నలాన! అవులానసుమా! అంటూ గట్టి మాటలే చెప్పినారు.

మొదట హరివంశములో ఎఱ్ఱన ప్రారంభంచేసిన ఈ భావన పోతన చేతిలో సరళతను సంతరించుకొని అందరి నోళ్లలో నాస్తూ, ఆబాల గోపాలానికి అంగిటలో మెదిలే తెలుగు పద్యంగా నిలిచింది. గ్రామీణ నాగరిక భేదం లేకుండా ఎప్పుడూ మరుపు రాని పద్యం ఇది.

క. గజ్జెలు ఘల్లని మ్రోయఁగ
  నజ్జలుఁ ద్రొక్కుటలు మాని యతిజపమున యో
  షిజ్జనములు నగఁ దల్లియుఁ
  బజ్జం జనుదేర నతఁడు పరువిడె నధిపా!

లీలా మానుష విగ్రహుడైన శ్రీకృష్ణుని లీలలు అత్యద్భుతాలు. అందులో బాలలీలలు మోడుబారిన ఎదలను కూడా చిగురింపచేస్తాయి. కృష్ణమూర్తి చేస్తున్న అల్లరి తల్లియశో దమ్మ చెవిదాకా సోకినప్పుడామె దండించడానికి ప్రయత్నించగా తల్లిచేతికి చిక్కక పరుగులెత్తిన కృష్ణలీలను వర్ణిస్తూ చెప్పిన పద్యం ఇది.

కాలికి అందెలుగా కట్టిన గజ్జెలు ఘల్లు మంటూ మ్రోగే రీతిగా నాటకాలు తొక్కడం మాని, అక్కడవున్న ఆడవాళ్లంతా నవ్వుతూ ఉండగా తల్లి దండిస్తానంటూ వెనుదరుముకవస్తూ ఉంటే కృష్ణుడు వేగంతో పరిగెత్తినాడట.

యశోదమ్మకు కృష్ణయ్య లేకలేక కల్గిన సంతానం. అందుకే ఆ చిన్ని పాదాలకు ఘల్లుఘల్లున మ్రోగే గజ్జెలు సింగారించింది. ఆ గజ్జెలతో ఈ గారాబాల గిలక, లయానుకూలంగా పాదాలువేస్తున్నట్లు గజ్జెలు ఘల్లు ఘల్లు మంటూ నాదిస్తూ ఉంటే చిందులు తొక్కినట్లు నటిచేవాడు. ఇంత నాజూకులు పోయే కృష్ణయ్య తల్లి బారినుంచి తప్పించుకునేందుకు టక్కు టిక్కులు వదిలి వేగంతో పరుగెత్తినాడు, అయినా వెర్రితల్లి యశోదమ్మ పారే కొడుకును పట్టుకుంటానంటూ వెంట పరుగెత్తుటానే వుంది. చూచేవాళ్లందరికీ వినోదంగానే ఉంది ఈ దృశ్యం; అందుకే నవ్వుతున్నారు. అప్పటి ఆ స్త్రీలే కాదు; ఈ పద్యాన్ని చదివిన మనం కూడా ఆ దృశ్యాన్ని మనోవీథిలో దర్శిస్తూ నవ్వకుండా ఉండలేము కదా!

ఊపిరి సలుపనీయని ఈ పరుగుపందెపు జీవితంలో ఈ పద్యాన్ని చదివే అవకాశం దొరికిన వారెంత ధన్యులే!

మ. స్తనభారంబున డస్సి క్రుస్సి
యసదై జవ్వాడు మధ్యంబుతో
జనిత స్వేదముతోఁ జలత్క
బరితో స్రస్తోత్తరీయంబుతో
వనజాతేక్షణ కూడఁబాఱి
తిరిగెన్ వారించుచున్ వాకిటన్
ఘనయోగీంద్ర మనంబులున్
వెనుకొనంగా లేని లీలారతున్.

తమ ఇంట్లో వెన్నలూ పాలు మీగడలూ దొంగిలించినా డంటూ గొల్లభామలు చేసిన ఫిర్యాదును విన్న యశోద కొడుకును దండించడానికి పూనుకుంది. అది పసిగట్టిన జాణ ఆ తల్లికి చిక్కకుండా పరుగుతీసినాడు. అయినా తల్లి తన ప్రయత్నాన్ని విడువక వెనువగుల్తూ తాను పరుగెత్తింది. అట్లా కృష్ణుని వెంబడిస్తూ తిరుగుతున్న యశోదను చిత్రించిన పద్యం ఇది.

చనుకట్టు బరువుతో అలసీ సొలసిన సన్నని నడుము తూగాడుతుండగా, ముచ్చెమటలు పోస్తూ చలిస్తూన్న కొప్పుతో, జారిపోతున్న ఉత్తరీయంతో, తామరలవంటి కన్నులున్న యశోద గొప్ప గొప్ప యోగీంద్రుల మనస్సులే వెంబడించలేని లీలాసక్తుడైన శ్రీకృష్ణుని వెంబడిస్తూ, ఆగు ఆగు అని నిలువరింపజేస్తూ వాకిలంతా తిరిగింది—అంటూ వర్ణించినాడు.

గాలిగా పరుగెత్తేవాడు పిల్లవాడైన కృష్ణుడు. అసలు ఉందా లేదా అనే అంతటి సన్నని నడుమున్నది యశోద. మొదలే స్తన భారాన్ని మోయలేక అలసిఉంది. దానికి తోడిప్పుడు ఈ పిల్ల వాని వెంబడి పరుగెత్తడంతో ఆనడుము ఇంకా అలసి తూగాడుతూ ఉంది. తీగెలా చలిస్తున్ననడుముతో, శ్రమవల్ల పుట్టిన చెమటతో, జారిపోతున్న పైకొంగుతో· అయ్యో పాపం అంటూ దయపుట్టిస్తుంది. మాతృస్థానంలో ఉంది యశోద కాబట్టి ఆదరానికి స్థానమైంది; లేకపోతే ఈ వర్ణనంలో శృంగారరసాన్ని ఉద్దీపింపజేసే విభావాదులను చూడవచ్చు. అమాయిక ఐన యశోద తాను వెంబడిస్తున్నది ఎవరినో కాదు. ఘన యోగీంద్రుల మనంబులే వెంబడించలేని లీలారతుడైన జగదీశ్వరుణ్ణి. అయితే ఏం? తాను తల్లి ఆయన కొడుకు, అంతే! లోకాలకు రాజైనా తల్లికి కొడుకే కదా!

పరమ ప్రేమ రూపమైన తన చిత్తాన్నే పాలుగా స్రవింపజేయు స్వామికి చనుగుడిపిన యశోదకు కృష్ణుడు చిక్కక మరెవ్వరికి దక్కుతాడు? అందుకే పోతన యశోదాకృష్ణుల ప్రసక్తి ఎక్కడ వచ్చినా ఎంతో అభినివేశాన్ని ప్రకటిస్తూ వ్రాస్తాడు.

క. వీరెవ్వరు శ్రీకృష్ణులు
 గారా! యెన్నఁడును వెన్నఁ గానరఁట కదా!
 చోరత్వం బించుకయును
 నేరరఁట ధరిత్రి నిట్టి నియతులు గలరే!

వెన్నదొంగను దండిస్తానంటూ యశోద నానాబాధలు పడి చివరకు ఆ చిన్నికృష్ణయ్య తల్లిపాటుకు జాలిపడి పట్టుపడినప్పుడు యశోదమ్మ కొడుకును రోట బంధిస్తూ పలికినప్పటి పద్యం ఇది.

వీరెవ్వరు శ్రీకృష్ణులవారా! ఎన్నడూ వెన్నను చూడనే లేదటా! దానిరుచి అసలేఎరుగరట, దొంగతనం ఇంతైనా తెలియనివారట! ఇంత నీతి నియమం ఉన్నవారు ఈ భూమ్మీద ఎవరైనా ఉన్నారా? అంటూ వ్యంగ్యంగా పలికింది యశోదమ్మ.

ఈ పద్యంలో ఉన్న బిగువు అంతా కాకువును ధ్వనించే పదాల పొందికలోనే ఉంది. సాధారణంగా పిన్నలను గౌరవవాచకంతో సంబోధించడంలోనే పెద్దవారికోపం అవగతం అవుతుంది. అనురాగస్థానంలో ఆప్యాయత తగ్గినప్పుడు ఉపచారవాక్యాలు పలకడం మన తెలుగువారికి కొత్తకాదు. ఒక్కొక్కప్పుడు తమ పిల్లలు కట్టుతప్పి తులువచేష్టలు చేస్తూ, ఇల్లు పట్టక తిరుగుతూ ఉంటే, పెద్దలు ఏం నాయనా మళ్లా తమరు ఇల్లు చేరుకోవడం

ఎప్పటికో ? పాపం ఎన్నిరాచకార్యాలో ! అంటూ వెటకారంగా చిరంజీవులకు బహువచన ప్రయోగం చేస్తుంటారు. అట్లే పసి వారు తెలిసో తెలియకో ఎదుటి పిల్లవాడి బలపమో, బొమ్మో తెచ్చి నప్పుడు పాపం తమరికి ఆ బొమ్మ కావలసి వచ్చిందీ! ఎప్పుడున్నా ఇంట్లో కన్నాడో లేదో అంటూ తల్లిదీర్ఘాలు తీస్తుంది అట్లే యశోదమ్మకూడా కృష్ణుని శ్రీకృష్ణులుగారూ అంటూ బహువచనాల దొంతరను ప్రయోగించింది. 'వెన్నగానరట' 'చోరత్వంబునేరరట్టె' అంటూ ఆ రెండు గుణాలు ఉన్నవాడివే అంటూ స్ఫురింపరచింది. అట్లాగే ధరిత్రి నిట్టి నియతులుగలరే? అంటే లేరనే ధ్వనించింది.

కృష్ణయ్య పెరుగుతున్నది పుట్టెడు పాలున్న ఇంట్లో—ఇక వెన్నామీగడలకు కరువేలేదు, అయినా పొరుగింటి పుల్లకూర రుచి మరిగిన కన్నడు ఆయా ఇండ్ల పాలూపెరుగులు జుర్రుకుంటూనే ఉన్నాడు. అదంతా వినీ కనీ తెలిసికున్న తల్లి కొడుకుపై వ్యాజస్తుతి తో కోపాన్ని ప్రదర్శించింది.ఇదొక విరుద్ధార్థ చమత్కారధ్వని. ఈ విధానాన్ని నన్నయ భారతంలో ప్రయోగించినాడు. పట్టుబడిన ద్రుపదమహారాజును చూసూ ద్రోణాచార్యుడు "వీరెవ్వరయ్యా ద్రుపదమహారాజులె" అంటూ ఉపచారవాక్యాలతోనే ఎదిరిని చావు పోటులు పొడిచినాడు.

పోతన యశోద మాతృత్వంతో చూపిన జంకెనకు ఈ పద్యాన్ని ఉదాహరణంగా గ్రహింపవచ్చును.

శా. అమ్మా! మన్నుదినంగ నే శిశువునో
యాఁకొంటినో వెఱ్ఱినో

నమ్మం జూడకు వీరి మాటలు
మదిన్, నన్నీవు కొట్టంగ వీ
రిమ్మార్గమ్ము ఘటించి చెప్పెదరు
కాదేనిన్ మదీయాస్యగం
ధమ్మాఘ్రాణము సేసి నావచనముల్
దప్పైన దండింపవే.

కృష్ణయ్య లీలలు పెరుగుతున్నట్లుగానే ఆ కన్నయ్యపై అమ్మకు చెప్పే కొండాలు పెరుగుతూ వచ్చినాయి. గోపులవాడల్లో పాలుపెరుగులను తినడమేకాదు; ఇప్పుడు మన్నుకూడా తిన్నాడంటూ తోటివాళ్లూ, అన్నబలరామయ్యా యశోదమ్మ చెవి కొరికినారు. ఆతల్లి తన ముద్దుల ముల్లె కృష్ణయ్యను నిలదీస్తూ : నా తండ్రీ నీకు తిండికేం తక్కువరా! మన్నెందుకు తింటున్నావూ! నీ జతగాళ్లూ, అన్నాకూడా చెబుతున్నారుకదరా ! అంటూ ప్రశ్నించిన తల్లి యశోదమ్మకు చిన్నికృష్ణుడు చెప్పిన సమాధానం ఈ పద్యం.

అమ్మా ! మన్నుతినడానికి నేనేం పసిపిల్లవాడినా ? ఆకలిగొన్నానా ? లేక తిక్కవాడినా? నీ మనస్సులో వీళ్ళు చెప్పే మాటలు నమ్మకు. నీచేత నన్ను కొట్టించడానికి వీళ్ళంతా కలిసి ఈదారి పన్నుతూ ఇవన్నీ కల్పించి చెబుతున్నారు. నీవు నామాట కాదనుకుంటే ! ఇదో నా ముఖం వాసనచూడూ ! ఆ తర్వాతనే నామాట అబద్ధం అయితే నన్ను కొడుదువు కానీ, అంటూ చమత్కారాలు పలికినాడు.

నిజానికి పసిపిల్లలు మన్నుతినడం సహజం. తినవద్దంటూ తల్లులు దండించడమూ సహజమే తల్లిచాటుగా తింటున్న ఆ విష

యాన్ని తోటివారే వచ్చి తల్లికి చెప్పడము, ఆ తల్లి వాడి చెవులు పిండడమూ-ఇవన్నీ సర్వసాధారణమైన విషయాలే. కానీ మాయా నాటక సూత్రధారియైన కృష్ణుడు ఇక్కడ తాను సైతం ఒక అమాయకుడైన పసిపిల్లవాడు.గా మన్నుతింటూ ఉపరకు ఏమీ ఎరుగనట్లు, పైగా నిష్కారణంగా దండింప బడుతున్నట్లు నటిస్తూ అమ్మా నానోటిని వాసనచూడు. నిజంగా మన్నువాసన కొడుతుందేమో. ప్రత్యక్షంగా నీవే పరీక్షించి రుజువై తే కొడుదువుకాని అంటూ నమ్మపలకడం ఆశ్చర్యకరం. ఇంతటి మాయామయుడు పసివాడుకానీ, వెర్రివాడు కానీ నిజంగానే కాడుకదా! ఏడేడు భువనాలను బొజ్జలో పెట్టుకున్న విశ్వగర్భుని కడుపుకు వెలితి ఎట్లా కలుగుతుంది అనే విషయాలన్నీ చమత్కారంగా ద్యోతితంచేసినాడు. ఈ పద్యంలో పోతన ప్రవేశపెట్టిన "అమ్మా! మన్ను తినంగ నే శిశువునో యాఁకొంటినో వెఱ్ఱినో" అనే ఎత్తుగడ మరుపురానిది, అంతేకాదు; సమర్థవంతులైన వారు ఎంతకైనా తగుతారు. మట్టి తిననూ తినగలుగుతారూ, మట్టికి మారుగా సృష్టినే చూపగలుగుతారు.మరుపురాని పోతనపద్యాలల్లో ఇదొకటి.

మ. కలయో వైష్ణవ మాయయో
యితర సంకల్పార్థమో సత్యమో
తలపన్నేరక యున్నదాననొ
యశోదాదేవిఁగానో పర
స్థలమో బాలకుఁడెంత?
యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వలమై యుండుటకేమి హేతువొ
మహాశ్చర్యంబు చింతింపఁగన్.

ఏం కృష్ణా! మన్నుం తింటున్నావయ్యా! అంటూ ప్రశ్నించిన తల్లికి సమాధానంగా అమ్మా! ఏమిటమ్మా! నీవంటున్నది, నేను మన్ను తింటాను, నాకేం పిచ్చా! ఆ మాత్రం తెలియని పసిపాపనా? ఆకలికి అన్నం లేకనా? ఈ చెప్పుడు మాటలు నమ్మకు. నానోరు వాసన చూసి మట్టి నా నవస్తే అప్పుడు దండింతువు కానీ అంటూ నోరు తెరిచినాడు ఆ నోటిలో విశ్వరూపాన్ని చూసింది యశోద. ఆ సందర్భంలో యశోద పొందిన అనుభూతిని వ్యక్తపరుస్తూ వ్రాసిన పద్యం ఇది.

ఇది కలా? వైష్ణవమాయనా? ఇతర సంకల్పాల ప్రతిరూపమా? కాక నిజమా? ఏదీ నిశ్చయించజాలకుండా ఉన్నానా? ఇంతకూ నేను యశోదాదేవినేనా? ఇది మాయిల్లేనా? వేరేచోటా? నా చిన్న తండ్రి ఈ పసికందు ఎంతవాడూ? ఈ బాలుడెక్కడ? మరి ఈ సమస్తమైన ప్రపంచమంతా ఈ ముఖంలో ప్రకాశమానమై ఉండడం ఏమిటీ? దీనికి కారణం ఏమిటో? ఇదంతా చాలా ఆశ్చర్యంగా ఉందే! అంటూ అద్భుత రసంలో మునిగి పోయింది యశోద.

సాధారణంగా జాగ్రదవస్థవేరు, స్వప్నావస్థవేరు. మేల్కొని ఉన్నవాడు వాస్తవాన్నే దర్శించ గలుగుతాడు. కాని స్వప్నం అధివాస్తవికతకు సంబంధించిన విషయం. అందులో జీవి అద్భుతాలెన్నో చూడగలుగుతాడు. అందుకే నమ్మలేని వింతను కృష్ణుని ముఖంలో చూస్తున్న యశోద మొదట అది కలేమో అని అనుకొంది, కాని తాను నిద్రించడం లేదని గుర్తించినప్పుడు అది వైష్ణవ మాయేమో అంటూ భ్రమించింది. నిజానికి విష్ణుమాయా ప్రభావం చాల గొప్పది. సాక్షాత్తు ఆ మహా

విష్ణువే "సృజామ్యహం ఆత్మమాయయా" – ఆత్మమాయచేతనే స్వామి తన్నుతాను సృజించుకొంటున్నానని వ్యక్తపరచినాడు. నిజానికి విష్ణుమాయకున్న సృజనాశక్తి మరిదేనికీ లేదు. అందుకే అమాయకురాలైన యశోదసైతము తాను చూస్తున్న అద్భుతాన్ని విష్ణుమాయగా కొంతకాలం భ్రమించింది. ఈ భ్రమవల్ల గురి ఒక దానిపై స్థిరంగా నిలువలేదు. శ్రీకృష్ణుడు తన కొడుకే అన్న భ్రాంతి సడలిపోనంతవరకు ఆమె అనిశ్చితమైన అనేక అవస్థల్లో చిక్కుకుంటూ అనేక విధాలైన విచిత్రానుభూతుల్ని పొందవలసివచ్చి, క్షణక్షణం మారుతున్న యశోదాదేవి అనుభవాలన్నిటికీ ఒక ఆకృతిని కల్పిస్తున్నట్లుగా చిత్రించిన పోతన సృజనీయుడు ఈ పద్యం వెలలేనిది.

సీ. తలలెత్తి మెల్లనఁ దడవి యాడెడు వేళ
 పన్నగాధీశుల పగిదిఁ దాల్తు
రంగసంమృష్ట పంకాంగ రాగంబుల
 నేనుఁగుగున్నల యెత్తువత్తు
రసమంబులైన జవాతిరేకంబుల
 సింగపుఁ గొదమల సిరి వహింతు
రాననంబుల కాంతులంతంత కెక్కంగ
 బాలార్క చంద్రుల పగిదిఁ దోఁతు

తే. రెలమిఁ దల్లుల చన్నుఁ బాలెల్లఁ ద్రావి
పరమయోగోద్భవామృత పానలీల
సోలి యోగుల విధమున సొంపుగందు
రాకుమారులు జనమనోహారులగుచు.

వ్రేపల్లెలో బలరామకృష్ణు లిద్దరూ నందగోపు నింట పెరిగిన విధానాన్ని వర్ణిస్తూ చెప్పిన పద్యం ఇది

పసిపిల్లలు మెడలు నిలబెట్టిన తరువాత దోగాడే ముందు పొట్టతో పాకుతారు అదే తలలెత్తి మెల్లిన తలవియాడెడు వేళ ఆవయసు వచ్చిన బలరామ కృష్ణులు పొంగిలబడి తలలెత్తి, పాకడానికి ప్రయత్నిస్తున్నప్పుడు పడగలెత్తిన ఫణిరాజులవలె గోచరిస్తారు. దోగాడుతున్నప్పుడూ, ప్రాకుతున్నప్పుడూ మట్టిని పులుముకోవడంతో ధూళిధూసరితాలైన శరీరాలతో ఏనుగు పిల్లలవలె కనిపిస్తారు. సాటిలేని వేగంతో బలంతో సింహపు పిల్లల చాయ వెలుగుతారు. ముఖకాంతులు దినదినమూ వికసిస్తూ ఉంటే త్రేతసూర్యులవలే చంద్రులవలే తోస్తారు. బాగా తల్లుల చనుబాలన్నీ తాగి పరమమైనయోగాన్ని అభ్యసించి కుండలిని జాగృతంచేసినప్పుడు అమృతస్రోతస్విని ప్రసాదించెడి దివ్యామృతాన్ని పానం చేస్తూ చొక్కి మైమరచే యోగులవలె జనుల మనస్సులను ఆకర్షిస్తూ సొంపునువహిస్తారు అంటూ వర్ణించినాడు.

ఈపద్యంలో పోతన బలరామ కృష్ణులను పసివారుగా ఉన్నప్పుడే జవసత్వాలల్లో కాంతిలో సాటిలేనివారంటూ చెబుతూ ఉపమానంగా ఆయా విషయాలల్లో అధికప్రామాణ్యాన్ని పొందిన, నాగరాజునూ, ఏనుగు గున్ననూ, సింగపు కొదమనూ, త్రేత సూర్యచంద్రులనూ స్వీకరించినాడు. యోగరహస్యాలను ఎరిగిన పోతన యోగిశ్రేష్ఠులైన బలరామకృష్ణులు ఆయోగోద్భవామృత పానాన్ని చేస్తూ సుఖించినారంటూవ్రాసి ఔచిత్యాన్ని ప్రదర్శించినాడు.మరొక్కవిశేషం, యోగోద్భవామృతానికి దీటుగా తల్లులచనుబాలను పేర్కొని ఆతల్లికీ, తల్లి చనుబాలకు అమృతత్వాన్నే ఆపాదించినాడు పోతన.

మ. తరుణీ! యాదవరాజుగాఁడితఁడు
వేదవ్యక్తుఁడై యొక్కఁడే
వరుసన్ లోకభవస్థితి ప్రళయముల్
వర్తింపఁగాఁ జేయు దు
స్తరలీలారతుఁడైన యీశుఁ
డితనిన్ దర్శించితిం బుణ్యభా
సురనేనంచు నటించె నొక్కతె
మహాశుద్ధాంతరంగంబునన్.

శ్రీకృష్ణుడు ద్వారకా నగరాన్ని ప్రవేశిస్తున్నప్పుడు ఆనగరకాంతలు తమ తమ ఇండ్ల పైభాగాలల్లో నిలిచి ఆ గోపాల సుందరుని చూస్తూ వారివారి భావాలను తోటివారికి వ్యక్తం చేస్తున్నప్పటి పద్యం ఇది. ఆ గోపాల చక్రవర్తిని చూచిన సుందరి ఒకతి తనప్రక్కనే ఉన్నస్త్రీతో తరుణీ ! ఈ కృష్ణుడు యాదవ రాజు మాత్రమే కాడుసుమా ! ఈయన తొలిచదువులచేత తెలియ తగినవాడు. ఈ మహాపురుషుడు ఒక్కడే లోకాలన్నీ పుట్టిస్తూ, సంరక్షించి నిలుపుతూ, చివరకు నాశనం చేస్తూ ఉండే దుస్తరమైన లీలల్లో ఆసక్తి కలిగిన పరమేశ్వరుడు. ఇంతటి ప్రభువును చూచిన పుణ్యభాగను నేనే అంటూ తన అంతఃపురంలో ఆనందాన్ని పట్టలేక నాట్యం చేసింది.

శ్రీకృష్ణుని సుందరాకృతి అదిచూచిన వారిని ఘనమోహా జలధిలో మునుగ చేస్తుంది. ఐనా వారివారి పురాకృత పుణ్య విశేషాన్ని బట్టి ఆయావారికి ఆయాభావన కల్గుతూ ఉంటుంది. ఈ అనుభూతిని పొందిన సుందరి నిజంగానే మహాపుణ్యశీల.

అందుకే ఆమెకు శ్రీకృష్ణుడు వేదవేద్యుడుగా, సృష్టిస్థితిలయ కారకుడూ, త్రిమూర్త్యాత్మకుడూ ఐనపరమేశ్వరుడుగా గోచరించి నాడు. అంతేకాదు; ఆ భాగ్యవతి ఈ కృష్ణుణ్ణి దాట తరంకాని లీలారతుడుగా గ్రహింపగల్గింది. అంతటి పరబ్రహ్మపదార్థాన్ని దర్శింప గలిగిన ధన్యజీవి కాబట్టే ఆమె తన అంతఃపురంలో లేదా పరిశుద్ధమైన తన హృదయంలోనే ఆనందంతో ఆడగలిగింది అంటూ మహాభక్తాగ్రణి ఐన పోతన వ్యక్తం చేసినాడు. ఇంత లోతైన భావాన్ని సుందరమైన పదజాలంలో పొదుగుతూ పద్యం అల్లిన పోతన ధన్యుడు.

ఉ. ఎన్నఁడునైన యోగి విభులెవ్వని
 పాదపరాగ మింతయున్
గన్నులఁ గానకట్టి హరిఁ గౌఁగిటఁ
 జేర్చుచుఁ జెట్టఁ బట్టుచున్
దన్నుచు గ్రుద్దుచున్నగుచుఁ
 దదయుఁ బైపడి కూడియాడుచున్
మన్నన సేయు వల్లవ కుమారుల
 భాగ్యము లింత యొప్పునే.

శ్రీ మహావిష్ణువు శ్రీ కృష్ణుడుగా అవతరించి వ్రేపల్లెలో గోపాలకులు స్నేహితులుకాగా వారితో కలిసి నవ్వుతూ త్రుళ్ళుతూ కాలాన్ని గడిపిన విధానాన్ని వర్ణిస్తూ ఆ గోపాలబాలకుల భాగ్య విశేషాన్ని అభినందిస్తూ వ్రాసిన పద్యం ఇది.

ఎన్నడైనా ఎంతకాలానికైనా మహాయోగిశ్రేష్ఠులు ఏ మహానుభావుని పాదధూళిని సయితం కంటితో చూడలేరో అట్టి శ్రీ మహావిష్ణువైన కృష్ణుని కౌగిలిస్తూ చేతిలో చేయివేసి చెట్టా పట్టాలుపడ్తూ, పరియాచకాలాడుతూ, తన్నుకుంటూ, గుద్దులాడు కుంటూ, నవ్వుకుంటూ, ఒకరికై ఒకరు ప్రాణాలొడ్డుతున్నట్లు జతగా కలిసి మెలిసి ఆడుకుంటూ ఎంతో ఆదరాన్ని పొందే ఆ గోపకుమారకుల భాగ్యం ఇంత ఒప్పై ఉంటుందా ! అంటూ ఆశ్చర్యాన్ని ప్రకటించినాడు కవి.

పల్లెటూళ్ళలో పసులపిల్లల స్నేహానికీ, బడిపిల్లల స్నేహానికీ దీటు వచ్చేది మరేదీలేదు. అది అవయస్సు మహిమ. ఆ ఆనందం అనుభవైకవేద్యమే కాని చెప్పతీరదు. ఒక ఈడు పిల్లలు జతగాచేరి చెట్టాపట్టాలేసుకునివెళ్ళడం,కౌగలించుకోవడం. ఒకచోటకూడి ఆడుకోవడం ఆ ఆటల్లో తన్నులాటలూ, గుద్దులాటలూ, విరగబడి నవ్వులాటలూ తప్పవు. కానీ ఇందులో విశేషమంతా హరితోకలిసి ఆగోపబాలకులు అనుభవించిన విశేషంలోనే ఉంది. ఈ వల్లవ బాలకులు ఇట్లా సరిసమానంగా సౌహార్దాన్ని అనుభవించింది ఎవరోతోనోకాదు, సాక్షాత్తు శ్రీహరితోనే. ఆ మహాపురుషుని పదధూళిని కూడా చూడలేకపోయినారు కొన్నివేల సంవత్సరాలు తపించిన యోగివరులు. మరి అప్పుడు వీరిభాగ్య విశేషానికి మేర ఏమున్నది అంటూ ఆశ్చర్యాన్ని ప్రకటించినాడు పోతన.

అందుకే జ్ఞానులకన్నా, మౌనులకన్నా, యోగులకన్నా మించి కపటం ఎరుగని భక్తుల చేతనే హరి చిక్కుతాడు అనే సత్యాన్ని పోతన రుజువు చేసినాడు.

ఆ. బాల మాత్రుఁడగు సలీలుని ముఖమందు
విశ్వమెల్లనెట్లు వెలసియుండు
బాలుభంగి నితఁడు భాసిల్లుఁగాని స
ర్వాత్ముఁడాదివిష్ణుఁడగుట నిజము.

శ్రీ కృష్ణుని నోటి యందు సకల విశ్వాన్ని దర్శించిన యశోద కొంతతడవు ఇది కలా? నిజమా ? మాయనా ? అంటూ తన ఆలోచనకు అందని వితర్కంలోపడి చివరకు కానవిది కన్నట్లుగా తెలివిని పొందుతూ శ్రీ కృష్ణుడు ఆదివిష్ణువంటూ నిర్ణయించుకున్న విధానాన్ని తెలుపుతుంచే పద్యం.

కేవలం బాలమాత్రుడై ఆటవిడుపుగా తిరిగే పిల్లవాని ముఖంలో ఈ ప్రపంచమంతా ఎట్లానిలిచిఉంటుంది. పిల్లవాడివలె కానపస్తున్నాడు కానీ నిజానికి కృష్ణుడు సర్వాత్ముడూ, ఆది విష్ణువూ ఐఉండుట మాత్రం నిక్కం అంటూ స్థిరపరచుకుంది.

మనస్సును అజ్ఞానం ఆవరించినంతకాలం అవునూ కాదంటూ అనిశ్చిత పరిస్థితిలో కొట్టుమిట్టాడుతూనే ఉంటుంది. ఆ విధంగానే నందగోపుని భార్య యశోద కూడా కృష్ణుడు తన కొడుకూ, పసివాడూ అన్న మాయలోపడి భ్రమిస్తూనే ఉంది. నమ్మశక్యం కాని వింతను చూసి కూడా హరిలీలా విలాసం అని గుర్తించ లేదు. ఒకత్రుటికాలం ఆపైపుకు దృష్టిమళ్లీ ఆహరి తన ఎదుటే ఉన్నా మాయామోహితఐ ఏ వైష్ణవ మాయయో అంటూ సంభ్రమించింది కానీ, వెంటనే తనపిల్లవాడనే మోహం చావక అయ్యో ఇదినిజమా? పీడెంతా ? వీడి ముఖం ఎంతా ? ఈ విశ్వమంతా నాకొడుకు ముఖంలో వెలగడం ఏమిటీ అంటూ

సంభ్రమించింది. కానీ శ్రీకృష్ణసన్నిధి మనస్సును పునీతం చేస్తూ బుద్ధికి నిశ్చలత్వాన్ని సమకూర్చింది. అప్పుడామె నిదానిస్తూ ఈ కృష్ణుడు నా పిల్లవాడివలె గోచరిస్తాడు కానీ నిజానికి ఇతడు సర్వాత్మకుడైన ఆదివిష్ణువే ఐఉంటాడు. అందుకే సర్వ జగమూ ఈయన ముఖంలో ప్రకటిత మౌతుందీ అంటూ మహాజ్ఞానివలె భావించింది, అట్లా భావింపచేసినాడు పోతనామాత్యుడు.

క. కిరియై ధరయెత్తిన హరి
కరి సరసిజముకుళ మెత్తుగతిఁ ద్రిభువనశం
కరకరుఁడై గోవర్ధన
గిరి యెత్తెం జక్క నొక్కకేలన్ లీలన్.

ఇంద్రుని ఆజ్ఞతో మేఘాలు విజృంభించి మిన్నూమన్నూ ఏకం చేస్తూ ఏకధారగా వర్షిస్తున్నప్పుడు గోవులనూ, గొల్లపల్లెనూ కాపాడేందుకై గోవర్ధన గిరిని గొడుగుగా పట్టినాడు కృష్ణుడు. ఆ సందర్భాన్ని వర్ణిస్తూ చెప్పిన పద్యం ఇది.

పూర్వం వరాహమూర్తిఐ నీటిఅడుగున మునిగినభూమిని పైకిఎత్తిన శ్రీహరి. ఏనుగు తామరమొగ్గను ఎత్తినట్లుగా ముల్లోకాలకూ సుఖాన్ని చేకూర్చేవాడై ఇప్పుడు గోవర్ధన పర్వతాన్ని చక్కగా ఒక్కచేత్తో సులభంగా, ఆటగా ఎత్తినాడు.

బలీయాలైన మహావృక్షాలను పెల్లగించే ఏనుగుకు తామర మొగ్గను తొండంతో పట్టుకోవటం ఒకలెక్కకాదు. తొండంలో సుకుమారమైన ఆమొగ్గ విలాసంగా గోచరిస్తుంది. అట్లాగే

శ్రీకృష్ణుడు కూడా గోవర్ధనగిరిని ఒక్కచేత్తో ఆటలాడుకుంటున్నట్లు లీలగా ఎత్తి పట్టినాడు. శ్రీ కృష్ణుడు ఈపని ఎట్లా చేయగలిగినాడంటే, ఆయన శ్రీహరి; పూర్వం పాతాళపు లోతులో చిక్కుపడిన భూమిని ఆదివరాహరూపంతో ఉద్ధరించిన వాడు; అంత సమర్థవంతుడు కనుకనే ఈనాడు పూలచెండును లీలగా చేతపట్టినట్లు గోవర్ధనపర్వతాన్ని పట్టగలిగినాడనే సమాధానం ఆపాదంలో ఇమిడి ఉంది. పైగా ఆపనిని త్రిభువనశంకరుడై చేసినాడు. లోకరక్షైకావరతంత్రుడు శ్రీహరి. అందుకే ముల్లోకాల సుఖమే ఆయన కర్తవ్యం. అందుకే ఆపనిని చేసినాడంటూ పోతన స్పష్టంచేసినాడు.

సీ. కడుపున దిండుగాఁ గట్టిన వలువలో
　　లాలిత వంశనాళంబుఁ జొనిపి
విమల శృంగంబును వేత్రదండంబును
　　జాఱి రానీక డాచంక నిఱికి
మీఁగడ పెరుఁగుతో మేళవించిన చల్ది
　　ముద్ద డాపలిచేత మొనయనునిచి
చెలరేఁగి కొసరి తెచ్చిన యూరుఁగాయలు
　　వ్రేళ్ళ సందులను దా వెలయనిఱికి

ఆ. సంగడీల నడుమఁ జక్కనఁ గూర్చుండి
నర్మభాషణముల నగవు నెఱపి
యాగభోక్త కృష్ణుఁ డమరులు వెఱఁగంద
శైశవంబు మెఱసి చల్ది గుడిచె.

త్రిజగన్మోహనాకారుడైన శ్రీకృష్ణుడు అచ్చపు గోపబాలకుని వేషాన్నిధరించి తోటిగోపాలుర నడుమ బంతిగాకూర్చుండి చద్దులు తింటున్నప్పటి దృశ్యాన్ని ఎంతో కండ్లపండుగా వర్ణించిన పద్యంఇది.

కడుపుకు బిండువలెకట్టిన పైబట్టలో తనకు ముద్దైన పిల్లనగ్రోవిని దూర్చి, అచ్చమైన కొమ్మునూ పశువులను తోలే కర్రనూ జారిపడిపోకుండా భద్రంగా ఎడమ చంకలో ఇరికించుకొనీ, మీగడపెరుగులతో కలిపిన చద్ది అన్నపు ముద్దను ఎడమ చేతిలో పొందుగా పెట్టుకొని, ఇంతా కొంచెం ఇంకొంచెం అంటూ కొసరికొసరి తెచ్చుకున్న నిలువ పచ్చళ్ళ ముక్కలను వేళ్ళసందులో ఇరికించి పట్టుకొని, స్నేహితుల మధ్యలో కూర్చునీ, పరిహాసాలాడుతూ, నవ్వులు నింపుతూ యాగభోక్తఐన ఆకృష్ణుడు దేవతలు చూచి ఆశ్చర్యపోయేటట్లు బాలభావాన్ని ప్రకాశింపజేస్తూ చద్ది తిన్నాడు—అంటూ వర్ణించాడు.

శ్రీకృష్ణుడు సకల యజ్ఞరూపి, సకలయజ్ఞభోక్త. దేవతలందరికన్నా తొలుతగా అగ్నిముఖంతో యాగ భాగాలను అందుకునే అధికారి. అట్టి సర్వోత్తముడైన శ్రీహరే స్వయంగా శిశుత్వాన్ని భజిస్తూ, స్నేహితులైన పసులపిల్లలనడుమ కూర్చుండీ ఎడమచేతినే విస్తరిగా చేస్తూ, ఆచేతివ్రేళ్ళ సందున పచ్చడి ముక్కలు ఇరికించుకొనీ మీగడపెరుగన్నపు ముద్దను తిన్నాడు. ఇది చూచి వెరగు పడ్డవారు గోపాలకులూ, భూపాలకులూ కారు, దేవతలు. ఆదేవతలేకదా ! శ్రీకృష్ణుని నిజస్వరూపాన్ని మొదటి

మంచి తెలిసినవారు. అందుకే యోగభోక్త ఏమిటీ, ఈ పెరు గన్నపు ముద్దలు తినడమేమిటీ అంటూ అబ్బురపడ్డారు.

సాధారణంగా పసితరువాత తలరుమాలును కానీ, ఒంటిపై కప్పుకొనే బట్టనుకానీ, కట్టిన ధోవతిని పైకిలాగి దాని చుట్టూ నడుముకు కట్టడం పరిపాటి. అట్లేర్పడ్డ దిండులో చేతిలో వున్న వస్తువులు దూర్చుకుంటారు. చేతినే దొప్పగా చేసి అన్నపు ముద్దలు తింటారు. లేదా బండపైన తింటారు. ఈ విశేషా లన్నీ పోతన ఎంతో ఆసక్తిదాయకంగా ఈపద్యంలో వర్ణించినాడు.

సీ. ఎవ్వని గుణజాలమెన్న జిహ్వలు లేక
నళినగర్భాదు లనంతుఁడంద్రు
కోరెడు విబుధేంద్ర కోటినొల్లక లక్ష్మి
ప్రార్థించె నెవ్వని పాదరజము
బ్రహ్మ యెవ్వని పాదపద్మంబు గడిగిన
జలము ధన్యతనిచ్చె జనులకెల్ల
భగవంతుఁ డనియెడి భద్రశబ్దమునకు
నెవ్వఁడర్థాకృతి నేపు మిగులు

ఆ. నే మహాత్ము నాశ్రయించి శరీరాది
సంగకోటినెల్ల సంహరించి
ప్రాభవమున మునులు పారమ హంస్యంబు
నొంది తిరిగిరాక యుందు రెలమి.

శ్రీహరి ప్రశంసాభివర్ణన సందర్భంలో శుకయోగి పరీక్షిన్మహారాజుకు ఆ హరి ప్రభావాన్ని విపులీకరిస్తూ వివరంగా చెప్పిన పద్యం ఇది.

ఏ మహానుభావుని గుణగణాలను పొగడడానికి నాలుకలుచాలక బ్రహ్మాదులు అనంతుడంటారో, తననే కోరుతున్న దేవతాకోటి నంతటినీ కాదంటూ లక్ష్మీదేవి ఎవ్వని పాదధూళిని ప్రార్థించిందో, ఏ విభుని పాదపద్మాలు కడిగి ఆ నీటితో బ్రహ్మ సకలలోకాలనూ అనుగ్రహించినాడో, భగవంతుడు అనే మంగళమైన శబ్దానికి ఎవ్వడు అర్థరూపమై వృద్ధిని పొందుతున్నాడో అట్టి మహాత్ముని ఆశ్రయించి, శరీరాది సంసర్గాన్ని అంతావదిలీ ప్రాభవంతో మునులు పరమహంసపదాన్ని పొందీ తిరిగి జన్మంటూ లేక ఉంటారో - అట్టి మహామహిమాభిశోభితుడు ఆదినారాయణుడు అంటూ చెప్పినాడు.

నారాయణుని కల్యాణగుణాలు అనంతాలు. వాటిని ఎన్న బ్రహ్మాదులకు చేతకాలేదు. అందుకే వారు హరిని అనంతుడు అన్నారు అంటూ పోతన చమత్కరించినాడు. నిజానికి ఆది మధ్యాంత రహితుడూ, నిత్యుడూ, నిర్ద్వంద్వుడూ ఐ మేరలుఎరుగని వాడు విష్ణువు.

అందుకే అతడు అనంత శబ్దవాచ్యుడు పాలసంద్రంలో ప్రభవించిన మహాలక్ష్మి ఎందరెందరో దేవతలున్నా వారెవ్వరినీ చేపట్టక శ్రీహరిపదధ్యాయిని ఐ అనురూపవరుడంటూ సర్వలోకాధిపతిఐన విష్ణువునే పతిగా వరించింది భగ అంటే ఐశ్వర్యమూ, పరాక్రమమూ, యశమూ, సంపత్తీ, జ్ఞానమూ, వైరాగ్యమూ

అనే ఆరు విభూతుల కలయిక. ఈ షడ్విభూతులు కలిగినవాడే భగవంతుడు. అంతేకాదు ఆయన ఉత్పత్తి, లయ, భూతసృష్టి, భూత ప్రళయ, విద్యావిద్యలనే ఆరింటిని ఎరిగినవాడై ఉండవలె. అందుకే పోతన 'భగవంతుడనే భద్రశబ్దం' అన్నాడు. ఈ శబ్దం ఎంతో శుభంకరమైనట్టిదీ, సర్వదోషహరమైనట్టిదీ, సకలరక్షణనట్టిది. అట్టి శబ్దానికి అర్థరూపంగా మిగిలినవాడు ఆదిమహావిష్ణువు కాక మరి ఎవ్వరు కాగలుగుతారు. అందుకే సృష్టిస్థితిలయకారకుడూ, యజ్ఞరూపీ, యజ్ఞభోక్తా, సర్వజగత్కారణుడైన నారాయణుడే శ్రీకృష్ణుడుగా తేటపరచినాడు ఇంతటివాడిని ఆశ్రయించిన మునులు ఇహలోకస్పృహ మానినవారై పరమహంసపదాన్నిపొంది-అంటే ఇంద్రియాది విషయవాసనలను పూర్తిగా మరచి - మనస్సులో శ్రీహరినే నిలుపుతూ అనన్యచిత్తులై వైకుంఠధామాన్ని చేరుతారు అంటూ తేటపరచినాడు. అన్ని విభూతులతోపాటు భక్తులను పరమపదం చేర్చగలిగిన సామర్థ్యాన్ని కలిగినవాడు హరి ఒక్కడే అంటూ స్పష్టపరచినాడు.

ఉ. ఒల్లరు నిర్జరేంద్ర పదమొల్లరు
బ్రహ్మపదంబు నొందగా
నొల్లరు చక్రవర్తి పదమొల్లరు
సర్వ రసాధిపత్యము
నొల్లరు యోగసిద్ధి మఱియొండు
భవంబుల నొందనీని నీ
సల్లలితాంఘ్రి రేణువుల సంగతి
నొందిన ధన్యులెప్పుడున్.

కాళిందిలో సకుటుంబంగా కాళియుడు చేరి, ఆ నీటిని విష దూషితం చేస్తూ సకల జీవ జంతువులకు నిరుపయోగంగా మార్చి నాడు. అప్పుడు సర్వజనశుభంకరుడైన కృష్ణుడు ఆ అగాధ జలాల్లో దూకి కాళియుని తలలపై తన పాదాల త్రొక్కిడితో నృత్యంచేస్తూ దాదాపు ఆనాగుని నిర్జీవునిగా చేసినాడు. ఆ సంద ర్భంలో కాళియుని భార్యలు తమకు పతిభిక్షపెట్టుమంటూ గోపాల చూడామణిని ప్రార్థించిన సందర్భములోనిది ఈ పద్యం.

ఓ కృష్ణా! అతికోమలమైన నీపాదరేణువుల సాహచర్యాన్ని పొంది ధన్యులైనవారెప్పుడూ దేవేంద్ర పదవినికూడా ఇష్టపడరు. అదేకాదు. అంతకన్న మిన్నైన బ్రహ్మపదాన్నైనా ఒల్లరు. చక్రవర్తి పదాన్ని లెక్కచెయ్యరు. సకల జలాలపై అధికారాన్ని కూడా వద్దేపొమ్మంటారు. నీపాదాశ్రయం అనే ఫలాన్ని పొందిన యోగులు ఉత్తమ ఫలానుభవం కోసం మరి వేరేజన్మ వరకు వేచి ఉండవలసిన పనిలేదు. ఎందుకంటే ఆ మహాఫలాన్ని నీపాద పరాగపు సంగతివల్లనే అనుభవించిన సుకృతాత్ములు వారు అంటూ విన్నవించినారు.

ఈ పద్యంలో పోతన 'పద' శబ్దాన్ని 'ద్వ్యర్థి' శక్తితో ప్రయోగించినట్లు తోస్తుంది. ఈ 'పద'శబ్దానికి స్థానము, పాదము అనే రెండర్థాలు సార్థకంగా పొదుగుతాయి. ఒక్కసారి శ్రీహరి పాదాన్ని స్పృశించిన సుకృతి ఏ దేవేంద్రుని పాదాన్నికూడా తాక డానికి ఇష్టపడడు. అంతేకాదు; బ్రహ్మపాదమైనా సరే ముట్టడు. ఇక సామాన్యచక్రవర్తి పాదాన్ని తాకడంటూ వేరేచెప్పవలసిన పనిలేదు. అట్లే పదశబ్దానికి స్థానం అనే అర్థం గ్రహించినప్పుడు

ఒక్కసారి శ్రీహరి పాదాశ్రయ పదవిని పొందిన ధన్యుడు సకల సుఖదమైన ఇంద్రపదవినికానీ అంతకయినా గొప్పదయిన బ్రహ్మస్థానాన్ని కానీ, భూలోకంలో సర్వాధిపత్యాన్నికానీ, పాతాళ లోకంపై అధికారాన్ని కానీ ఇచ్ఛగించడు అనే అర్థం పొసగుతుంది. ఇక్కడ రస శబ్దంకూడా జలవాచకము, సారభూతమైన రసవాచకమూ అయినట్టిది. సర్వజలాలకు అధికారి వరుణుడుకాబట్టి స్వామిపాద రేణువు సాంగత్యాన్ని పొందిన సిద్ధులు ఈజన్మలోనే సర్వరససిద్ధిని పొందుతారు. అందుకే వారు వరుణాధిపత్యాన్నికూడా ఒల్లరు అనీ, సర్వానందరూపమైన బ్రహ్మానందాన్ని ఈ జన్మలో పొందిన యోగులు మరి ఏ ఇతర ఆనందాన్ని గణింపరంటూకూడా అర్థ వ్యక్తిని సృష్టించుకోవచ్చు. నిజానికి లౌకికమైన ఏ రసంకూడా బ్రహ్మానందంతో సమానం కాదు. సాహిత్యరసం బ్రహ్మానంద సహోదరం కావచ్చు కానీ బ్రహ్మానందం మాత్రం కాదు. అందుకే విరాట్ అయిన ఆ కృష్ణపరబ్రహ్మనూ, ఆతని పాదరేణు వులనూ తాకిన ధన్యుడు ఇతరమైన ఏ రసాధిపత్యాన్నీ అనుభ వాన్నీ కోరడుకదా. ఆ బ్రహ్మానందానుభవం కలిగిన పోతన భావనకు అద్దం పట్టినట్లున్నదీ పద్యం.

ఆ. గోపజనములందు గోపికలందును
సకల జంతులందు సంచరించు
నా మహాత్మునకుఁ బరాంగన లెవ్వరు
సర్వమయుఁడు లీలసలిపెఁగాక.

శ్రీకృష్ణుడు పరాంగనలైన గోపస్త్రీలతో రాసక్రీడల తేలుతూ రమించడం ధర్మమా అనే ప్రశ్న సర్వసాధారణంగా లోకంలో

తలఎత్తుతుంది. ఆ సందేహాన్నే పరీక్షిత్తు నోట పలికించి దానికి సమాధానంగా శుకయోగి చెప్పినట్లు పోతన వ్రాసిన పద్యం ఇది.

గోపాలకులలో, గోపికలలో, సకలజీవ జంతుకోటిలో సంచరించే ఆమహాత్ముడికి పరాంగనలు ఎవ్వరు? సర్వమయుడు వేడుకతో లీలచూపినాడు అంతే అంటూ సమాధానం చెప్పినాడు.

నిజానికి సర్వాంతర్యామీ, సర్వమయుడూ, సర్వాత్మకుడైన వాడు మహాత్ముడైన శ్రీహరి. అతడు పరమాత్మకాగా ఈ చరాచర బ్రహ్మాండంలో ఉన్న జీవులన్నీ ఆత్మలు.

ఈ జీవాత్మ పరమాత్మసంబంధం నిత్యమైంది. ఈ బాంధవ్యంవల్ల స్వామికి స్త్రీ పురుష భేదం లేదు. పురుషులైన గోపకులూ, స్త్రీలైన గోపికలూ, ఒక్కరూపే. వీరేకాదు; సకల జీవకోటి ఆయనకు సమానమే. ఆయన సర్వసముడు. అయితే మరి ఈ గోపికాస్త్రీలతో రమణం ఏమిటీ? అంటే లీలామానుష విగ్రహుడై జన్మించినట్లే,సంకల్పమాత్రంతో అండపిండ బ్రహ్మాండ సృష్టిని కావించినట్లే, ఆయా సమయ సందర్భాలను పురస్కరించుకొని ఆత్మారాముడై లీలగా గోపికలతో క్రీడసలిపినాడు. నిజం ఆలోచిస్తే ఇందు పరులెవ్వరూ? అందరిలోనివాడు ఈశ్వరుడూ, ఈశ్వరునిలోనివారే అన్ని జీవులూ — అంటూ వ్యక్తం చేసినాడు.

ఎంతోగహనమైన రహస్యాన్ని చిన్న పద్యంలో పోతన పొదిగించిన విధానం ఇది.

ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు
కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు మౌళిపరిసర్పిత
పింఛమువాఁడు నవ్వురా
జిల్లెడు మోమువాఁ డొకఁడు
చెల్వల మానధనంబు దోచె నో
మల్లియలార! మీ పొదలమాటున
లేఁడు గదమ్మ చెప్పరే!

క్షణకాలమైనా కృష్ణుని విరహాన్ని సహింపని గోపికలు రాస క్రీడలమధ్యలో హఠాత్తుగా కనబడకుండా పోయిన కృష్ణుని వన మంతా వెదుకుతూ పర్వత నదీ గుల్మలతాదుల శ్రీకృష్ణుని జాడను తెలుపుమంటూ ప్రార్థించినప్పటి పద్యం ఇది.

నల్లనివాడొకడు, పద్మాలవంటి కన్నులున్నవాడూ, కరుణా రసాన్ని కురిసేవాడూ, తలచుట్టూ నెమలిపింఛాన్ని చుట్టినవాడూ, నవ్వులొలికే ముఖంవాడూ, చక్కనిస్త్రీల మానధనాన్ని దోచుకున్న వాడూ మీచాటున ఏమన్నా దాగుకున్నాడా? ఓమల్లెలారా చెప్పండి- అంటూ గోపికలు మల్లె పొదలను ప్రశ్నించినారు.

సాధారణంగా ఒకరితో ఒకరు ఎడబాటును పొందిన ప్రియా ప్రియులు విరహభారంతో ఉన్మాదావస్థలో పడి ప్రకృతిలో ఉన్న ప్రతి వస్తువునూ తమవారి జాడ చెప్పుమంటూ ప్రశ్నించడం పరి పాటి. కవులకు సర్వ సాధారణమైన ఈ పద్ధతినే స్వీకరించి గోపి కలు కూడా ప్రలాపించినారు. కానీ విశేషం అంతా ఈ పద్యపు

ఎత్తుగడలోనే ఉంది. వనరాజి నలుపే, కృష్ణయ్య నలుపే! పైగా నల్లనివాడు అనే మాటలో ఎంతధ్వని ఉందో, ఆప్యాయతకూడా అంతే ఉంది.

మల్లెపొదలమాటున దొంగ దాగినాడు. ఆ దొంగచేసిన నేరం 'చెల్వల మానధనాన్ని దోచుకోవటం', చెల్వలమానధనాన్ని దోచుకోగలిగినవాడు కురూపికాడు. చెల్వుడే ఐ ఉంటాడు. అందుకే ఆనల్లనయ్య పద్మాక్షుడూ, నవ్వుతో రాజిల్లే ప్రసన్నమైన ముఖం కలవాడూ అంటూ గుర్తులు చెప్పింది గోపిక మల్లెపొదలకు. అయితే ఇది ఏకత్రనిష్ఠితమైన అనురాగమై శృంగారాభాసం కాకుండా ఆ మానాన్ని దోచినవాడు కృపారసం పైజల్లెడువాడు అంటూ చెప్పి ఆ నాయకునికి దాక్షిణ్యాన్ని చేర్చినట్లైంది. అందుకే ఆ కృష్ణుడు పరమాత్ముడూ; గోపికలు భ్రమించే జీవులు.

గోపికల మధురభక్తి విధానానికి ఈ పద్యం ఒక గీటురాయి. అంతేకాదు; నవనీతసదృశమైన ఈ పద్యం ఆపాతమధురమై ప్రతి హృదయాన్నీ రాగరంజితం చేస్తుంది. "కృపారసంబుపై జల్లెడువాడు" అనే ఒక్క వాక్యం గోపీకృష్ణుల శృంగారాన్ని లౌకికస్థితి నుండి అలౌకికమైన భక్తివైపుకు మళ్లింపచేసింది, ఇదే పోతనలో ఉన్న మహిమ.

శా. నీ పాదాబ్జము బ్రహ్మపూజ్యముగదా!
నీసేవ సంసార సం
తాపధ్వంసినియౌఁగదా! సకల
భద్రశ్రేణులం బ్రీతితో

నా హా చింతుగదా! ప్రపన్నులకుఁ
గాలాధీశ! కాలంబు ని
ర్వ్యాపారంబు గదయ్య! చాలరు గదా!
వర్ణింప బ్రహ్మాదులున్.

శ్రీకృష్ణుడు ద్వారకానగరాన్ని చేరవచ్చినప్పుడు, చూడవచ్చిన నగరవాసులు ఆత్మారాముడైన ఆ కృష్ణుని చూచి సంభావించి నప్పటి పద్యం ఇది.

కాలాధీశ్వరుడవైన ఓ కృష్ణా ! నీపాదం బ్రహ్మకుకూడా పూజింపతగిందికదా ! నీసేవ ఈసంసారతాపాన్ని నశింపచేస్తుంది కదా ! శరణాగతులైనవారికి సమస్త శుభపరంపరలను ఎంతో ప్రేమతో సమకూరుస్తావుకదా ! స్వామీ, ఎదురులేని కాలంకూడా నీముందు ఏమీచేయజాలనిదికదా ! నిన్ను వర్ణించడానికి బ్రహ్మ మొదలైన వారెవ్వరికీ శక్తి లేదుకదా !

అఖండదండాయమానమై ఖండాఖండ రూపంలో గోచరిస్తూ సర్వసాక్షీభూతంగా నిలిచేది కాలం, ఈ కాలానికి లొంగని వారంటూ లేరు. అయినా అట్టి కాలాన్నికూడా శాసించే అధికారం కలవాడు శ్రీమహావిష్ణువు. ఆ పరంధామపతే శ్రీకృష్ణుడు. అందుకే నగరవాసులు శ్రీకృష్ణుని కాలాధీశా! అంటూ సంబోధిస్తున్నట్లుచెప్పి, ఈ శ్రీకృష్ణుడేసాక్షాత్తు కాలస్వరూపీ, కాలాతీతుడూ, కాలాధీశ్వరుడైన పరాత్పరుడంటూ వ్యక్తం చేసినాడు. అందుకే భవబంధాలను తెంచుకోదలచినవారికి శ్రీహరిసేవ ఒక్కటే శరణ్యం అంటూ నొక్కి చెప్పగలిగినాడు.

పోతన ఈపద్యంలో సకల 'భద్రశ్రేణులు', 'ప్రపన్నులు' అనే పదాలను ప్రయోగం చేస్తూ శ్రోతలను అందుకోగలిగిన వారికి వారి శ్రమకు దగిన అర్థసంపత్తిని అందులో అమర్చి ఉంచినాడు. 'భద్రశ్రేణులు' అంటే శుభసందోహాలు, కేవలం ఇహానికి మాత్రమే సంబంధించినవి కావు. అవి ఇహపరాలకు చెందిన కళ్యాణాలు. ఈ భావాన్ని మరింత గట్టిపరుస్తూ 'ప్రపన్నులు' అనే పదం వాడబడింది. ప్రపన్నులూ అంటే శరణాగతులూ అనే అర్థం ఉన్నా అందులో భేదాలున్నాయి. ఏకాంతులూ, పరమైకాంతులూ, వీరిలో మొదటివారు. లౌకికవిషయాలతో పొత్తుకలిసే మోక్షాన్ని కోరేవారు రెండవవారు, ఫలాభిసంధిరహితమైన కర్మచేత నిష్కాములైనవారు. ప్రపన్నులనే కొందరు తృప్తులూ, ఆర్తులూ అంటూ విభజించినారు. సంసారులై విహితకర్మ లాచరిస్తూ మోక్షాన్ని కోరుతూ కాలంగడిపేవారు తృప్తులు. ప్రకృతిని వదలి పరమేశ్వరుణ్ణి చేరడానికి కాలవిలంబనాన్ని సహింపక తొందరపడేవారు ఆర్తులు. ఇదీ పోతన పద్యపు లోతు.

సీ. మేఘంబుమీఁద క్రొమ్మెఱుఁగు కైవడి
 మేనిపైనున్న పచ్చని పటమువాఁడు
గండభాగంబులఁ గాంచన మణిమయ
 మకరకుండల కాంతి మలయువాఁడు
శరవహ్నినణఁగించు సంరంభమునఁజేసి
 కన్నుల నునుగెంపు కలుగువాఁడు
బాలార్క మండల ప్రతిమాన రత్నహాట
 కవిరాజిత కిరీటంబువాఁడు

తే. గంకణాంగద వనమాలికావిరాజ
మానుఁ డసమానుఁ డంగుష్ఠమాత్రదేహుఁ
డొక్క గదఁజేతఁ దాల్చి నేత్రోత్సవముగ
విష్ణుఁడావిర్భవించె నవ్వేళయందు.

అశ్వత్థామబాణానలంతో దహింపబడి తల్లడిలుతూ ఉత్తర గర్భంలో గతాగతప్రాణుడై ఉన్న అభిమన్యుని శిశువు చింతిస్తున్న సందర్భంలో ప్రకటితమైన శ్రీమన్నారాయణుని వర్ణనం ఇది.

నీలమేఘంపై ఉన్న కొత్తమెరుపువలె శరీరం మీద పచ్చని వస్త్రాన్ని ధరించినవాడూ, చెవులకు పెట్టిన మకర కుండలపు కాంతులు గండస్థలంపై ప్రసరిస్తున్నవాడూ, బాణాగ్నిని అణిచే సంరంభంతో కొంచెము ఎరుపెక్కిన కన్నులవాడు. లేతసూర్య మండలకాంతితో సమానమైన రత్నాలు పొదిగిన బంగారపు కిరీటంతో ప్రకాశించేవాడు. కంకణ కేయూరాలే కాకుండా తోమాలనుకూడా ధరించి సాటిలేనివాడై అంగుష్ఠమాత్ర ప్రమాణమైన దేహంతో గదను చేతబట్టి చూచేవారికి కండ్లపండుగచేస్తూ విష్ణుమూర్తి ఆ సమయంలో ఆవిర్భవించినాడు, అంటూ పోతన వర్ణించినాడు.

నీలమేఘశ్యాముడైన శ్రీహరి పచ్చబట్టనూ, మకరకుండల, కేయూర కంకణకిరీటాదులనూ ధరించడమే కాకుండా వనమాలికా సమగ్ర విగ్రహంతో గద చేతబట్టి వచ్చినాడు. ఈ మహాపురుషుడు అంగుష్ఠమాత్రదేహుడూ అంటూ చెప్పి పోతన, కరోప

నిషత్తులో వర్ణింపబడిన సర్వవ్యాపకుడైన సర్వేశ్వరుణ్ణి తలపింప చేసినాడు. కఠోపనిషత్తు

"అంగుష్ఠమాత్రః పురుషోజ్యోతి రివాధూమకః
ఈశానోభూతభవ్యస్య స ఏవాద్య సఉశ్వః"

అంటూ చెప్పి భూతభవిష్యత్తులను పరిపాలింపగలిగిన ఈశ్వరుడు అంగుష్ఠ మాత్రుడైన పురుషుడంటూ చెప్పింది. అల్లే పోతన కూడా కృష్ణుని ప్రభుత్వానికి చిహ్నంగా బాహ్యమైన అలంకారాదులను వర్ణిస్తూ కావలసినవారికి ఉపనిషద్రహస్యాన్ని ఈ పద్యంలో పొదిగి అందించినాడు.

సీ. కుప్పించి యెగసినఁ గుండలంబుల కాంతి
గగనభాగం బెల్లఁ గప్పికొనఁగ
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న
జగముల వ్రేఁగున జగతి గదలఁ
జక్రంబుఁ జేపట్టి చనుదెంచు రయమునఁ
బైనున్న పచ్చని పటముజాఱ
నమ్మితి నాలావు నగుఁబాటు సేయక
మన్నింపుమని క్రీడి మఱల్చఁ దిగువఁ

తే. గరికి లంఘించు సింహంబు కరణి మెఱసి
నేఁడు భీష్ముని జంపుదు నిన్నుఁ గాతు
విడువు మర్జున యనుచు మద్విశిఖవృష్టిఁ
దెరలి చనుదెంచు దేవుండు దిక్కునాకు.

ఈపద్యం కూడా భీష్ముడు అంపశయ్యపై నుండి శ్రీకృష్ణుని స్తుతించిన సందర్భంలోనిదే.

దుర్యోధనుని హేటుమాటలతో రెచ్చిన భీష్ముడు కురుక్షేత్రంలో వేయిసూర్యులతేజంతో, వీరులందరికీ సహింపరాని వాడై యుద్ధం చేస్తుండగా విజయపక్షపాతి యైన శ్రీకృష్ణుడు ఆయుధాన్ని పట్టనంటూ ఇచ్చిన మాటను మరిచి, చక్రాన్ని చేతపట్టి, భీష్ముణ్ణి చంపుతానంటూ రథాన్ని దిగుతుండగా, వద్దువద్దంటూ అర్జునుడు అడ్డుపడినాడు. ఆ దృశ్యం మరువరానిదై భీష్ముని ఎదలో నిండుకున్నది. శ్రీహరి కావించిన ఆ చర్యను తన భాగ్య విశేషంగా భావిస్తూ భీష్ముడు స్తుతించినాడు.

ఒక్కుమ్మడిగా పైకి ఎగిరిదుమికి నప్పుడు కదిలిన చెవిపోగుల కాంతి ఆకాశమంతా వ్యాపించగా, ఏడీ భీష్ముడంటూ పరువెత్తి నప్పుడు ఆ స్వామి కడుపులో ఉన్న ఇతరలోకాల యొక్క భారంతో ఈలోకం చలింపగా, చక్రాన్ని చేతబట్టి వస్తూ ఉన్న వేగానికి పైనసింగారించిన పచ్చనిబట్ట జారుతూ ఉండగా, ఇదిచూచి అర్జునుడు అయ్యో కృష్ణా! తాతను నీవు చంపి నమ్ముకున్న నాబలాన్ని నగుబాటు చేయకు, నామాట మన్నించుమంటూ వెనుకకు మరలిస్తూ ఉండగా, ఏనుగుపైకి దుమికే సింహంలా ప్రకాశిస్తూ, ఈనాడు భీష్ముణ్ణిచంపి నిన్ను కాపాడుతాను నన్ను వదులు అంటూ, నేను కురిపిస్తున్న బాణపు వర్షంనుండి తొలగుతూ వచ్చే ఆదేవుడే నాకుదిక్కు, అంటూ నతులుచేసినాడు.

భాగవతాన్ని చదివిన సహృదయుడెవ్వడూ ఈ పద్యాన్ని మరిచి పోడు. క్షణక్షణపరిణామ శీలమైన చేష్టాకృతిని ప్రవర్తింప చేసే వర్ణనా విధానం ఇది. పండిన తలతో, పండు బారిన

అనుభవం కలిగిన భీష్ముడు శ్రీకృష్ణుని భక్తజన పక్షపాతాన్ని ఇలగా భావిస్తూ నవ్వుకుంటూ పొందిన ధన్యత ఈ పద్యంలో గోచరిస్తుంది.

సీ. ఒక చెలికానిపై నొక చెయ్యిసాఁచి వే
 ఱొకచేత లీలాబ్జ మూఁచువానిఁ
గొప్పునకంటని కొన్ని కుంతలములు
 చెక్కుల నృత్యంబు సేయువానిఁ
నెమలిపింఛంబులు పుచ్చి కొమరారఁ గట్టిన
 పసిఁడి వన్నెలుగల పటమువానిఁ
నొదలఁ దిరిగిరా నలవడఁ జుట్టిన
 పట్టంపుఁ బింఛపు దండవాని

తే. రాజితోత్పల కర్ణపూరములవాని
మహిత పల్లవ పుష్పదామములవాని
భువనమోహన నటవేషభూతివానిఁ
గనిరి కాంతలు కన్నుల కఱవుదీఱ.

అడవిలో ఆలమందల మేపుతూ పసులకాపరిఐన శ్రీకృష్ణునికి మునిపత్నులు అన్నము గొనివచ్చి చూచినప్పటి కృష్ణుని వర్ణనం ఈ పద్యం.

ఒయ్యారంగా ఒక చెయ్యి ఒక జతగాడిపై వేసి మరొక చేత్తో లీలాకమలాన్ని ఊపుతూ ఉన్నవాడినీ, వెండ్రుకలన్నీ కొప్పుగా తీర్చినా, కొప్పులో ఇముడని కొన్ని రెండుచెక్కులా నటిస్తున్న

వాడినీ, బంగారురంగులబట్టను చిన్నచింగులు విడుస్తూ అందంగా కట్టిన పంచెకట్టువాడినీ, నెమలి ఈకల దండను తలచుట్టూ దట్టంగా చుట్టినవాడినీ, చెవులకు అలంకారంగా కలువ పూవులను ధరించినవాడినీ, ఎంతో మేలైన చిగుళ్ళూ పువ్వులూ కలిపికట్టిన- దండను మెడలో వేసుకున్న వాడినీ, లోకమోహనమైన నట వేషంతో ప్రకాశించే వాడినీ ఆ బ్రాహ్మణ కాంతలు తమకండ్ల కరువు తీరేట్లుగా చూచినారు అంటూ వర్ణించినాడు.

ఈ సందర్భంలో కృష్ణుని వేషంలో ఏవిధమైన రాజసంకానీ ప్రాభవసంపత్తికానీ గోచరించదు. సహజసుందరుడైన కృష్ణుని అంగయష్టిని ఆరణ్యకాలైన అలంకారాలు మరింత సుందరంగా దిద్దినవి. నిజానికి ఈకృష్ణవేషం అర్చామూర్తి ఐన ఒకదేవతావిగ్ర హంగానే భాసిస్తుంది. అమాయికలైన ఆమునిపత్నులు సహజ సుందరమూ అనునిత్యం తమ ఆత్మల్లో నిలిపే ఈ విగ్ర హాన్నే దర్శనీయంగా భావించి రమిస్తారో ఏమో! అందుకే పోతన శ్రీకృష్ణమూర్తిని ఈ విధంగా వర్ణించినాడు. పైగా ఆముని పత్నులు చూచింది 'భువనమోహన నటవేషభూతివాని' అంటూ వ్రాసి ఆస్త్రీలను పాపవిముక్తలనుగా ప్రకటించినాడు. కండ్లుమూసుకున్నా ధ్యానానికి అందే వర్ణనావిశేషం ఈపద్యంలో ఉంది.

మ. శ్రవణోదంచిత కర్ణికారములతో
స్వర్ణాభ చేలంబుతో
నవతంసాయిత కేకిపింఛకముతో
నంభోజదామంబుతో

స్వవశుండై మధురాధరామృతముచే
వంశంబుఁ బూరింపుచు
న్నవిదా ; మాధవుఁడాలవెంట
వనమందొప్పారెడిం జూచితే;

వ్రేపల్లెలో శ్రీకృష్ణుడు పసులకాపరిఐ లోకమోహనమైన ఆకారంతో మురళిని ఊదుతూ వనంలో తిరుగుతూ ఉంటే ఓ గోపిక మరో గోపికకు చూపిస్తూ ముచ్చటించుకున్నప్పటి పద్యం ఇది.

ఓ సఖి! చెవిపై అలంకరించుకున్న కొండ గోగుపూలతో, బంగారపు కాంతి కలిగిన పైబట్టతో, శిరోలంకారంగా అమర్చు కున్న నెమలి పింఛంతో, తామరపూదండతో, తనకుతానేవశుడై తన తీయని పెదవి కురిసే అమృతంతో వేణువును ఊదుతూ మాధవుడు ఆవుల వెంబడి వనంలో ఎట్లా ఒప్పులొలుకుతున్నాడో చూడూ! అంటూ చూపింది.

నీలమేఘశ్యాముడైన శ్రీకృష్ణుడు సహజంగానే సుంద రుడు. ఆ సుందరాకృతిని పరిసరాలూ, ప్రకృతీ, అలంకరించు కున్న తీరూ మరింత అందంగా చేస్తూ లోకమోహనంగా దిద్ది తీర్చినాయి. ఆభూషణాలన్నీ ఆరణ్యకాలే ఐనా స్వచ్ఛతకూ, నాణ్యతకూ ప్రతీకలైనట్టివి. కొండగోగూ, పచ్చబట్టా, నెమలి పింఛమూ, తామరదండలూ — వీటివన్నెచిన్నెలకు కొదువలేదు. మాధవుడు అలంకరించుకున్న ఆభరణాలేకాదు. సంచరిస్తున్న ప్రదేశాలు కూడా. ప్రకృతి సుందరాలైన వనప్రదేశాలూ చుట్టురా

ఆలపించాలి. అన్నిటిని మించి మనస్సును మరులు కొలిపే వేణు గానం. ఆ వేణువు తేనెలొలికే పెదవుల సాంగత్యంతో కాబోలు మరింత తీపిని వర్షించింది. ఇంతకన్నా హృదయ వశీకరణకు కావలసిన మందు మరేది? అందుకే స్వవశుడైన మాధవుడు ఆత్మారాముడై మురళిని మ్రోయిస్తూ ఉండగా చూచి చొక్కిన గోపిక ఆ దివ్య స్వరూపాన్ని తన చెలికత్తెకూ చూపుతూ ఆ మధురానుభూతిని పంచింది. ఈ పద్యంలోని సొగసంతా శైలి లోనే ఉంది. వ్యాఖ్యానంతో పొందించే ఆనందానుభూతి కన్న స్వయంగా ఆస్వాదించి పొందే రసానుభవమే ఈ పద్యంలో మిన్నగా ఉంది. పాశ్చాత్యులు చెప్పే 'Blameless style' అనే మాటకు ఉదాహరణంగా ఈ పద్యాన్ని స్వీకరించవచ్చు. మనమనో నేత్రాల ముందు ఒక్కమారు ఆ హరి సుందరరూపాన్ని దర్శింప చేయగలిగిన పద్యం ఇది.

మ. త్రిజగన్మోహన నీలకాంతి తను
వుద్దీపింపఁ బ్రాభాత నీ
రజబంధుప్రభమైన చేలము
పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్త ముఖారవింద
మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడు వన్నెలాఁడు
మదినావేశించు నెల్లప్పుడున్.

అర్జునుడు నిర్మించిన అంపశయ్య మీద ఉత్తరాయణ పుణ్యకాలం కోసం ఎదురు చూస్తున్న భీష్ముడు, ఆ కాలం సమీ

పించగానే పరమానందంతో శ్రీకృష్ణుని స్తుతించినప్పటి పద్యం ఇది. భీష్ముని ఎదలో ఎప్పుడూ పూని ఉండే శ్రీహరి విజయుని వఖుడైన వన్నెలాడు. అందుకే ఆ వర్ణనంకూడా వన్నెచిన్నెలు కొలకరిస్తూ సాగింది.

ముల్లోకాలనూ మోహింపజేసే నీలపుకాంతి శరీరాన్ని దీపింపజేస్తూఉండగా, ఉదయకాలపు లేతసూర్యునికాంతివంటి ఎరుపును మించిన పసుపువర్ణపు దుప్పటి ఆ శ్యామలాంగంపై ఎండిస్తూ ఉండగా. నల్లటి ముంగురుల సమూహం ముఖపద్మానికి మరింత సొగసును చేకూరుస్తూ ఉండగా, సేవింపదగ్గ ఆకారంతో విజృంభిస్తూ మా అర్జునుణ్ణి చేరవస్తున్న వన్నెకాడు నా మనస్సులో ఎప్పుడూ ఆవేశించి ఉంటాడు-అంటూ అన్నాడు.

ఈ పద్యంలో పోతన లీలామానుషవిగ్రహుడైన శ్రీకృష్ణుని నీలపు దేహకాంతినీ, పీతాంబరాన్నీ, నీలాలగుత్తుల వంటి ముంగురులతో సుందరమైన ముఖాన్నీ ఎంతో సొగసుగా వర్ణించినాడు. అందుకే కురువృద్ధుడైన భీష్ముడు 'వన్నె' లాడు అంటూగోముగా పిలుచుకున్నాడు. ఈపద్యం సగుణోపాస కులకు మూలంటురాయిగాపనిచేస్తుంది అనడంలో సందేహంలేదు.

సీ. క్షాళితాఖిల కల్మష ప్రజామరనదీ
జనకకోమల పదాబ్జములవాని
నఖిల సంపత్కారణాపాంగలక్ష్మీవి
లాసిత వక్షస్థలంబువానిఁ

బద్మమిత్రామిత్ర భాసిత కరుణా త
రంగిత చారునేత్రములవాని
భువన నిర్మాణ నైపుణభవ్య నిజజన్మ
కారణ నాభిపంకజమువాని

తే. నహిహితాహితశయన వాహములవాని
సేవితామర తాపస శ్రేణివాని
నఖిల లోకంబులకు గురుండైనవానిఁ
గాంచెఁ బరమేష్ఠి కన్నుల కఱవు దీఱ.

బృందావనంలో ఆలమధ్యలో జగన్నాయకుడైన శ్రీహరిని గోపాలకుడై ఉండగా బ్రహ్మచూచినప్పుడు కవి చెప్పిన పద్యం.

జనులయొక్క సర్వదోషాలను కడిగివేసే ఆకాశగంగ పుట్టుకకు స్థానంఐన మెత్తని పాదపద్మాలు కలవాణ్ణీ, తన కడగంటిచూపుల చేతనే సమస్త సంపదలను ప్రసాదించే లక్ష్మీదేవి విలాపంతో కాపురం ఉన్న ఎదరొమ్ము కలవాడినీ, పద్మాలకు శత్రువూ మిత్రుడూ ఐన చంద్రసూర్యులతో ప్రకాశిస్తూ కరుణా తరంగితాలైన చక్కని కన్నులవాడినీ సమస్త ప్రపంచాన్నినిర్మించే చాకచక్యం కలిగి భవ్యమైన తన జన్మకే కారణంఐన బొడ్డుతామర కలిగినవాడినీ, పాములకు ప్రియుడూ, విరోధిఐన ఆదిశేషుణ్ణీ, గరుత్మంతుణ్ణిపాన్పుగా, వాహనంగా ఉన్నవాడినీ, తాపససమూహంతోను దేవతాబృందంతోనూ సేవింపబడేవాడినీ, సకలజగాలకు తండ్రిఐనవాడినీ కన్నులకరువు అంతా తీరేటట్టుగా బ్రహ్మ కృష్ణుణ్ణి చూచినాడు అంటూ వర్ణించినాడు.

ఈ పద్యంలో పోతన శ్రీహరి సర్వాంగాలకు అమితమైన ప్రాభవాన్ని కలిగించినాడు. హరి పాదం నుండి గంగ పుట్టడం, ఎదలో లక్ష్మి నివాసం చేయడం, బ్రహ్మపుట్టుకకు కారణమైన నాభికమలం ఉండడం ఇవన్నీ విశేషాలే. అయితే ఈ విశేషణ రూపాలైన విశేషాలను పావనతరంగాలుగా వర్ణించి వాటిని మరింత విశిష్టాలుగా భాసింపచేసినాడు. గంగానది అంటే సామాన్యమైంది కాదు, అది సర్వలోకాల పాపాలను కడిగివేస్తుంది. మరి అంతటి గంగ స్వామి పాదకమలం నుండి పుట్టిందీ అంటే ఆపాదం ఎంత మహిమోపేతమైందో చెప్పకే చెప్పినట్లైంది. అట్లే వక్షస్థలంలో ఉన్న శ్రీదేవి సామాన్యురాలైందికాదు ఆమె కడగంటచూచింది అంటేనే సంపదలు వర్షిస్తాయి అటువంటి కలుములచెంకిని ఎదలో నిల్పుకున్న హరి ఎంతటి ప్రభువోకదా! విష్ణునాభినుండి పుట్టిన బ్రహ్మయ్య ఏం తక్కువవాడా? అసలు సృష్టిరచనకు కారణం ఆయనేకదా ! ఇంకొక విశేషం, ప్రకృతిలో పరస్పరం విరోధంతో జీవించే జీవులూ జడపదార్థాలు అన్ని స్వామిసేవలో వైరుధ్యాన్ని విడిచి సహజీవనం చేస్తున్నట్లుగా చిత్రించడం. ఈ విధమైన భావసరళికి శ్రీకారం చుట్టినవాడు నాచనసోమనాథుడైనా ఆభావాన్ని తన సొంతం చేసుకోగలిగిన మాటపొందిక పోతనలో చూడవచ్చు.

ఈ పద్యంలో పోతన భగవానుడైన విష్ణువుకు ఉండవలసిన విభూతులను సర్వాంగ సుందరంగా వర్ణిస్తూ, ఆ స్వామి కండ్లలో కరుణాతరంగితమైన చారుత్వాన్ని ప్రతిష్ఠించీ లోకగురువుగా తీర్మానించడం ఎంతో హర్షదాయకంగా ఉంది.

క. పాపాత్ముల పాపములం
బాపంగా నోపునట్టి పద్మాక్షునిపైఁ
బాపము గలదని నొడివిన
పాపాత్ముని పాపమునకుఁ బారము గలదే.

ప్రతిదినం నూరుబారువుల బంగారాన్ని ఇచ్చే శ్యమంతక మణికోసం శ్రీకృష్ణుడే తన తమ్ముడైన ప్రసేనుణ్ణి చంపినాడంటూ సత్రాజిత్తు సంశయించినాడు. అది తెలిసిన శ్రీకృష్ణుడు అతి ప్రయాసంతో శ్యమంతకమణి జాడపట్టి జాంబవంతునితో పోరాడి ఆమణిని తీసుకొనివచ్చి సత్రాజిత్తుకు ఇచ్చినప్పుడు సత్రాజిత్తు తన కన్యామణితోపాటు మణిని ధారపోస్తూ చెప్పినప్పటి పద్యం ఇది.

పాపాత్ముల పాపాలను తొలగించే సమర్థుడైన పద్మనేత్రుని మీద పాపాన్ని శంకించి నిందపెట్టిన పాపాత్ముని పాపానికి హద్దుఏముంది అంటూ వాపోయినాడు.

పద్మనేత్రుడైన శ్రీహరి లోకుల పాపాలన్నిటినీ పోగొట్టే సమర్థుడు. "మామేకం శరణం వ్రజ" 'సర్వపాపేభ్యో మోక్షయిష్యామి' అంటూ సాక్షాత్తు శ్రీకృష్ణుడే బోధించినాడు. అట్టి కరుణామయునిపైనే శ్యమంతకమణిని అపహరించినాడనే దోషాన్ని మోపినాడు. లేని నింద మోపడం మహానేరం, అదైనా ఎవరో సామాన్యవ్యక్తిపై కాదు, సర్వజనుల పాపాలను దూరంచేసే దయాంభోరాశిపైన. కాబట్టే ఆ పాపాత్ముని పాపానికి మేరలులేవు అంటూ తన్నుతాను నిందించుకుని, పాపనివారణంకోసం గుణ

రత్నం ఐన సత్యభామామణిని ధారపోసి పాదాలు కడిగి పాపవిముక్తు డైనాడేమో సత్రాజిత్తు.

ఈ పద్యంలో పోతన శ్రీకృష్ణుడే సాక్షాత్తు శ్రీమన్నారాయణమూర్తి అనే భావాన్నే ధ్వనింపజేసినాడు.

క. వెన్నుని కొంకమటి విషమగు
చన్నిచ్చిన బాలహంత్రి చనెనఁట దివికిన్
వెన్నుని గని పెంచుచుఁ దన
చన్నిచ్చిన సతికి మఱియు జన్మము గలదే.

శ్రీకృష్ణునికి కంసుని ఆదేశంతో విషమిశితమైన చన్నిచ్చి పూతన కృష్ణునిచేతనే ప్రాణాలను పోగొట్టుకుంది. అట్లా మృతిని పొందీ స్వామిలోనే లీనమైన పూతన సుకృతాన్ని ఆధారంగా, శ్రీకృష్ణుని కనపెంచేవారి భాగ్యవిశేషాన్ని ప్రశంసిస్తూ చెప్పిన పద్యం.

శ్రీహరికి ఒక్కసారి విషంతో నిండిన చన్నిచ్చి బాలఘాతిని ఐన పూతన స్వర్గానికే వెళ్లగలిగిందటా! మరి ఆహరినే కనీ, పెంచుతూ తన చనుగుడుపుతున్న పుణ్యవతికి మళ్లీ జన్మ అంటూ ఉంటుందా? ఉండదంటూ స్థిరపరిచినాడు పోతన.

పూతన కంసుని అనుచర వర్గంలోది. ఇది పసిపిల్లలను చంపే రాక్షసి. పిల్లలకునోకే బాలరోగాలకు ఇది మారుపేరు. కంసుని పంపున ఇది సుందరాకారంతో వ్రేపల్లెకు వచ్చి చిన్ని కృష్ణయ్యకు విషం నింపుకున్న తన చన్నిచ్చింది. శ్రీకృష్ణుడు

గుక్కు గుక్కుంటూ ఆ విషపుపాలతోసహా దాని ప్రాణాలనే పీల్చి నాడు. కొండవంటిదాని కళేబరాన్ని కాల్చుతున్నప్పుడు సుగంధ పరిమళం క్రమ్ముకున్నది. అది శ్రీహరి ముఖస్పర్శవల్ల సర్వకల్మ షాలు హరింపగా పవిత్రీకృతమైన దాని భాగ్యవిశేషం. అందుకే ఆ క్రూరాత్మ దివి చేరింది. ఈ విశేషాన్ని ఆధారంగా గ్రహిస్తూ సాక్షాత్తు ఆ శ్రీహరినే కనీ పెంచి చన్నిచ్చే సౌభాగ్యానికి నోచు కున్న సుకృతాత్మురాలైన స్త్రీకి మళ్లా జన్మ ఉండదంటూ నిర్ధరించి చెప్పడం జరిగింది.

క. విషధరరిపు గమనునికివి
విషగళసఖునికి విషశయనునికిన్
విషభవభవ జనకునికిని
విషకుచచనువిషముఁ గొనుట విషమే తలఁపన్.

కంసుని పంపున కృష్ణునికి విషపు చన్నిచ్చి చంపడానికి వ్రేపల్లెకు వచ్చిన పూతన తన విషపు పాలు కృష్ణునికిచ్చి తానే చచ్చిన సందర్భంలో చెప్పిన పద్యం ఇది.

విషాన్నినింపుకున్న పాపజాతికి శత్రువైన గరుత్మంతుని వాహనంగా కలవానికీ, గళంలో విషాన్ని నిలిపిన శివుని స్నేహితు నికీ, ఆదిశేషుడే పడకగా కలవానికీ, నీటపుట్టిన కమలాన్ని జన్మ స్థానంగా కలిగిన బ్రహ్మకు తండ్రియైనవానికీ, విషకుచయైన పూతన చంటివిషాన్ని త్రాగడం ఆలోచించిచూస్తే విషమౌతుందా? విషంతోపుట్టి విషంతో పెరుగుతున్నవాడికి చన్నుపాలలో కొద్దిపాటి

కలిసిన విషం విషమిస్తుందా? రాళ్లు జీర్ణించుకునేవాడికీ అప్పడాలే మూల– అన్నట్లుగా ఉంది.

ఈ పద్యంలో పోతన విషశబ్దాన్ని అనుప్రాణితంచేస్తూ అనుప్రాసయుతమైన శబ్దాలంకారాన్ని పొదిగిస్తూ చెవికి ఇంపును చేకూర్చినాడు. మూడవపాదంలో విషశబ్దం శ్లేషవల్ల శ్లేషానుప్రాణితంఐంది. ఒక చిన్న కందపద్యంలో శబ్దపు చమత్కారాన్ని చూపినా అర్థపులోతు తగ్గలేదు·

ఈ పద్యంలో పోతన శ్రీకృష్ణునికి గరుడవాహనత్వాన్ని, శివపక్షాన్ని, బ్రహ్మజనకత్వాన్ని సూచిస్తూ ఆయన సాక్షాత్తు విష్ణుమూర్తి అనే భావాన్నే ధ్వనింపచేసినాడు.

సీ. వీఁడఁటే! రక్కసి విగతజీవగఁ జన్నుఁ
బాలుత్రావిన మేటి బాలకుండు
వీఁడఁటే! నందుని వెలఁదికి జగమెల్ల
ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు
వీఁడఁటే! మందలో వెన్నలు దొంగిలి
దర్పించి మెక్కినఁదాపరీఁడు
వీఁడఁటే! యెలయించి వ్రేతలమానంబు
చూఱలాడిన లోకసుందరుండు.

తే. వీఁడు లేకున్న పుర మటవీస్థలఁబు
వీనిఁ బొందని జన్మంబు విగతఫలము
వీనిఁ బలుకని వచనంబు విహగరుతము
వీనిఁ జూడని చూడ్కులు వృథలు వృథలు.

మథురానగర కాంతలు శ్రీకృష్ణుడు మథురానగరికి వచ్చినప్పుడు మేడల మిద్దెలపైనుండి ఆకృష్ణుణ్ణి చూస్తూ పరస్పరం సంభాషించుకొనినప్పటి పద్యం.

వీడేనా : రాక్షసి ప్రాణాలు పోగొట్టుకునేట్లు పాలిస్తే తాగిన ఆగడపుపిల్లవాడూ? వీడేనా నందపత్ని యశోదకు జగాన్నంతటినీ తన ముఖంలో చూపిన ముద్దులయ్య? వీడేనా ఆలమందల్లో వెన్నలన్నీ దొంగిలించి మెక్కిన దొంగ? వీడేనా గొల్లభామలందరినీ మరిగించుకుని వారి మానాలను దోచుకున్న చక్కనయ్య? వీడు లేకుంటే నగరమైనా సరే అది అరణ్యమే : వీడిని పొందలేని జన్మం వ్యర్థం, వీడిని పొగడనిమాట అర్థంలేని పిట్టకూత, వీడిని చూడని చూపులు వ్యర్థం వ్యర్థం అంటూ ముచ్చటించుకున్నారు.

వీడటే : అంటూ ప్రారంభించిన ఈ సీసపద్యపు ఎత్తుగడ ఎంతో సుందరంగా ఉంది. పోతన శైలీరమ్యతకు ఈ పద్యం ఒక నిదర్శనం. సీసపద్యంలో ద్విప్రాసను ప్రవేశపెట్టి పద్యానికి శబ్దచమత్కారాన్ని కలిగించినాడు. అంతేకాదు; ఆ నాల్గుపాదాలల్లో శ్రీకృష్ణలీలలుగా ప్రసిద్ధికెక్కిన పూతన సంహారమూ, మన్నుతినలేదంటూ తెరచిన తననోట గోపాంగనకు విశ్వరూపాన్ని దర్శింపచేయడమూ, గొల్లపల్లెలో పాలు వెన్నలు దొంగలిస్తూ లీలసల్పడమూ గోపికలను తనవైపుకు ఆకర్షిస్తూ వారి మానాలు దోచుకోవడం మొదలైన సంఘటనలను కథలుగా ఆస్త్రీలు చెప్పుకున్నట్లు పొందుపరచినాడు.

తరువాతి ఎత్తుగీతిలో అంతటి శ్రీకృష్ణుడే లేనినాడు జన్మే వృథా అంటూ నిర్ణయించుకున్నారు. ఆస్త్రీల దృష్టిలో ఆ కృష్ణుని పొందగనుచే జన్మకుసాఫల్యం. అతనిగూర్చిపలుకుచే అర్థవంతమైన మాట, అతని చూచుచే చూపుగన్న ఫలం—అంటూఎంతో ఆర్ద్రమైన మనస్సులతో అనురాగాన్ని చిందిస్తూ భక్తిలో మునిగినట్లు పోతన ఈ పద్యంలో వ్యక్త పరచినాడు.

సీ. కాంచన రత్నసంఘటిత సౌధంబులే
 మా కుటీరంబులు మాధవునకు
 వివిధ నరేంద్ర సేవిత రాజధానియే
 మా పల్లె యదువంశ మండనునకు
 సురభిపాదప లతా శోభితారామమే
 మా యరణ్యము సింహమధ్యమునకు
 కమనీయలక్షణ గజ తురంగంబులే
 మా ధేనువులు కంసమర్దనునకు
 రూపవిభ్రమ నైపుణ్య రూఢలైన
 మగువలమె మేము మన్మథమన్మథునకు
 నేల చింతించు మము గృష్ణుఁడేల తలఁచుఁ
 బృథివి నధిపులు నూతన ప్రియులుగారె!

కంసుడు ఆహ్వానింపగా కృష్ణుడు బలరామునితో గలసి మథురా నగరానికి పోయి ఎంతకూ రాకపోగా ఆ కృష్ణవిరహాన్ని సహింపని గోపికలు ప్రణయకోపంతో ఈర్ష్యామానలై కృష్ణునిపై నిష్ఠూరాలు పలికి నప్పటి పద్యం ఇది.

ఆ కృష్ణుడు మమ్ములను ఎందుకు తలుస్తాడూ, మాగూర్చి ఎందుకు ఆలోచిస్తాడు? మేలిరత్నాలు పొదిగిన బంగారపుమేడలా ఆ మాధవునికి మాపూరిగుడిసెలు? ఆ యదుకులాభరణానికి మా పల్లె ఏదో అనేకరాజేంద్రులు సేవిస్తూ ఉండే రాజధానీనగరమా? సింహ మధ్యముడైన ఆ హరికి మా అడవి ఏదో సువాసనలు వెదచల్లే చెట్లూతీగలూ అలంకరించిన ఉద్యానవనమా? కంసుణ్ణి మర్దించిన ఆ కృష్ణయ్యకు మా ఆవులు ఏవో ఒప్పైన లక్షణాలున్న ఏను గులూ గుర్రాలా? మన్మథమన్మథుడైన హరికి మేమేమి చక్క దనమూ ఒయ్యారమూ పొంకమూ తెలిసిన జాణలమా? ఆయనకు మా సంగతి ఎందుకూ? ఎట్లైనా ప్రభువులు నిత్యనూతన ప్రియులు కదా! అంటూ వాపోయినారు.

అమాయికలైన గోపికలు పురుషోత్తముడైన శ్రీకృష్ణుని సాధారణ పురుషునిగా భావిస్తూ తమ ఊరికన్నా వైభవోపేతమైన మథురానగరమూ, తమ అడవికన్నా సుందరమైన ఉద్యానాలూ, తమ కుటీరంకన్నా విలువైన భవనాలూ, తమ ఆలమందలకన్నా ఉత్తమాలైన వాహనాలూ, తమకన్నా చక్కని వారైన స్త్రీలూ కృష్ణహృదయాన్ని ఆకుకుని తమను మరపింపచేసినాయి అంటూ భావించినారు. కాని వారు పలికిన తీరులోనే కాకుధ్వని నిక్షిప్తమై మథురానగరుకన్న నిసర్గమధురమైన తమ పరిసరాలూ తామే మెరుగనేభావాన్ని తోపింపజేస్తుంది. ఇందులో ఒకవిధమైనఆక్షేపం కూడా ఉంది. కృష్ణుడు ఇంతవరకు పుట్టిపెరిగింది గోకులంలోనే. ఆయన అనుభవించిన సర్వసుఖసంతోషాలన్నీ ఆలమందల్లో గోప గోపీబృందంలోనే. అటువంటి కృష్ణుడు ఇప్పుడు కొత్తగారాజధానికి

పోయినాడు. ఆనగరంలో ఉండే విశేషాలన్నిటికీ మరిగి పాతను మరచినాడు—అంటూ కృష్ణుడు చేయరాని అసాధారణమైన పనిని తడవుతూ దాన్ని సమర్థిస్తున్నట్లుగా గోపికలు 'బ్రథివి నధిపులు నూతనప్రియులుగారే' అనే సాధారణ ధర్మాన్ని పేర్కొన్నారు. ఈ విధానం సాధారణంగా కాళిదాస కృత శృంగార శాకుంతలంలో కానవస్తుంది.

క. సంగడిఁదిరిగెడు శంభుఁడు
నంగాశ్రయమైన సిరియు నాత్మజుఁడై యు
పొంగెడు పద్మజుడును
గోపాంగనక్రియఁ గరుణ వడయరఖిలేశ్వరుచేన్.

యశోద చేత కట్టపడ్డ శ్రీకృష్ణుని పోకడను పురస్కరించు కొని ప్రకటించిన భావం ఇది.

జతగా తిరిగే శంకరుడూ, ఎదను ఆశ్రయించిన లక్ష్మీదేవీ, కుమారుడై ఆనందించే బ్రహ్మ-వీరెవ్వరూ గోపస్త్రీఐన యశోద వలె సర్వేశ్వరుడైన శ్రీ కృష్ణుని దయావిశేషాన్ని పొందలేదు- అంటూ పోతన వర్ణించినాడు.

హరిహరులెప్పుడూ సంగడికాండ్రే అంటే స్నేహితులే! అట్లే లక్ష్మీదేవి హరిప్రియఐ ఆయన వక్షస్థలంలోనే కాపురాన్ని ఏర్పరచుకున్నది. పద్మసంభవుడైన బ్రహ్మ నారాయణుని నాభి కమలంలో నుండి పుట్టిన కారణంతో శ్రీహరికి కొడుకైనాడు. నిజానికి స్నేహితుడైన శంకరునికీ, భార్యయైన లక్షీదేవికీ, కొడు కైన బ్రహ్మకు స్వాధీనుడై ఉండవలసిందే కాని నారాయణుడు

అట్లా కాలేదు. వారికి ఎప్పుడూ చిక్కీ చిక్కనట్లే ఉన్నాడు. కాని గోపాంగనను అనుగ్రహిస్తు ఆమెచేత రోటికే కట్టపడ్డాడు. ఆ మహానుభాగ ఎంత పుణ్యాత్మురాలో! అందుకే నందగోపుని భార్యయైన యశోదతో సమానంగా స్నేహితుడైన శివుడు కానీ, భార్యఐన శ్రీదేవి కానీ, కొడుకైన బ్రహ్మకానీ శ్రీహరి కరుణకు పాత్రులు కాలేకపోయినారంటూ పోతన స్పష్టం చేసినాడు.

నారాయణుని మనస్సును దోచుకుని నిలువరించడం కేవలం భక్తి చేతనే సాధ్యంకానీ తదితరాలచేత సాధ్యం కాదంటూ స్పష్టపరచినాడు. ఆ భక్తి కూడా ఇతరాన్ని ఎరుగని పరమ ప్రేమ రూపంలో ఉన్నప్పుడే సాధ్యం. ఆ అనురాగరసాన్ని రంగరించి పోసే తల్లి యశోద. అందుకే ఆమెకు శ్రీహరి కొడుకై నట్టింట నడయాడినాడు.

సీ. ఆసక్తి కృష్ణముఖావలోకన మంద
హరిపాద సేవన మంద చింత
వెలుపు నారాయణ విముఖ కార్యము లంద
పారవశ్యము విష్ణుభక్తియంద
బాష్ప నిర్గతి చక్రి పద్యసంస్తుతు లంద
పక్షపాతము శార్ఙ్గి భక్తులంద
లేమి గోవిందాన్య లీలాచరణ మంద
శమము గోవింద పూజనములంద

తే. బంధమచ్యుతేతర దుష్ట పథములందు
జ్వరము మాధవ విరహిత క్షణములందు
మత్సరము లీశు కైంకర్యమతములందు
నరవరోత్తమ ! వినుము తన్నాగరులకు.

శ్రీకృష్ణుడు మధురాపురిని ప్రవేశించిననాటి గోలె ఆపుర వాసులందరికీ శ్రీ కృష్ణుడే సర్వంగా, ఆయన వినా మరివేరే ఎరుగక జీవితాలను గడుపుతుండినారు — అంటూ చెప్పే సందర్భంలోది ఈ పద్యం.

మధురా నగర వాసులందరికీ ఎప్పుడూ శ్రీకృష్ణునిముఖాన్ని చూడడంలోనే అపేక్ష. వారికి చింత ఎప్పుడూ ఆహరి పాదాలను సేవించడం లోనే. నారాయణునికి ఇష్టం లేని పనులంటేనే భయం. వారు స్వాధీనం తప్పుతూ పరవశలయ్యేది కేవలం విష్ణు భక్తితో మాత్రమే. వారు శ్రీహరి స్తోత్ర పద్యాలను చదువుతున్నప్పుడు మాత్రమే భక్త్యావేశంతో కన్నీళ్ళు కారుస్తారు. వారికి పక్షపాతం అనేది వుంటే కేవలం అది విష్ణుభక్తుల ఎడలనే ఉంటుంది. కొరత అనేది వారికి లేదు. ఆ వెలితి కేవలం గోవిందుని కన్నా వేరైన ఇతర లీలాచరణంలోనే కలుగుతుంది. వెన్నుని పూజించడంలోనే వారికి శాంతి లభిస్తుంది. వారు బంధ విముక్తులు; అచ్యుతుడైన హరిని విడిచి ఇతరాలైన చెడుమార్గాలల్లో ప్రవర్తించడమే వారికి బంధం. మాధవుడులేని ఒక్క క్షణం వారికి జ్వరం వచ్చినంత పని మాత్సర్యం అనేది వారికి అసలేలేదు. ఒక వేళ ఉంటే అది ఆ విష్ణు సేవా విషయంలోనే. విను ప్రభూ - అంటూ భాగవత పౌరాణికుడు వినిపించాడు.

ఈ పద్యంలో పోతన సర్వోపాధి వినిర్ముక్తమైన నిర్మ భక్తి స్వరూపాన్ని ప్రవేశ పెట్టినాడు. అట్లే "యన్ముహూర్తం క్షణం వాపి వాసుదేవో నచింత్యతే సా హానిః" అంటూ చెప్పిన లింగపురాణ రీతిని గూడ చొప్పించి శాండిల్య మతానుసారంగా పరమానురక్తి రూపమైన ఒక విశిష్టమైన భజనాన్ని ఈ నాగరకుల్లో పొందించినాడు. అంతే కాదు; బాణుని కాదంబరీ గద్యకావ్య ప్రక్రియలను సంతరించుకొని తన పద్యానికి మెరుగులు దిద్దు కొన్నాడు. ఇక అర్థవిశేషానికి వచ్చినప్పుడు ఆనగరవాసుల్లో విష్ణు గుణకీర్తనలను విన్నప్పుడు నిజమైన భక్తుడు పొందే తన్మయత్వాన్ని, హర్ష, రోమాంచ, అశ్రువిమోచనాదులనూ చెప్పి నాడు. అంతే కాకుండా హరికృపా విశేషం చేత ఆ నాగరకులు అరిషడ్వర్గాలకు అతీతులై దారిద్ర్యము, జ్వరాది వ్యాధులు, ప్రాపంచిక సంబంధాలు లేక సర్వకాల సర్వావస్థల్లో హరి చింతాసక్తులై ఆనందంతో ఉన్నారంటూ తెలిపినాడు.

సీ. అంభోజనాభున కంభోజనేత్రున
 కంభోజనిలయా సమన్వితునకు
నంభోజపదున కనంతశక్తికి వాసు
 దేవునకును దేవదేవునకును
భక్తులు గోరిన భంగి నే రూపైనఁ
 బొందువానికి నాదిపురుషునకును
నఖిల నిదానమై యాపూర్ణవిజ్ఞాన
 మైనవానికిఁ బరమాత్మునకును

ఆ. ధాతఁ గన్నమేటి తండ్రికి నజునికి
నీకు వందనంబు సే నొనర్తు
నఖిల భూతరూప ! నిరుపమ ! ఈశ ! ప
రాపరాత్మ మహిత ! యమిత చరిత !

మునికోటి కోర్కె తీర్ప శ్రీకృష్ణుడు నరకాసురుణ్ణి సంహరించిన తరవాత, ఆ నరకాసురుని తల్లి భూదేవి సాకారంతో శ్రీకృష్ణుని ఎదుటనిలుస్తూ తొల్లి ఆదివరాహమూర్తివై జలాల నుండి తన్ను ఉద్ధరిస్తూ అనుగ్రహించినప్పుడు పుట్టినవాడు ఈ నరకుడంటూ తెలియజేస్తూ స్తుతించినప్పటి పద్యం ఇది.

బొడ్డు తామర కలవాడికీ, పద్మనేత్రుడైనవాడికీ, పద్మంలో వసించే లక్ష్మీదేవితో కూడిన వాడికీ, పద్మాల వంటి పాదాలు కలవాడికీ, వసుదేవుని కుమారుడైన కృష్ణుడికీ, దేవదేవుడైన వాడికీ, భక్తులు ఏ రూపాన్ని కోరితే ఆ రూపంలో వెలిసేవాడికీ, ఆదిపురుషుడైన వాడికీ, ఈ సమస్త సృష్టికి కారణభూతుడైన వాడికీ, సంపూర్ణ విజ్ఞాన రూపుడైన వాడికీ, పరమాత్మునికీ, బ్రహ్మనే కన్న గొప్ప తండ్రికీ, పుట్టుకలేని వాడవైన నీకు నేను నమస్కరిస్తున్నాను. ఓ సాటిలేని వాడా ! సమస్త భూతరూపా ! ఈశ్వరా ! అమితచరితా ! అంటూ ప్రార్థించింది. సర్వజనీనమూ సర్వకాలీనమూ ఐన ఈ పద్యం నిత్యస్తోత్ర రూపకంగా పఠింపు కోదగింది. ఈ పద్యంలో 'వాసుదేవునకు' 'దేవదేవునకు' అనే పదాలు వాడించి పోతన శ్రీకృష్ణుడు పాణినికాలం నాటికి పూర్వమే "వాసుదేవుడు" అనే పేరుతో ప్రసిద్ధుడై పూజలందు

కున్న విధానాన్ని జ్ఞప్తికి చేస్తూ మన సంస్కృతిలో కాలూనిన వ్యూహ సిద్ధాంతానికి సంకేతం చూపినాడు. పోతన దృష్టిలో శ్రీకృష్ణుడే సాక్షాత్తు శ్రీ మహావిష్ణువు. అందుకే హరిని అంభోజ నాభుడన్నాడు. ఆ నాభికమలం నుండే బ్రహ్మ పుట్టినాడు. ఈ హరి అంభోజవిలయను కూడినాడు. ఈయన పరబ్రహ్మ.

ఈ పరబ్రహ్మ యొక్క ఆద్యవతారమే పురుషుడు అనే నమ్మకం మనలో ఉంది. ఈ పురుషుడే సకల చరాచర జగత్తుకు కారణుడు, ఆ పూర్ణమైన విజ్ఞానంతో ప్రకాశించే వాడు అనే తత్వరహస్యాలన్నీ ఈ పద్యంలో చొప్పించినాడు.

కం. అనుదిన సంతోషణములు
జనిత శ్రమ తాప దుఃఖ సంశోషణముల్
తనయుల సంభాషణములు
జనకులకుం గర్ణయుగళ సద్భూషణముల్.

హిరణ్యకశిపుడు తన మహా సౌధంలో కూర్చుండి చేర వచ్చిన కొడుకును వాత్సల్యంతో పిలుస్తూ కొడుకు మాటలు విన వలె అనే ఉత్కంఠతతో భావించిన విధానం ఈ పద్యం.

తండ్రులకు తమ బిడ్డల మాటలు దినదినం సంతోషాన్ని కలిగిస్తూఉంటాయి. శ్రమనూ, బాధనూ, దుఃఖాన్నీ ఉపశమింప చేస్తూఉంటాయి. వారి ఆ మాటలు చెవులకు మంచి అలంకారాలుగా ఉంటాయి.

పసిపిల్లల మాటలు తండ్రులకు కర్ణాభరణాలై వినే వేడుకను పుటిస్తున్నట్లుగానే ఈ పద్యంలో అంత్యప్రాసగా కూర్చిన 'తోషణములు,' 'శోషణములు', 'భాషణములు', 'భూషణములు' అనే పదాలు పాఠకుల చెవికి ఇంపును కలిగిస్తున్నాయి. అన్ని సుఖాలకన్నా కన్న కొడుకు శరీరాన్ని ఆలింగనం చేసుకున్నప్పుడు కలిగే సుఖం గొప్పది అన్నారు పెద్దలు. అట్లే పోతన కూడా చిన్నయ్యల ముద్దుపలుకులు వారిని కన్నయ్యల చెవులకు మంచి ఆభరణమాత్రాలేకాదూ, ఎన్ని సార్లు విన్నా ఇంకా వినాలి అనే బుద్ధినే పుట్టిస్తాయి. సంసారులకు సాధారణంగా ఎదురయ్యే అలసటా, చికాకూ, దుఃఖమూ మొదలైన ఇబ్బందులను పోగొడుతూ ఎల్లవేళలా ఈ లొక్కు పలుకులు సంతోషాన్ని కలిగిస్తాయి అంటూ చెప్పినాడు. నిజానికి ధనరాశులు గుమ్మరించి కానీ, శాస్త్రాదుల వల్లకానీ, మందులవల్ల కానీ నిసర్గ మైన బాధోపశాంతిని పొందలేము. తాత్కాలికంగానైనా సరే అద్దం వంటి మసిబారని మనస్సున్న పసిపిల్లల వచ్చిరాని మాటలు అలసిన శరీరానికీ, అంతకన్నా అలసి వేడెక్కిన కన్నవారి మనస్సుకూ గంధపుపూతవలె పండువెన్నెలవలె చల్లగా చేస్తాయి. అంతేకాదు అవి రెండు చెవులకూ పెట్టకే పెట్టని సొమ్ములై ఆనందాన్ని కలిగిస్తాయి అంటూ తమ సంతానంవల్ల కలిగే సుఖాన్ని పోతన లోకానికి మరొక్కసారి గుర్తుకు తెచ్చినాడు.

మ. హరి సాధింతు హరిన్ గ్రసింతు
హరిఁ బ్రాణాంతంబు నొందింతుఁ దా
హరికిన్ వైరినటంచు వీఁడు
పటురోషాయత్తుఁడై యెప్పుడున్

దిరుగం బ్రువ్వుమ నోరు వ్రీలి
పడదున్ దేహంబు దాహంబుతో
నరకావాసము నొందఁ డే క్రియ
జగన్నాథుం బ్రవేశించినో.

శిశుపాలుడు శ్రీహరిని నిందించి ఆ హరి చక్రధారతో తెగి పడి తిరిగీ తేజోరూపంతో హరినే ప్రవేశించడంచూస్తూ ఆశ్చర్యంతో ధర్మరాజు ఆ సభలో ఉన్న నారదుణ్ణి ప్రశ్నించిన సందర్భంలో చెప్పింది ఈపద్యం.

నేను హరిని సాధించి తీరుతానూ, హరిని మ్రింగుతానూ, హరిని చంపుతానూ, హరికి నేను విరోధినీ అంటూ ఈ శిశుపాలుడు మహాకోపంతో కూడిన చిత్తం కలవాడై ఎప్పుడూ ప్రవర్తిస్తూ ఉంటాడు. అంతటి పాపానికి ఒడికట్టిన వీడి నోరెందుకు పురుగుల పాలుకాదూ, శరీరం ఎందుకు చీలిపడదూ, బాధతో వీడు నరకంలో ఎందుకు మ్రగ్గడూ? మరేవిధంగా తాను పగపెట్టుకున్న ఆ జగన్నాథుని చేరినాడూ? అంటూ విచిత్రమైన ఆ పరిణామానికి ఆశ్చర్యాన్నీ సంశయాన్నీ వ్యక్తపరిచినాడు ధర్మరాజు.

ఈ పద్యంలో సాధారణంగా గ్రామీణాలైన తిట్లన్నిటినీ ప్రవేశపెట్టినాడు పోతన. కానీ ఆ మాటలు పొదిగిన తీరుమాత్రం వాటిలో ఉన్న ఘాటును పైకి అంతగా కనిపించనీయడం లేదు. సామాన్యంగా ఒకడు తన పగవాడి ప్రసక్తి వచ్చినప్పుడల్లా వాణ్ణి చూడు ఏంజేస్తానో, నరుకుతాను, కోసిపోగులేస్తాను, పొడుస్తాను అంటూ బీరాలు పలుకుతాడు. అప్లే ఆ ఎదురివాడు వీడినోట్లో

మల్లెలుఅంటే పురుగులువడ, వీడు కూలిపడ, ఎంతపాపం అమ్మా! వాడేం కట్టుకపోతడు,నరకానపడి కుముల్తాడు అంటూ శాపనార్థాలు పల్కుతారు. జనవ్యవహారంలో బాగానాటుకున్న ఈ తీరును పోతన్న బాగా ఆకళించుకొని ఆ ప్రయోగాలన్నీ జనం విష్ణుద్వేషులను గూర్చి పలుకుతున్నట్లుగా ప్రదర్శించినాడు. ఈ మాటలు సామాన్యజనానీకంకాకా ధర్మస్వరూపమైన ధర్మరాజే పలకడం చూస్తే పోతనకు విష్ణువుఎడల ఉన్న అశేషమైన అనురాగం గోచరిస్తుంది.

సీ. తనయందు నఖిల భూతములందు నొకభంగి
　　సమహితత్వంబున జరుగువాఁడు
పెద్దల బొడగన్న భృత్యుని కైవడి
　　చేరి నమస్కృతుల్ సేయఁవాడు
కన్నుదోయికి నన్యకాంతలడ్డంబైన
　　మాతృభావనసేసి మరలువాఁడు
తల్లిదండ్రుల భంగి ధర్మవత్సలతను
　　దీనులఁగావఁ జింతించువాఁడు
తే. సములయెడ సోదరస్థితి జరుపువాఁడు
దైవతములంచు గురువులఁ దలఁచువాఁడు
లీలలందును బొంకులు లేనివాఁడు
లలిత మర్యాదుఁడైన ప్రహ్లాదుఁడధిప.

ప్రహ్లాదచరిత్ర ప్రారంభంలో పోతనామాత్యుడు ప్రహ్లాదుని గుణగణాలను వర్ణిస్తూ చెప్పిన పద్యం ఇది.

తనకు ఏవిధంగా మంచి జరుగాలని వ్యక్తికోరుకుంటాడో ఆవిధంగానే సకలభూతకోటికికూడా ఒకే విధమైన శుభం కలుగవలె నంటూ, అన్ని ప్రాణులందూ సమానమైన హితబుద్ధితో ప్రవర్తించే వాడూ, పెద్దవారిని చూడగానే ఒక సేవకునివలె వారిని సమీపిస్తూ చేతులు జోడించేవాడూ, తన దృష్టికి ఇతర స్త్రీలు విషయంగా మారినప్పుడు అంటే పరస్త్రీలు అడ్డువచ్చినప్పుడు మాతృభావంతో చూస్తూ తప్పుకునేవాడూ, తలిదండ్రులను పోషించినట్లుగా ధర్మ వాత్సల్యంతో దీనులను ఎట్లాకాడపావలెనంటూ ఆలోచించేవాడూ, సరిసమానులనూ, సమవయస్కులనూ సోదరభావంతో చూచేవాడూ, గురువులను సాక్షాత్తు దేవతలుగా భావించేవాడూ, ఆటలందుకూడా అబద్ధం చెప్పనివాడూ, ఎంతో సున్నితమైన మర్యాదలు కలవాడూ ప్రహ్లాదుడు, ఓరాజా వినుమంటూ చెప్పినాడు.

ప్రహ్లాదుడు లోకైక నాయకుడై గర్వాతిరేకంతో రాజ్యం చేస్తున్న హిరణ్యకశిపుని కుమారుడు, ఈపిల్లవానిలో కలిమీ, దొరతనమూ, చక్కదనమూ అన్నీకూడ కలసి ఉన్నాయి. కానీ అజ్ఞానం మాత్రం లేదు. అందుకే సకలప్రాణిహితుడై 'ఆత్మ వత్సర్వభూతాని' అనే జ్ఞానంతో ప్రవర్తించినాడు. అంతేకాదు; పడుచుదనపు పరువంతో వయసు పండిన ముసలివారిని ఈసడించు కోకుండ వారికినతుడై మర్యాదలు చూపేవాడు. అందరుస్త్రీల ఎడ మాతృభావం కలిగి పరస్త్రీల సౌందర్యానికి పశుడుకాక చూపు మరలించుకుని తిరిగేవాడు. రాచబిడ్డలకు లేమిబాధ తెలియదు. కానీ ప్రహ్లాదుడు మాత్రం దీనజనపోషణకోసం ప్రాకులాడేవాడు. గురువును దేవతగా సంభావిస్తూ భారతీయమైన సంస్కృతికి ప్రతీక ఐనాడు. అందుకే ఆటలల్లోఐనా బొంకులేక రాశిపోసిన పుణ్య

మూర్తిగా నిలిచినాడు. ఈ పద్యాన్ని పురస్కరించుకుని పోతన దృష్టిలో మంచిగుణం అంటే సకలభూతహితమూ, సత్యవాక్య పాలనమూ, వృద్ధసేవాసక్తి, స్త్రీలయందు మాతృబుద్ధి కలిగి ఉండటం అని తోస్తుంది.

శా. పానీయంబులు ద్రావుచున్
గుడుచుచున్ భాషింపుచున్ హాసలీ
లా నిద్రాదులు సేయుచున్
దిరుగుచున్ లక్షింపుచున్ సంతత
శ్రీ నారాయణ పాద పద్మ
యుగళీ చింతామృతా స్వాద సం
ధానుండై మఱచెన్ సురారి
సుతుఁ డేతద్విశ్వమున్ భూవరా.

సద్గుణ గరిష్ఠుడైన ప్రహ్లాదుడు భగవంతుడైన వాసుదేవుని భక్తి దగిలి తన్నూ తనచుట్టూ ఉన్న ప్రపంచాన్నీ మరచినాడంటూ చెప్పే సందర్భంలో పోతన వ్రాసిన పద్యం ఇది.

పానీయాలు త్రాగుతూ, తింటూ, మాట్లాడుతూ, నవ్వుతూ, ఆడుతూ, నిద్రిస్తూ, నడుస్తూ, చూస్తూ, ఉండికూడా ఎల్లప్పుడూ శ్రీనారాయణుని పాదపద్మాలను ఏమరక ఆ ధ్యానామృతాన్ని ఆస్వాదించడంలోనే నిమగ్నుడై మనస్సును ఆ విషయం కొరకే సంధానిస్తూ హిరణ్యకశిపుని కుమారుడైన ప్రహ్లాదుడు ఈ ప్రపంచాన్నే మరచినాడు అంటూ పరీక్షిత్తుకు శుకయోగి చెప్పినాడు.

పోతన ఈ పద్యంలో భాగవతోత్తముని అంటే శ్రేష్ఠుడైన విష్ణుభక్తుని లక్షణాలన్నిటినీ క్రోడీకరించి ప్రహ్లాదునిలో పొదిగించి చెప్పినాడు. చెవికి ఇంపైన పదాల కూర్పుతో ఈ పద్యం ఎంతో సరళంగా నడిచింది. భక్తుడైనవాడు సర్వకాల సర్వావస్థలలో బాహిరంగా తాను ఏ పనిచేస్తున్నప్పటికీ ఆ శ్రీహరి ధ్యానాన్ని మరువక ఆహరి పాదకమల భజనాసక్తుడై ఉండవలెనన్నాడు. అంతేకాకుండా "చింతామృతాస్వాదనం" అనే పాదాన్నివాడి ఆ ధ్యానంలో అమృత తుల్యమైన ఒక సుఖ విశేషం ఉందీ అనే భావాన్ని ధ్వనింప చేసినాడు.

యోగనిరూఢులైన వారికి ఈ 'చింతామృతాస్వాదనం' అంటే ఏమిటో బోధపడుతుంది. అనుభవైక వేద్యమైన సుఖ స్వరూపాన్ని మాటలతో అందివ్వడం సామాన్యమైన పనికాదు. అందుకే శ్రీహరి పాదపద్మాలను తవిలి భక్తుడైనవాడు తుమ్మెద వలె చొక్కుతూ వదలిరాక ఉంటాడంటూ ఉపమానంగా చెప్పుకోవటం కవిలోకంలో పరిపాటిగా ఉంది.

అనుక్షణం, అలౌకిక సుఖానందంతో తన్మయుడైన ప్రహ్లాదుడు విషయానందమాత్ర సుఖరూపమైన ఈ జగత్తును మరచినాడంటూ వ్యక్తంచేస్తూ పోతన విష్ణుధ్యానం 'అమృత స్వరూపం' అనే విషయాన్ని స్థిరపరచినాడు.

శా. నిన్నున్ మెచ్చరు నీతి పార
మహిమన్నీతోడి దైత్యార్భకుల్
గన్నారన్నియుఁ జెప్పనేర్తురు
గదా! గ్రంథార్థముల్ దక్షులై

యన్నా! యెన్నడు నీవు నీతిమతి
పొదంచున్ మహా వాంఛతో
మన్నాఁడ న్ననుఁ గన్నదండ్రి!
భవదీయోత్కర్షముం జూపవే!

ఎంతో కాలానికి గురుకులవాసం నుండి వచ్చి గురువుల ఆజ్ఞతో తనకు దండప్రణామాలుచేసి నిలుచున్న కొడుకును దీవిస్తూ తొడమీద కూర్చుండ బెట్టుకొని లాలనగా ప్రహ్లాదుడు చదివిన చదువును గూర్చి హిరణ్యకశిపుడు అడిగిన సందర్భంలో ఉన్నదీ పద్యం.

నాయనా! నీతోటి దైత్యబాలకులు వారు సంపాదించిన నీతి శాస్త్ర మహిమతో నిన్ను లెక్కపెట్టడం లేదు. వారందరూ ఎంతో దక్షులై అన్ని శాస్త్రవిద్యలూ గ్రహించి గ్రంథార్థం చేయగలుగు తున్నారు. అన్నా! నీవు ఎప్పుడు నీతికోవిదుడ వౌతావో? ప్రభువులకు కావలసిన అర్థ, న్యాయ, దండ, ధర్మ, రాజ, యుద్ధ మొదలైన నీతిశాస్త్ర విద్యలల్లో ఆరితేరిన బుద్ధివి ఔతావో! అంటూ మహాకోరికతో ఉన్నానురా! నా కన్నతండ్రీ! అశాస్త్రాలల్లో నీ గొప్పతనం చూపరా—అంటూ కొడుకుపై పితృవాత్సల్యాన్ని గుమ్మరిస్తూ ప్రశ్నించినాడు.

ఈ పద్యం చదువుతున్నప్పుడు మనకు హిరణ్యకశిపుడు లోకకంటకుడైన ఒక ఘోరదైత్యుడుగా కనిపించడు. కన్నప్రేమ పౌరుష ఘనుడైన దైత్యుని రణకర్కశమైన శరీరంతో పాటు మనస్సునుకూడా వెన్నలా మెత్తన చేసింది. ఈ పద్యం ఒక్క హిరణ్యకశిపునికే కాదు, కొడుకులపై, వారి విద్యాబుద్ధులపై

గంపెడాశలు పెంచుకున్న ప్రతి తండ్రికి చెందుతుంది. సాటివారిలో తనవాడు మేటివాడు కావలె అనే కోరిక ప్రతి తండ్రికి సహజం. కొందరి కోరికలు తీరుతాయి,కొందరివి అడిఆశలుగానే ఉంటాయి. అది వారివారి భాగ్యవిశేషం. "అన్నా!" "నన్ను గన్నదండ్రి" అనే సంబోధనలు వాత్సల్యరస పూరితాలై కోమలమైన ఆర్ద్రరసానికి అనుగుణమైన మృదుశబ్ద ప్రయోగంతో హిరణ్యకశిపుని స్థితికి 'అయ్యో!పాపం' అంటూ సానుభూతిని చూపే అంతటి ఆర్ద్రతను నింపించుకున్నాయి. ఈ సందర్భంలో అతికఠినుడైన హిరణ్య కశిపుని మాటలు హృదయాలను ద్రవింప జేస్తున్నాయి.

ఈ పద్యంలో పోతన సర్వసాధారణంకాని దృతద్విత్వ వకారాన్నిప్రయోగం కావించినాడు.

సీ. మందార మకరంద మాధుర్యమునఁ దేలు
  మధుపంబు వోవునే? మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁ దూఁగు
  రాయంచ సనునె? తరంగిణులకు;
లలితరసాల పల్లవ ఖాదియై చొక్కు
  కోయిల సేరునె ? కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరక
  మరుగునే ? సాంద్రనీహారములకు

తే. అంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేరనేర్చు?
వినుతగుణశీల మాటలు వేయునేల?

హిరణ్యకశిపుడు తన కొడుకును రావించి ఆ బాలకుడు నేర్చిన చదువు కొంత చూపుమంటూ అడిగిన తండ్రికి ప్రహ్లాదుడు ప్రతిపక్షాలకు ప్రీతిని కలిగించే విధంగా పలికినాడు. ఆ మాటలు విని నివ్వెరపోయిన తండ్రి నాయనా ! హరీ గిరీ అంటూ ఎందుకు చెడిపోతావురా ? మన వంశప్రతిష్ఠకు అనుకూలమైన విధంగా నడచుకోరాదా ? అంటూ బుద్ధిచెప్పినప్పుడు ప్రహ్లాదుడు గురువులైన చండమార్కులకే చదువు చెప్పినట్లుగా పురోహితుని చూస్తూ చెప్పిన పద్యం ఇది.

మందారపుతేనె తీపిలో తేలుతూ చొక్కిన జుంటీగ ఆ మందారాన్ని వదలి ఉమ్మెత్త పూలకోసం పోతుందా ? స్వచ్ఛమైన ఆకాశగంగా తరంగాలలో ఉయ్యేలలూగుతూ ఆనందిస్తున్న రాజహంస ఆ పావన సలిలమైన ఆకాశగంగను వదలి ఏటినీళ్ల కోసం పరుగెత్తుతుందా? తీయమామిడి లేచిగుళ్ళను తింటూ మైమరచే కోయిల రసాలాన్ని విడిచి తనకు అనువుగాని కాలంలో పూచే కొండమల్లెను చేరుకుంటుందా? నిండు చంద్రుని పండు వెన్నెలకు ఆసక్తమై రమించే చకోరపక్షి ఆ చంద్రికను వదలి దట్టమైన పొగమంచులకు పోతుందా ? అట్లే పద్మగర్భుడైన శ్రీ మహావిష్ణువు దివ్యమైన పాదకమలామృతాన్ని పానం చేస్తూ ఆ మాధుర్యపు మత్తులో మునిగిన ఈ చిత్తం ఎట్లా ఇతరాన్ని చేరడానికి ఒప్పుకుంటుంది. వేయిమాటలెందుకూ? వినుత గుణ శీలా ! అంటూ ప్రహ్లాదుడు సమాధానం చెప్పినాడు.

ఇక్కడ చమత్కారం ఏమిటీ అంటే ప్రశ్నించి బుద్ధి చెప్పింది హిరణ్యకశిపుడైతే, తండ్రినివదిలి సమాధానంచెప్పింది

పురోహితునికి - అంటే ప్రహ్లాదునికి తండ్రి తత్త్వం బాగా తెలుసు నన్నమాట. అందుకే 'వినుతగుణశీలా' అంటూ పురోహితుణ్ణి సంబోధించినాడు. అన్నీ తెలిసీ ఉత్తమ గుణాలకు కుదురైన మీరే చెప్పండి, విశిష్ట పదార్థమైన శ్రీహరిని వదలి నికృష్టార్థదాయకాలు, అస్థిరాలూ ఐన ప్రాపంచిక విషయాలపైపు ఎట్లా వెళ్ళగలనూ అంటూ ప్రశ్నించినాడు. ఇందులో సాధ్యం ఐతే హిరణ్యకశిపునికి కూడా కనువిప్పు కలిగే సూచన ఉంది.

సీ. కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే ?
        పవన గుంభిత చర్మ భస్త్రిగాక
    వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే ?
        ఢమ ఢమ ధ్వనితోడి ఢక్కగాక
    హరిపూజనములేని హస్తంబు హస్తమే ?
        తరుశాఖ నిర్మిత దర్విగాక
    కమలేశు జూడని కన్నులు కన్నులే ?
        తనుకుడ్య జాలరంధ్రములుగాక

ఆ. చక్రిచింతలేని జన్మంబు జన్మమే ?
    తరళ సలిల బుద్బుదంబుగాక
    విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే ?
    పాదయుగముతోడి పశువుగాక.

పరమభాగవతోత్తముడైన ప్రహ్లాదుడు హిరణ్యకశిపునికి విష్ణుభక్తి ప్రభావాన్ని వర్ణిస్తూ చెప్పిన పద్యం ఇది.

కమలనేత్రుడైన విష్ణునిమిత్తం కాని ఈశరీరం అదీ ఒక శరీరమా? గాలితో నింపబడ్డ తోలుతిత్తిగాక! వైకుంఠుడైన హరిని పొగడని ముఖం అదీ ఒక ముఖమా ? ఢమఢమ అంటూ మ్రోగే ఢక్కగాక! శ్రీహరి పూజచేయని చేయి అదీ ఒక చెయ్యా? చెట్టు కొమ్మతో చేసిన తెడ్డుగాక!విష్ణుని చూడని కండ్లూ అవీ కండ్లేనా? శరీరం అనేగోడకు ఏర్పరచిన గవాక్షపు తొర్రలుగాక! చక్రి చింతలేని జన్మ అదీ ఒక జన్మేనా? నీటి బుడగగాక! విష్ణుభక్తిలేని పండితుడూ ఒక పండితుడా? రెండు కాళ్లున్న గొడ్డుగానీ! అంటూ వివరించినాడు

పోతనను పురస్కరించుకుని మానవుని సర్వాంగాలూ శ్రీహరి నిమిత్తంగానే ఉపకరించవలె, లేనినాడు ఆజన్మ వ్యర్థం, ఈ భావాన్నే ఎంతో విపులీకరిస్తూ స్పష్టపరిచినాడు. నారదపంచ రాత్రంలో 'సర్వోపాధి వినిర్ముక్తం తత్పరత్వేన నిర్మలమ్।హృషీకేశసేవనం భక్తిరుచ్యతే' అంటూ చెప్పబడింది. అట్లే పోతన కూడా అంగిలోని అంగాలను కాయమూ, వక్త్రమూ, హస్తమూ, నేత్రమూ అంటూవిడదీస్తూ వీటితో స్వామిసేవనమూ,అర్చనమూ, దర్శనమూ, సంకీర్తనమూ, చింతనమూ చేస్తూ భక్తి సలుపని వాడిశరీరాన్ని తోలుతిత్తిగా, ముఖాన్ని ఢక్కగా, చేతిని తెడ్డుగా, కండ్లను గోడరంధ్రాలుగా పోలుస్తూ, చివరకు విష్ణుభక్తుడు కాని విబుధుడుకూడా రెండుకాళ్ళ పశువు అంటూ తీర్పును ఇచ్చినాడు. ఈమాటలు కవి తానై చెప్పక భక్తాగ్రణి ఐన ప్రహ్లాదుని నోట పలికించి సార్థక్యాన్ని పెంచినాడు. భక్తులకు అమృతంవలె ఆస్వాద్యమైన పద్యం ఇది.

ఉ. కానని వాని నూఁతగొని
కాననివాఁడు విశిష్ట వస్తువుల్
గానని భంగిఁ గర్మములు
గైకొని కొందఱు కర్మబద్ధులై
కానరు విష్ణుఁగొందఱటఁ
గందురకించన వైష్ణవాంఘ్రి సం
స్థాన రజోఽభిషిక్తులగు
సంహృత కర్ములు దానవేశ్వరా !

ఈ పద్యం కూడా ప్రహ్లాదుఁడు హరిమహిమను ఎరుగలేని నరుల స్థితిని వర్ణిస్తూ చెప్పినట్లు పోతన వ్రాసిన పద్యం.

గ్రుడ్డివాడు గ్రుడ్డివాడిని ఆధారంగా తీసుకొని విశిష్టమైన మేలు పదార్థాలు చూడని విధంగా కొందరు కర్మలను ఆలంబనంగా చేసుకొని ఇంకా కర్మబద్ధులౌతూ ఆ శ్రీ మహావిష్ణువును చూడరూ, చూడలేరు. కొందరు ఏ పదార్థమందూ నాదీ అనే బుద్ధిని విడిచి ప్రపన్నులై విష్ణుభక్తుల పాదపదధూళిచేత అభిషేకింప బడుతూ, నశించిన సర్వకర్మలు గలవారై ఆ మహావిష్ణువును చూడగలుగుతారు అంటూ విశదం చేసినాడు.

శ్లో॥ నైషాం మతిస్తావదురుక్రమాంఘ్రిం
స్పృశత్యే నర్థాపగమో యదర్థః
మహీయసాం పాదరజోఽభిషేకం
నిష్కించనానాం నవృణీత యావత్

న తే విదుః స్వార్థగతిం హి విష్ణుం
దురాశయా యే బహిరర్థమానినః
అంధా యథాంధై రుపనీయమానా
వాచీగతన్త్యాముదామ్ని బద్ధాః॥

భాగ. 7-5-31,32

అంటూ ఉన్న శ్లోకాలను అనువదిస్తూ పైపద్యాన్ని వ్రాసినాడు. ఇక్కడ పోతన ఈ రెండు శ్లోకాల భావాన్ని దాదాపు పూర్తిగా అనువదించినాడనే చెప్పవచ్చు కానీ, మూలంలో మహీయసాం అంటే మహానుభావులు అని అర్థం వచ్చే పదానికి వైష్ణవులుగా తెలిగించినాడు. వైష్ణవులంటే పోతన దృష్టిలో విష్ణు భక్తులనే అర్థం రూఢిఐ ఉంటుంది. ఇట్లే పోతన దృష్టిలో సంసార బంధాలను వదిలి విష్ణు పాదపద్మాలను చేరడానికి విష్ణుభక్తుడే శరణ్యం అనే విషయాన్ని కూడా ప్రకటించినాడు. నిజానికి ఇహాన్ని రోసినవాడు ఆ విష్ణువును పూర్తిగా గ్రహించిన పరమ భక్తుడు దారి చూపుతుండగా నడుస్తూ ఆ పదాన్ని చేరవలసిందే కానీ మరో విధంగా వీలులేదు. అట్లా చేసినవాడు కండ్లులేని గుడ్డివాడు మరోగుడ్డివాడి చేతిని ఊతగా పట్టుకొని ప్రయాణం చేస్తూ చూడవలసిన మహాపదార్థాన్ని చూడలేనట్లు మానవుడు తనను బంధించే కర్మనే ఆధారంగా చేసుకొని శాశ్వతమైన బ్రహ్మను చేరకుండా మరీమరీ బద్ధుడు కావలసిందే అంటూ విశదపరచినాడు. నిజానికి జ్ఞానచక్షువులేని మూఢుని మరొకమూర్ఖుడు చేయూతగా పట్టుకొన్నప్పుడు తిరిగేది అపమార్గంలోనే కాని. వెలుతురును చూడలేడు కదా. అందుకే మార్గదర్శకుని విషయంలో జాగ్రత్త పడవలెనంటూ పోతన హెచ్చరించినాడు.

మ. తనుహృద్భాషల సఖ్యమున్
శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో
నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల
సర్వాత్మున్ హరిన్నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ
దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా!

కొడుకైన ప్రహ్లాదునిపై పుట్టెడు ఆశలు పెంచుకున్న హిరణ్యకశిపుడు చదువులలో నీ ఉత్కర్షను జూపుమంటూ కోరినపుడు ప్రహ్లాదుడు తాను శాస్త్రాలన్నీ గురువులతో చదివీ ఆ చదువులలో ఉన్న మర్మమంతా తెలుసుకున్నానంటూ ఆ రహస్యాన్ని ప్రకటించే సందర్భంలో చెప్పినట్టిదీ పద్యం

భగవంతుని పురస్కరించుకొని శరీరంతో, హృదయంతో, మాటలతో స్నేహం ఏర్పడవలె అట్లే ఆహరిని గూర్చి శ్రవణమూ, దాస్యమూ, వందనమూ, అర్చనమూ, సేవా, ఆత్మజ్ఞానమూ, సంకీర్తనమూ, చింతనమూ అనే ఈ తొమ్మిది భక్తి మార్గాలు, ఈ తొమ్మిది విధాలల్లో మనకు చేతనైన భక్తి మార్గంలో సర్వాత్మకుడైన హరిని నమ్మి సత్పురుషుడై ఉండడమే మేలు అంటూ నేను నిజంగా భావిస్తున్నాను ఓ దైత్యశ్రేష్ఠుడా! అంటూ చెప్పినాడు.

ఈ పద్యంలో పోతన ప్రహ్లాదుని ముఖతః శ్రవణమూ, కీర్తనమూ, స్మరణమూ, పాదసేవనమూ, అర్చనమూ, వంద

నమూ, దాస్యమూ, సఖ్యమూ, ఆత్మ నివేదనమూ అనే నవ విధ భక్తులనూ చెప్పించినాడు. "ఆత్మ నివేదనం" అనే భక్తి స్థానంలో పోతన ఎందుకో 'ఆత్మలో నెఱుకయున్' అన్నాడు. 'ఎఱుక' అంటే తెలివీ, జ్ఞానమూ, విషయము బోధపడుట అనే అర్థాలున్నాయి పోతన అనన్య శరణాగతిరూపమైన ఆత్మ నివేదనాన్నే ఆత్మలో ఎఱుక అన్నాడో? కాక శ్రీ మధ్వాచార్యుల వారినను సరించి భగవంతుని మాహాత్మ్యాన్ని సమగ్రంగా గ్రహించుట వలన స్థిరపడిన ప్రీతినే ఆత్మలో ఎఱుక అన్నాడో? తెలియదు. కానీ జ్ఞానపూర్వకమైన ఈ అనురాగంతోనే వ్యక్తి ఒకరికి తన్ను తానర్పించుకో గలుగుతాడు. అందుకే పోతన 'ఆత్మనివేదన' స్థానంలో ఆత్మలో నెఱుక అనే పదాన్ని ప్రయోగించినట్లు తోస్తుంది.

ఒక వస్తువుపై భక్తి కుదురవలెనంటే ఆ విషయాన్ని గూర్చి ఎప్పుడూ వింటూ ఉండవలె. విన్నదాన్ని పాడుతూ ఉండవలె, మననం చేస్తూ ఉండవలె. వీటి వల్ల గురికుదిరి సేవా, పూజా, నమస్కారమూ, దాస్యమూ, స్నేహమూ, చివరకు ఆత్మార్పణమూ కుదురుతాయి. అప్పుడు ఆ పదార్థంతో అభేదం ఏర్పడి ముక్తి లభిస్తుంది—అంటూ పోతన తరతరాలుగా భక్తిని పెంచుకునే విధానాన్ని సూచించినాడు ఈ పద్యంలో.

శా. అంధేందూదయముల్ మహాబధిర
శంఖారావముల్ మూక స
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసక
వధూకాంక్షల్ కృతఘ్నావళీ

బంధుత్వంబులు భస్మహవ్యములు
లుబ్ధ ద్రవ్యముల్ క్రోడస
ద్గంధంబుల్ హరిభక్తివర్జితుల
రిక్త వ్యర్థ సంసారముల్.

గురుకుల వాసం చేస్తూ ఏఏ శాస్త్రాలు చదివినావు, ఏదీ ఒక్కటి వినిపించు తండ్రీ! అంటూ హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని అడిగినప్పుడు తాను తన గురువులు శ్రద్ధగా చదివించగా చదువులలో ఉన్న మర్మాన్ని అంతా గ్రహించినాను అంటూ హరి భక్తి రహితుల నిరర్థకపు సంసారాన్ని వర్ణిస్తూ చెప్పిన పద్యం ఇది.

అంధునికి చంద్రోదయం వలె, చెవిటి వాడికి శంఖధ్వని వలె, మూగ వాడు ఉత్తమ గ్రంథాలను చదువుతూ ఆ గ్రంథార్థాలను చెప్పుట వలె, పుంస్త్వహీనుడైన పేడి వధువును కోరుట వలె, చేసినమేలును మరిచే కృతఘ్నుని బంధుత్వం వలె, అగ్నిలో వేల్చగా భస్మం పొందిన యజ్ఞోపహారమైన అన్నం వలె, పిసినిగొట్టు వాని ధనము వలె, పందికి చూపిన మంచి సుగంధము వలె హరిభక్తి లేనివారి వృథా సంసారాలు వ్యర్థం సుమా అంటూ హెచ్చరించినాడు. కండ్లున్న వాడు ఆ కంటికి ఇంపైన చంద్రోదయాన్ని చూస్తూ వెన్నెల ఇచ్చే ఆనందాన్ని పొందగలుగుతున్నాడు కానీ ఆ వెన్నెలను చూడగల కన్నే లేనప్పుడు ఆ ఉదయించేది వెన్నెలయినా, చీకటయినా ఒకటే. అట్లే శబ్దాన్ని గ్రహించే చెవికి శబ్దాన్ని వినే శక్తే లేనప్పుడు ఆధ్వని శంఖారావం అయితే ఏం ? నక్కకూత అయితే ఏం ? మాటే పలుక లేని వానికి సద్గ్రంథమైనా చచ్చు తిట్లైనా ఫలం ఒకటే. ఇట్లే పురుషత్వ ధర్మమే

లోపించిన వాడికి భార్యాసంబంధమైన కోరికతో ఏం ప్రయో జనం ? అట్లే యజ్ఞోపహారంగా సిద్ధం చేసిన అన్నం అగ్నిలో పడి మాడిదయిన తరువాత దేనికీ ఉపకరించదుకదా! ఇక ఒక రాగి దమ్మిడీ కూడ ఇతరులకు ఇవ్వలేని లోభివాడి ఇనప్పెట్టెలో మూలుగుతున్న మురిపెం కోట్లతో వాడికీ కానీ, పరులకు కానీ ఏం లాభం ? అట్లే బురదను మెచ్చే పందికి పన్నీటి వాసనతో పని లేదు. ఈ విధంగానే హరిభక్తి లేని మానవుల సంసారాలు కూడా నిస్సారాలే - అని తత్వచింతనాన్ని ఎంతో ఉచితమైన ఉపమానా లతో పోల్చి చూపించినాడు.

క. చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ
జిక్కఁడు దానముల శౌచశీల తపములన్
జిక్కఁడు యుక్తిని భక్తినిఁ
జిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ.

ప్రహ్లాదుడు రాక్షస బాలురకు జ్ఞాన, మోక్ష లక్షణాలను చెబుతూ అన్నిటికన్నా 'భక్తి' 'మోక్ష స్థానానికి' దగ్గరి బాట అని బోధించే సందర్భంలో చెప్పింది ఈ పద్యం.

నాశనం లేని శ్రీహరి వ్రతాలవల్ల కానీ, యజ్ఞ యాగాది కర్మల వల్ల కానీ లభించడు, అట్లే దాన ధర్మాల వల్ల కానీ, శుచిత్వమూ, మంచి నడవడీ, తపస్సూ మొదలైన ఉత్తమ లక్ష ణాలు కల్గిఉండటం వల్లకానీ దొరకడు. అట్లని యుక్తితో, చాతు ర్యంతో పొందుదామన్నా ఆతడు 'భక్తి'కి వశుడై దొరికినట్లు ఇతరాలైన ఏ పనుల చేత కూడా పట్టుపడడు. ఇది తప్పదు సుమా అంటూ వారికి తెల్లం కావించినాడు.

ఇక్కడ పోతన వ్రతాలూ, క్రతువులూ చేయవద్దనికానీ, పరిశుద్ధమైన నడవడితో, పరిశుభ్రంగా ఉంటూ జపతపాదులు చేయవద్దని కానీ చెప్పలేదు. కానీ ఈ పనులన్నీ నిష్కామంగా చేస్తే మంచిదే. ఆ నారాయణున్ని చేరేందుకు వీటిని సాధనాలుగా ఉపయోగించే చమత్కారానికి మాత్రం ఆహరి లొంగడు. ఆయన భక్తజన పక్షపాతి. అది తెలిసిన పోతన 'చిక్కడు యుక్తిని భక్తిని జిక్కెడు క్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ' అంటూ గట్టిగా చెప్పినాడు.

సూక్ష్మంలో మోక్షం అన్నట్లు ఏ పాట్లూ లేక ఆయనను నమ్ముకుని అంతా నీవే అన్నప్పుడు రాక తప్పుతుందా, చిక్కక పోతాడా ఆ హరి, అన్నంత ధైర్యంతో పోతన భక్తిని ప్రచారం చేసినాడు.

తె. ఇనుమయస్కాంత సన్నిధి నెట్లు భ్రాంత
మగు హృషీకేశు సన్నిధి నా విధమునఁ
గరగుచున్నది దైవయోగమునఁ జేసి
బ్రాహ్మణోత్తమః చిత్తంబు భ్రాంతమగుచు.

విష్ణుద్వేషియైన హిరణ్యకశిపుని కుమారుడు గురుకుల వాసం నుండి ఇంటికి వచ్చి విష్ణుభక్తిని గూర్చి తండ్రి ఎదుట ప్రసంగించినాడు. ఆ ప్రహ్లాదుని మాటలు విని తండ్రి భగ్గున మండుతూ పసిబాలునికి ఈ బుద్ధులు నేర్పినవారెవ్వరంటూ చండ మార్కులను ప్రశ్నింపగా ప్రహ్లాదుడు తండ్రి మాటలకు సమాధానంగా గురువులను ఉద్దేశించి పల్కిన మాటలు ఈ పద్యం.

ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! సూదంటురాయి సమీపంలో ఉన్న ఇనుము ఏవిధంగా చలిస్తూ స్థిరత్వాన్ని గోలుపోతుందో అట్లే దైవ యోగంతో నారాయణుని సన్నిధిలో నా మనస్సుకూడా అత్యంతము భ్రాంతమై ద్రవీభూతం అవుతూ ఉంది అంటూ సమాధానం చెప్పినాడు.

సూదంటురాయికి ఇనుమును ఆకర్షించే శక్తి ఉంది. అయస్కాంతము ఉంచేచాలు పరిసరాల్లో ఉన్న ఇనుపరేణువు లన్నీ ఆకర్షక మాత్రశక్తితో చేరవచ్చినట్లు వాటంతట అవే వచ్చి చేరుకుంటాయి. అట్లాగే భగవంతునికీ భక్తునికీ విడదీయరాని సంబంధం ఏదో ఉంది. సామాన్యులకు కనబడని దివ్యశక్తి ఏదో భక్తుని చిత్తాన్ని స్వామివైపు ఆకర్షింగావిస్తూ అతనికి తెలియ కుండానే నారాయణుని వైపు నడిపిస్తుంది. అందుకే ప్రహ్లాదుడు ఆ స్థితిని దైవయోగం అన్నాడు. ఇది యోగవిద్యారూపమైన వాసనాబలం కావచ్చు.కాక 'విధిబలం' అంటూ సామాన్యార్థమూ చెప్పుకోవచ్చు. ఈ విధివిలాసం చేతనే హిరణ్యకశిపుని కుమారుడు తమకు ప్రబలశత్రువైన హరిపక్షమువాడైనాడు.

పోతన ఈ పద్యంలో విష్ణువో, నారాయణుడో అనే పదాన్ని వాడక హృషీకేశుడు అన్నాడు. ఈ పద ప్రయోగం ఎంతో అర్థవంతమైంది. హృషీకాలంటే ఇంద్రియాలు. ఆ ఇంద్రియాలకు అధికారి హృషీకేశుడు. ఆయనే శ్రీహరి. మరి ఎవరి అధికారిని వారు ఆశ్రయించడంలో విచిత్రం ఏమీలేదు. అందుకే ఇనుము అయస్కాంత సన్నిధి భ్రాంతం ఐనట్లుగా భక్తుని ప్రమేయం లేకుండానే అతని మనస్సు ఆది రమణం

పొందే చోటుకు పయనిస్తుంది. అట్లాగే తనకు తెలియకుండానే తన మనస్సును శ్రీహరి వశీభూతం చేసుకున్నాడంటూ ప్రహ్లాదుడు తెలియపరచినాడు. 'యథా భ్రామ్యత్యయో' అనే భాగవత మూల శ్లోకానికి పోతన కావించిన యథాతథానువాదం ఈ పద్యం.

క. ఎక్కడఁ గలఁ డే క్రియ నే
చక్కని వర్తించు నెట్టిజాడను వచ్చున్!
జక్కడఁతు నిన్ను విష్ణుఁ
డెక్కులు ప్రేలెదవు వాని భృత్యుని భంగిన్.

ఎన్ని బాధలు పెట్టినా, ఏం చేసినా హరిని మరవక భజించే ప్రహ్లాదుని నిలదీస్తూ హిరణ్యకశిపుడు ఎవడా హరి? ఎక్కడున్నాడు? ఏదీ చూపు?-అంటూ ప్రశ్నించే సందర్భంలో పోతన చెప్పిన పద్యం ఇది.

హరి ఎక్కడున్నాడూ, ఏ దిక్కున తిరుగుతాడూ? ఏ గుర్తుతో వస్తాడూ, నిన్నూ నీ విష్ణువునూ చంపి కుప్పలు పెడ్తాను. ఏదో పెద్దగా అధిక ప్రసంగం చేస్తూ బీరాలు పలుకుతున్నావు వాడి సేవకుని వలె! ఎక్కడరా నీ హరి? సాధారణంగా ఏలిన వాని ఆసరాతో సేవకుడు ప్రవర్తిస్తాడు. ఆ బింకం సేవకుని నోటికి చేతలకు బిగువును కలిగిస్తూ ఉంటే, ఎన్నో ప్రగల్భాలు పలుకుతాడు, గొప్పలు వదరుతాడు. ఆ సేవకుల ఈపాటి ఉత్తుత్త బింకాలు ఎరిగిన సామ్రాట్టు హిరణ్యకశిపుడు. అందుకే చక్రవర్తి కొడుకైన ప్రహ్లాదుని చూచి ఎవడురా నీహరి! ఎక్కడున్నాడు? ఏదీ వాడిని చూపించు. నిన్నూ వాడిని నరికి పోగులు పెడ్తాను

అంటూ కక్ష రెండింతలుకాగా పౌరుషం దెబ్బతిని కోడెనాగువలె బుసలు కొడుతూ ఉండగా ఆ చురకను ప్రహ్లాదునికీ తగిలించి చూపుదామంటూ చేసిన ప్రయత్నం ఇది. శత్రువు పేరును కూడా ఉచ్చరించకుండా "పెక్కులు ప్రేలెదవు వాని భృత్యుని భంగిన్" అంటూ గట్టి పోటు పొడిచినాడు. ఎంతైనా ప్రభువు బిడ్డకదా-ఆభిజాత్యమూ, ప్రభుత్వమూ, దెబ్బ తింటాయి అనుకున్నాడు. కానీ ఆ పరమభక్తుని పట్ల అవేమి జరుగలేదు. అహంకార మమకారాలు అన్నీ వదిలి సర్వమయుడైన హరినే తనకు దిక్కంటూ గట్టిగ నమ్మిన ప్రహ్లాదునికి చీమ కుట్టినట్లైనా కాలేదు. పరికదా మరింత పట్టుదలతో హరిపక్షాన్నే వహిస్తూ హిరణ్యకశిపుని ఎదిరించినాడు. ఈ విషయాన్నే పోతన ప్రహ్లాద చరిత్రలో పదే పదే సూచించినాడు.

మ. కలఁ డంభోధిఁ గలండు

గాలిఁ గలఁ డాకాశంబునం గుంభినిన్

గలఁ డగ్నిన్ దిశలం బగళ్ల

నిశలన్ ఖద్యోత చంద్రాత్మలన్

గలఁ డోంకారమునం త్రిమూర్తులఁ

త్రిలింగ వ్యక్తులందంతటన్

గలఁ డీశుండు గలండు దండ్రి!

వెదకంగా నేల యీయా యెడన్.

హిరణ్యకశిపుడు రెట్టించిన రోషంతో నీహరి ఎక్కడు న్నాడో చూపుమంటూ గద్దిస్తూ పలికినప్పుడు ప్రహ్లాదుడు చెప్పిన సమాధానం ఈ పద్యం.

సర్వేశ్వరుడు సముద్రంలో ఉన్నాడూ, గాలిలో ఉన్నాడూ, ఆకాశంలో, భూమిలో, అగ్నిలో ఉన్నాడూ, రాత్రిం బగళ్లలో, సూర్యచంద్రాత్మలల్లో, ఓంకారంలో, త్రిమూర్తుల్లో, స్త్రీ, పురుష, నపుంసకాది వ్యక్తులల్లో అంతటా ఉన్నాడు తండ్రీ! ఇక్కడా, అక్కడా అంటూ వెదుకవలసిన పనిలేదు - అంటూ తెలిపినాడు.

ఈశ్వరుడు సర్వమయుడూ, సర్వవ్యాపకుడూ అనే భావాన్ని పూర్తిగా అరటిపండు వొలిచి చేతిలో పెట్టినట్లు తేటపరుస్తూ పోతన - ఆ హరి నీరూ, ఆకాశం, భూమి, పగలూ, రాత్రీ, సూర్యుడూ, చంద్రుడూ, ముమ్మూర్తులూ అంటే హరి, హర, బ్రహ్మలూ, మూడు లింగాలకు చెందిన నరులూ, శబ్దమూ, దిక్కులూ అన్నిట్లో, అంతటా నిండుకొని ఉన్నాడు. అందుకే ఆయనను ఎక్కడో ఉన్నాడంటూ ప్రత్యేకంగా వెదకటం వృథా శ్రమ అంటూ వ్యక్తం చేసినాడు.

ఓంకారము ప్రణవరూపం. తొలి శబ్ద స్వరూపం. అందుకే పోతనామాత్యుడు శబ్ద సూచకంగా "ఓంకారం" అంటూ ప్రయోగించినాడు. భగవత్ప్రతిపాదకాలైన సర్వమంత్రాలకూ ఓంకారం ఆదిబీజం వంటింది. అక్షరమాలా ప్రారంభంకూడా ఓంకారంతో చేయడం సంప్రదాయం. 'ఓం' అంటే శుభప్రారంభం అనే అర్థం మన తెలుగువారిలో స్థిరపడి ఉంది. అదే కాకుండా భగవద్గీతలో చెప్పినట్లు 'ఓంకారాన్ని' పోతన స్వామికి నివాస స్థానంగా ప్రకటించినాడు.

క. ఇందుఁగలఁ డందు లేఁడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం

డెందెందు వెదకి చూచిన
నందందే గలఁడు దానవాగ్రణి వింటే!

శ్రీమన్నారాయణమూర్తి అన్నిచోట్ల దర్శనం ఇచ్చే వాడంటూ ప్రహ్లాదుడు ప్రకటించిన సందర్భంలోనిదీ పద్యం.

ఓ దానవశ్రేష్ఠుడా! సుదర్శన చక్రధారియైన శ్రీహరి ఇక్కడున్నాడూ అక్కడలేడూ అనే సందేహమే వద్దు. ఆ హరి అన్నిచోట్లా ఉండేవాడూ, అందరికీ ఆశ్రయింపదగినవాడు. వెదికి చూడనివారిదే తప్పుకానీ. ఎక్కడెక్కడ వెదికితే అక్కడక్కడే ఆయన ఉంటాడు విన్నావా! అంటూ సమాధానం చెప్పినాడు.

ఈ పద్యంలో పోతన శ్రీహరి సర్వవ్యాపకుడూ, సర్వాంతర్యామీ, సకలగమ్యుడూ అంటూ చెప్పి, అసలు ఉన్నాడా లేడా అనే సందేహానికి స్వస్తిచెబుతూ వెదకడం ప్రారంభించుమంటూ ఉద్బోధించినాడు. ప్రారంభించినవాడు గమ్యాన్ని చేరకపోయినా కొంతదూరమైనా నడుస్తాడు కదా! పడున్నవానికన్నా కూర్చున్నవాడూ, వాడికన్నా నిలుచున్నవాడూ, అంతకన్నా నడిచేవాడు మెరుగుకదా! అందుకే పోతన జాతిలో కొంత మేలుకొలుపును కలిగించడానికి పూనుకుంటూ చెప్పిన పద్యం ఇది.

మ. సరఘల్ గూర్చిన తేనె
మానవులకున్ సంప్రాప్తమైనట్లు లో
భరతుల్ గూర్చిన విత్తముల్
పరులకుం బ్రాపించుఁ బ్రాప్తాశియై

తిరుగంబోని మహోరగంబు
బ్రతుకున్ దీర్ఘాంగమై యుండియున్
జిరకాలంబును వాని
వర్తనములం జింతించి యేకాంతినై.

పూర్వం ప్రహ్లాదుడు కొందరు మంత్రులతో గూడి లోక తత్త్వాన్ని తెలుసుకునే కోరికతో సంచరిస్తూ ఉండగా అజగర వ్రతాన్ని దాల్చి జీవిస్తున్న మునిని సమీపించి ఆ రూపంలో ఆ మునికి అట్లా పడి ఉండవలసిన అవసరం ఏం కలిగిందని ప్రశ్నించినప్పుడు ముని ఇచ్చిన సమాధానం ఈ పద్యం.

తేనెటీగలు కూర్చిన తేనె మానవులకు లభించినట్లూ, లోభి జనం కూడబెట్టిన సంపదలు ఎవరికో లభిస్తాయి. గుండ్రంగా చుట్టుకునే ధర్మాన్ని పొంది, చాలా పెద్ద శరీరం కలిగి ఉండికూడా నడువజాలక పొట్టతో ప్రాకే పెద్దపాము చిరకాలం జీవిస్తుంది. ఈ విధంగా జీవిస్తున్న ఈ జీవుల జీవితాలను ఆలోచిస్తూ నేను ఒంటరివాడినై ఇంకా ఎన్నెన్నో జీవుల జీవితాలను ప్రత్యక్షంగా చూచీ సంసారం నిస్సారమంటూ తెలుసుకున్నాను అనీ తరువాత పద్యంలో చెప్పినాడు.

బుద్ధిజీవి ఐన మానవుడికి ప్రకృతి ఒక పాఠశాలై, సృష్టి ఒక పరిశోధనాలయంబై, సజీవాలైన వింతలతో, ఊహింపలేని రహస్యాలతో అనుక్షణం అనునిత్యం ప్రత్యక్షమౌతూ కనువిప్పు కలిగిస్తూనే ఉంటాయి. ఒకే దృశ్యాన్ని అనేకులు చూచినా వారి వారి అనుభవాలువేరు, వారు గ్రహించే సారం వేరు. అట్లే

అజగరవ్రతాన్ని అవలంబిస్తున్న మునికి, తేనెటీగలు కూడబెట్టిన తేనెలో కష్టమొకరిదీ అనుభవం మరొకరిదిగా గోచరించింది. అందుకేనేమొ ఈనాడు తరచుగా "సొమ్మొకడిదీ సోకొకడిదీ" అంటూ ఉంటారు. ఈ విశేషాన్ని దర్శించిన ఆ ముని లోభి వాడితో ముడిపెడ్తూ, తాను తింటూ పరులకు ఇంతపెట్టని లోభి సొమ్ము పరులపాలే కదా! అన్నాడు. అట్లే ఎంతో పెద్ద శరీరం ఉండీ చిరకాలం జీవించేపాము నడువలేదు, దానికి చుట్టగా చుట్టుకుని నిద్రించే లక్షణం ఉంది. ఇంత ఉండీ అది ఉరగమే. అంటే పొట్టతో ప్రాకుతూ అంత పెద్ద శరీరాన్ని ఈడుస్తూ పోవలసిందే.

పోతన ఈ పద్యంలో 'ప్రాప్తాశియై' అని ఉపయోగించీ ఉరగం అని ఉండకపోతే అర్థనిర్ణయంలో ముప్పుతిప్పలుపెట్టి ఉండేది. ఈ పద్యం అంతంత పాటివారికి లొంగేదికాదు.

శా. నానానేక పయూథముల్
వనములోనం బెద్దకాలంబు స
న్మానింపన్ దశలక్ష కోటి
కరిణీనాథుండనై యుండి మ
ద్దానాంభః పరిపుష్ట చందన
లతాంత చ్ఛాయలందుండలే
కీనీరాశ నిటేల వచ్చితి
భయంబెట్లో కదే! యీశ్వరా

నీటిలో దిగిన గజరాజును మొసలి పట్టుకున్నప్పుడు శక్తి ఉన్నంత వరకూ ఏనుగు మొసలితో పోరాడింది. స్థాన బలం చాలక ఏనుగుకు ఉన్నంత శక్తి అంతకంతకూ తగ్గుతూ వచ్చి నప్పుడు ఏనుగు చేసేదిలేక ఆ చోటికి రావడమే తన తప్పుగా భావించుకుంటున్నప్పటి పద్యం ఇది.

అనేకమైన గజసంఘాలు అరణ్యంలో చాలాకాలంగా సన్మానిస్తూ ఉండగా, పదిలక్షలకోట్ల ఆడ ఏనుగులకు మగడై ఉంటూ నా దానజలంతో సంపూర్ణంగా పెరిగిన మంచి గంధపు పూపొదరింటి నీడల్లో ఉండలేక నీటికోరికతో ఇక్కడి కెందుకు వచ్చానో. ఈ భయాన్ని ఎట్లా తొలగించుకుంటానో కదా? ఓ భగవంతుడా-అంటూ తన గతాన్ని ఇప్పటి స్థితినీ తలచుకున్నాడు.

ఈ పద్యం ఎంతో తేలికగా సాగింది. అడ్డులేని ఒకమహా చక్రవర్తి వైభవాన్ని సూచించేందుకు అనువైన పదాలన్నీ,ఆయన కనుసన్నల నడిచినట్లు వస్తూ, వాటివాటి స్థానాలల్లో స్థిరపడ్డాయి. పోతనకు జన జీవిత విధానమే కాకుండా అడవుల్లో నివసించే ఆటవిక జంతుజీవ లక్షణం కూడా బాగాతెలిసినట్లుంది. గజేంద్రు డింత వరకూ అనుభవించిన విభవాన్ని వదలివచ్చి, కొలనులో మొసలిచే చిక్కి గట్టుపై భార్యలు కుయ్యో! అంటూ గజేంద్రుని విడిచి పోలేక కుములుతూ ఉంటే వారిని ఓదార్చలేకా, తాను శత్రువు చేతిలో చిక్కి క్రుంగుతూ ఉన్న స్థితిని వర్ణిస్తూ పోతన మనకు కాల ప్రభావాన్నీ దానితో కలిగే దశాపరిణామాన్నీ మనకు ప్రత్యక్షం చేసినాడు.

ఉ. ఎవ్వనిచేజనించు జగ
మెవ్వని లోపలనుండు లీనమై
యెవ్వని యందుడిందుఁ
బరమేశ్వరుఁ డెవ్వడు మూలకారణం
బెవ్వఁ డనాది మధ్యలయుఁ
డెవ్వడు సర్వముఁ దానయైన వాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు
నీశ్వరునే శరణంబు వేఁడెదన్.

గజరాజు మొసలిచే పట్టుపడీ పెద్దకాలం పోరాడీ చివరకు తన శక్తి తగ్గుతున్నట్లు గ్రహించిన గజేంద్రుడు తన తొల్లిటి వైభవాన్నీ ఇప్పటి తన ఆపదను తలచుకుంటూ చివరకు దీనులకు దిక్కైన పరమేశ్వరుణ్ణి శరణుపొందినట్లుగా మనస్సులో ఆ హరిని గూర్చి ధ్యానించిన సందర్భంలో ఉన్నదీ పద్యం.

ఎవ్వని వలన ఈ సకల జగత్తూ పుడుతుందో, ఎవ్వని లోపల కలిసి ఉంటుందో, ఎవ్వనిలో అణిగి పోతుందో, ఎవ్వడు ఈశ్వరులకు ఈశ్వరుడో, ఎవ్వడు అన్నిటికి ప్రధానమైనకారణమో, ఎవ్వడు ఆది, మధ్య, అంత రహితుడో, ఎవ్వడు సర్వం తానే ఐన వాడో, ఎవ్వడు తనకు తానై సృష్టించుకున్నవాడో అటువంటి అధిపతిని నేను శరణు వేడుతున్నాను- అంటూ పరార్థంవైపు దృష్టిని మళ్ళించినాడు.

పోతన దృష్టిలో పరమేశ్వరుడు సర్వతంత్రస్వతంత్రుడూ, స్వేచ్ఛాధీనుడూ, సమస్త భువనాలను తన లోపల ఇముడ్చుకున్న

వాడూ, అన్ని జగాలను పుట్టించేవాడూ, అన్నిటినీ రక్షించేవాడూ, పుట్టడం, పెరగడం, చావూ అంటూ లేనివాడు, సంకల్పమాత్రంతో తన్ను తాను పుట్టించుకునే వాడూ, మూలకారణమైన వాడూ, ప్రభువులకు ప్రభువైనవాడూ, అంతా తానే ఐనవాడు అంటూ స్పష్టపరచినాడు. ఇక్కడ పోతన ప్రారంభించిన 'ఎవ్వడు' అనే ప్రశ్నార్థక రూపమైన పదంలోనే 'వాడు సర్వేశ్వరుడు' అనే సమాధానం వెంబడించి వస్తున్నట్లు చమత్కారంతో వ్రాసిన పద్యంఇది.

మానవుడు తనశక్తి మీద నమ్మకం ఉన్నంతసేపూ ఏఇతర శక్తినీ తలపక ఎదిరిని ఎదిరిస్తానంటూ తలపడ్తాడు. తనూ తన బలం క్షీణిస్తున్నట్లు పసికట్టిన వెంటనే ప్రత్యర్థి కన్నా శక్తివంతమైన ఇతర ఆలంబనాన్ని వెదకడం ప్రారంభిస్తాడు. అట్లాగే గజేంద్రుడు తన బలహీనతనూ, శత్రువు చేవనూ గుర్తించిన తరువాతనే పరాత్పరుడైన ఈశ్వరుణ్ణి శరణు వేడినాడు, భక్తికి చోటిచ్చినాడు. నిరాశ్రయమైన నిరుపేద గుండెలోనే భక్తి గూడు కట్టుకొని కాపురం చేస్తుంది. ఈ విషయాన్ని ఆకళించుకున్న పోతనకు ఈ పద్యం సహజమై జాలువారింది.

క. కలఁడందురు దీనుల యెడఁ
 గలఁడందురు పరమయోగి గణముల పాలం
 గలఁడందురన్ని దిశలను
 గలఁడు గలండనెడువాఁడు గలఁడో లేఁడో.

మొసలితో చాలాకాలం పోట్లాడీ పోట్లాడీ చివరకు దిక్కుతోచని స్థితి సంభవించినప్పుడు, అన్ని దిక్కుల తానే ఐన

విష్ణువును స్వయం ప్రకాశమానుడై ఈశ్వరేశ్వరుణ్ణిగా, సర్వ జగత్కారణుడుగా భావిస్తూ, స్తుతించీ చివరకు అంతటి మహా మహిమానుభావుడైన జగత్పతి ఎక్కడున్నాడో అంటూ సత మౌతూ స్థిమితం కుదరక తల్లడిల్లుతున్నప్పటి భావన ఇది.

దీనుల పక్షంలో ఉన్నాడంటారు, గొప్ప యోగివరుల పాలిటకూడా ఉన్నాడంటారు, అన్నిదిక్కుల వాడే ఉన్నాడు అంటారు మరి అందరూ 'ఉన్నాడూ, ఉన్నాడు' అనేవాడు నిజంగా ఉన్నాడా? అంటూ ఆ దీన జనావనుడైన హరి ఉనికిని గూర్చి సందేహాన్ని వ్యక్తపరచినాడు గజేంద్రుడు.

గజేంద్రుడు ఇంతవరకూ తన జాతికి నాయకుడై సాటి లేని వైభవాన్ని అనుభవించిన వాడు. ఇప్పటి వరకూ దైన్యం అంటే తెలియనివాడు. ఆపదలరుచి ఎరుగనివాడు. పౌరుష ఘన మైన భోగాలకు అలవాటు పడిన వాడు. అందుకే గజరాజు లపన్నుడు కానీ, ప్రపన్నుడు కానీ కావటానికి వీలు లేదు. తన శక్తి సడలి ఆర్తి ఎక్కువైన కొద్దీ ఈ లోకపు శక్తిని మించిన పరాశక్తి ఒకటి ఉంది అనే భావన పొటమరించింది. అప్పుడు జ్ఞానోదయం కలిగీ స్వామిని కీర్తించినాడు. ఆస్తుతుల్లో పరమేశ్వరుడు అన్ని దిక్కుల్లో దీనుల పాలిటా, యోగుల పాలిటా ఉండే వాడన్న విషయం గుర్తుకు వచ్చింది. అప్పుడు నిజంగా ఆ స్వామి దీనుల యెడ ఉన్నాడన్న మాట వాస్తవమే ఐతే మరి నేను దీనావస్థలో ఉన్నానుకదా! నన్నెందుకు రక్షించడంలేదూ? అన్ని దిక్కుల్లో ఉంటే? మరి నాదిక్కుకు ఎందుకు రావడం లేదూ అంటూ తెలిసీతెలియని పసిపిల్లవాడిలా చిటపట లాడినాడు.

నిజమే గజేంద్రు డింకా పరిపక్వ దశకు చేరుకోలేదు; తప్పక రక్షించి తీరుతాడు అనే నమ్మకాన్ని కుదిరించుకున్న యోగి కాడు; రక్షింప 'నీదేభారం' అంటూ ఆర్తుడై అన్యథాశరణం నాస్తి అని పూర్తిగా శరణు పొందలేదు. భక్తిని తరతరాలుగా పెంచుకుంటున్న స్థితిలో ఉన్నాడు. భక్తుని ఆ స్థితిని వ్యక్తం చేసే పద్యం ఇది.

శా. లావొక్కింతయులేదు, ధైర్యము
 విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
 ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చెఁ
 దనువున్ డస్సెన్, శ్రమంబయ్యెడిన్
 నీవేతప్ప నితఃపరం బెఱుఁగ,
 మన్నింపందగున్ దీనునిన్
 రావే యీశ్వర! కావవే వరద!
 సంరక్షించు భద్రాత్మకా!

కరిరాజు మొసలిచేత చిక్కి పోరాడీ పోరాడీ విసిగీ వేసారి, ఈశ్వరుడు తలపులో మెసలగా ఆయన గుణగణాలను తలపోసీ అయ్యో అంతటి సమర్థుడైన వాడుంటే నన్ను కాపాడడా అంటూ వాపోతూ చివరకు నీవే తప్ప మరేమీ ఎరుగనూ, వచ్చి నన్ను రక్షించు తండ్రీ అంటూ అనన్య శరణాగతితో ప్రార్థించిన పద్యం ఇది.

బలం నాశరీరంలో కొంచెం కూడా లేదు. ధైర్యం చలించి పోయింది. ప్రాణాలు అవి ఉన్న స్థానాలను వదలుతున్నాయి. మూర్ఛ వస్తూ ఉంది, శరీరమంతా అలసిపోయింది, శ్రమ అధిక

మౌతూ ఉంది. నీవే తప్ప మరేపరుణ్ణీ ఎరుగను, ఎవ్వరూ నాకు లేరు, ఈ దీనుణ్ణి మన్నించవలె, వరదుడవైన ఓ ఈశ్వరా ఇక రావా? కాపాడవా? నన్ననుగ్రహిస్తూ వచ్చి సంరక్షించు భద్రాత్మకా — అంటూ మొరపెట్టుకున్నాడు.

గజేంద్రుడు ఇప్పుడు ఆర్తుడై జగదీశ్వరునికి పూర్తిగా ఆత్మార్పణం చేస్తూ నీ కన్నా ఇతర శరణ్యం నేను ఎరుగను. రా తండ్రీ వచ్చి కాపాడు ప్రభూ అంటూ తల్లడిల్లిపోతూ ఎలుగెత్తి పిలిచినాడు. స్వామికి రాక తప్పలేదు. గజేంద్రుడు ప్రదర్శించిన భక్తిని 'ఆర్తభక్తి' అంటారు. ఈ భక్తుడు సాధారణంగా శత్రునాశనంకొరకూ, దుఃఖనివారణకొరకూ భగవంతుని శరణు చొచ్చి ప్రార్థనలు చేస్తాడు. ఆ స్వామి అనుగ్రహంతో బాధల నుండి విముక్తిని పొందుతాడు

ఈ పద్యంలో 'ఈశ్వర' 'వరద' 'భద్రాత్మకా' అనే పదాలు పద్యానికి అంతటికీ ఆయువుపట్టువంటివి. స్వామి వరదుడు కాబట్టి తనను అనుగ్రహింప గలుగుతాడు, ఈశ్వరుడు కాబట్టి తన కంటే బలీయమైన మొసలిని శిక్షింప గలుగుతాడు, మంగళాత్మకుడు కాబట్టే సంరక్షణ చేయగలుగుతాడు ఈ మూడు లక్షణాలను ముప్పిరులుగా అల్లుకున్న గుణవంతుడు శ్రీహరి. అందుకే కరిరాజు ఆ హరిని శరణు పొందినాడు.

గజేంద్రుడేకాక, ఈ పద్యాన్ని ఆపదలో చిక్కుకున్న ఆస్తికులందరూ ఎప్పుడో ఒకప్పుడు చదివి ఉండక పోరు. అందరికీ ఆపత్కాలంలో అక్కరకు వచ్చే పద్యాన్ని రచించిన పోతన మరుపురాని వాడు.

మ. సిరికిం జెప్పడు శంఖచక్ర
యుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ
డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తర ధమ్మిల్లముఁ జక్కఁ
నొత్తఁడు వివాద ప్రోద్ధత శ్రీకుచో
పరి చేలాంచలమైన వీడఁడు
గజప్రాణావనోత్సాహియై.

అలసి సొలసిన కరిరాజు ఆర్తుడై ఓ కమలాక్ష, ఓ వరద, రావే! కరుణించవే! శరణార్థిని నన్ను కావవే అంటూ మొరపెట్టు కున్నాడు. ఆ ఏనుగు మొరను ఎక్కడో వైకుంఠపురంలో తన మందిరానికి ప్రక్కలో ఉన్న మందారవనంలో సరోవరం దాపున చంద్రకాంత శిలాతల్పంలో భార్యతో వినోదిస్తూ ఉన్న విష్ణు మూర్తి విన్నాడు. భక్తుని ఆర్తిని విన్న భక్తజన పోషకుడు వెంటనే సంరంభిస్తూ బయలుదేరినాడు. భక్తుని కాపాడే నిమిత్తం బయలుదేరబోతున్న ఆ హరి తొందరనూ,గజిబిజిపాటునూ వర్ణిస్తూ చెప్పిన పద్యం ఇది.

ఎప్పుడూ తనని పాయని లక్ష్మీదేవికైనా చెప్పడు. తనకు విడిపోరాని శంఖ చక్రాది ఆయుధాలనన్నా చేతిలో పట్టడు. ఏ పరివారాన్ని పిలువడు. గరుడ వాహనాన్నైనా.ఏర్పాటుచేయమనడు. చెవికి పెట్టిన అలంకారం మధ్యలో చిక్కిన కొప్పునన్నా సరిగా సరిచేసుకోడు. వివాదంలో మాటామాటా పెరిగి నీవా నేనా అంటూ

చేతబట్టిన శ్రీదేవి ముసుగు కొంగైనా విడుపకుండా శ్రీహరి కరిరాజు ప్రాణాలను కాపాడే ఉత్సాహంతో బయలుదేరినాడు అంటూ చెప్పినాడు.



ఇంతవరకు తనతో క్రీడిస్తూ, పక్కనే భార్యతో ఏంజరిగింది ఎక్కడకు వెళ్ళేది చెప్పక పోవచ్చు. చేత ఉన్న మగవాడు శంఖ చక్రాలను మరిస్తే మరిచి వుండవచ్చు. పెట్టక తప్పని అలంకారాల వంటి ఆయుధాలనే పట్టుకోనప్పుడు పరివారాన్ని పిలువలేదంటూ వేరే చెప్పవలసిన అవసరం లేదు. సమర్థుడు దేన్నైనా సాధింప గలుగుతాడు. అందుకే గరుత్మంతునికి కూడా కబురు పెట్టక ఆలస్యాన్ని సహింపలేని శ్రీహరి వెంటనే బయలుదేరి వుండవచ్చు. ఇన్నిటిని ఆలోచించనివాడు చెవికమ్మ సందులో చిక్కిన సిగపెంట్రుకల షోకునుగూర్చి ఆలోచిస్తాడా! లేదు! హుటా హుటిని అమ్మో! నా భక్తుడే అంటూ బయలుదేరినాడు. అన్నిటినీ ఆయత్తపరచడాన్ని మరిచినట్లే సొగటాలాటల్లో పాతబాకీలు వసూలు చేసుకుంటున్నారో ఏమో! వివాదంముదిరి అమ్మవారికొంగు అందు కున్నాడుశ్రీహరి. ఆత్రంతో పట్టిన కొంగును వదలడం మరిచినాడు శృంగారాధిదేవత. ఎదకొంగు చేతబట్టి నడుస్తున్న నారాయణుని వెంట ఏమిటి ఎందుకు అనే ధైర్యంలేక వెంట అమ్మవారూ బయలుదేరింది. అమ్మవారివెంట అడుగకనే తత్సఖులు, తదితర పరివారం, శంఖ చక్రాలూ నడుస్తూ వెంబడించినాయి. స్వామి ఎరుగనివాడా వదలక పట్టిన ఆ కొంగు అంతపని చేసింది. ఇదే ఈ పద్యంలో ఉన్న సొగసు, విశేషం. అందుకే పోతన "వివాద ప్రోద్ధత శ్రీకుచోపరిచేలాంచలమైన వీడఁడు" అంటూ భక్తి

శృంగారాలకు ఒక పంక్తిలో కుడుపుపెట్టినాడు. ఈ పద్యం శ్రీహరి భక్తజన పక్షపాతానికి గీటురాయి వంటిది.

శా. కామోత్కంఠత గోపికల్
భయమునం గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్య
నృపతుల్ సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు భక్తి నేము నిదె
చక్రింగంటి మెట్లైన ను
ద్దామధ్యాన గరిష్ఠుఁడైన
హరిఁ జెందన్వచ్చు ధాత్రీశ్వరా!

శ్రీకృష్ణునికి ప్రబలశత్రువైన శిశుపాలుడు ఆకృష్ణునే ఎట్లా పొందగలిగినాడంటూ ధర్మరాజు అడిగిన ప్రశ్నకు సమాధానంగా అంతా తెలిసిన నారదమహర్షి ఆ శ్రీహరిని కామంతో, కోపంతో, బాంధవ్యంతో, భయంతో ఏరూపంతోనైనా సరే తలచినవారు చేరవచ్చును అంటూ తొలుత సామాన్యంగా చెప్పినాడు. అయినా ఆమాటలు వినేవారికి అంత నమ్మకాన్ని కలిగిస్తాయో లేదో? అంటూ ఆలోచించీ తన మాటలను ప్రత్యక్ష ప్రమాణాలతో రుజువుచేస్తున్నట్లు ఒక్కొక్క మార్గానికి ఒక్కొక్కరిని సాక్ష్యంగా నిలుపుతూ ఈ పద్యం చెప్పినాడు.

తాము కోరిన కృష్ణుని పొందవలెననే మోహపారవశ్యంతో గోపికలూ, భయంతో కంసుడూ, విరోధానికి తగిన కారణంతో శిశుపాలుడూ మొదలైన రాజులూ, సంబంధబాంధవ్యంతో వృష్ణి

వంశీయులూ, ప్రేమతో మీరూ అంటే పాండవులూ, భక్తితో మేమూ మావంటి ఇతర ఋషులూ, శ్రీహరిని పొందినాము. ఏది ఏమైనా అవధులు లేని హరిధ్యానంలో అభివృద్ధిచెందవచ్చు[illegible] ఓరాజా! అతడు ఎవరైనా సరే హరిని పొందవచ్చు అంటూ స్పష్టంచేసినాడు.

లీలామానుష విగ్రహుడైన గోపాలుని మోహన రూపాన్ని, వేణుగానాన్నీ చూచీ, వినీ, గోపికలు మధురానుభవరూపంలో ఆ కృష్ణునిపొందవలెనంటూ అతిశయమైనకోరికతో కృష్ణునే సర్వకాల సర్వావస్థలల్లో చింతించినారు. కృష్ణునిచేత తనకు నాశం తప్పదని తెలిసిన కంసుడు భయంతో నిద్రిస్తూ, మేలుకున్నప్పుడూ, అంతః పురంలో, రాజసభలో ఇతర ప్రసంగాలల్లో కృష్ణుని తలపని [illegible] లేదు. తనకు నియమించిన కన్య రుక్మిణిని తనకు [illegible] వివాహమైనాడంటూ శిశుపాలుడూ, సమయం [illegible] ఆహరిని దూరేబుద్ధితో ఎదిరిస్తూ ఆ పేరునే ఉచ్చరించినాడు. ఇట్టే తదితర రాజలోకం కూడా మాత్సర్యంతో శత్రుత్వంతో [illegible] గూర్చే ఆలోచించినారు. ఇక, బంధుత్వంతో [illegible] భోజాదులు మెలగినారు. తమకు సర్వవిధాలా [illegible] చేస్తుండగా ఎంతో ప్రేమతో పాండవులు ప్రవర్తించినారు. ఇక సర్వసంగపరిత్యాగులూ, తత్వజ్ఞులూ ఐన [illegible] భక్తితో శ్రీకృష్ణుని సాక్షాత్తు శ్రీమహావిష్ణువనే భావించి [illegible]. ఇట్లా అనేక కారణాలతో అనేకులు ఒక్క [illegible] తలుస్తూ ఉన్నారు. అందుకే ఆహరి [illegible] ధ్యానంలో మునిగినవారికి [illegible] అంటూ పోతన నారదుని నోట [illegible].

శా. ఓ కాకుత్స్థకులేశ! యో
గుణనిధీ! యో దీనమందార ! నే
నీ కోపంబున కెంతవాఁడ
జడనిధిన్ నీవేమి భూరాజవే
లోకాధీశుఁడ వాదినాయకుఁడ
వీలోకంబు లెల్లప్పుడున్
నీకుక్షిన్ ప్రభవించుచుండు
నడఁగున్నిక్కంబు సర్వాత్మకా!

భాగవతంలో శ్రీరామావతార ఘట్టాన్ని వర్ణించే సందర్భంలో సీతా వియోగాన్ని పొందిన శ్రీరామచంద్రుడు వానరులతో కూడి వారధిని నిర్మించేప్పుడు ఎంతకూ పీలుపడనీయని సముద్రుణ్ణి చూచి, బాణాన్ని సంధించినాడు. అప్పుడు సాకారుడైన సముద్రుడు రాముణ్ణి స్తుతించిన పద్యం ఇది.

కాకుత్స్థవంశానికి ఈశ్వరుడవైన ఓరామా! గుణాలన్నిటికీ నిధి ఐనవాడా! దీనులకు కల్పవృక్షం వంటివాడా! రామభద్రా! నీకోపానికి నేనెంతవాడినీ, సముద్రుణ్ణీ, మూర్ఖుణ్ణీ. నీవేమి సాధారణుడవైన భూరాజువా? లోకాలకే అధీశ్వరుడవూ, అనాది నాయకుడవూ. ఈలోకాలన్నీ నీకడుపులోనే పుడుతూ ఉంటాయి, నశిస్తూ ఉంటాయి, ఈ మాట నిజం ప్రభూ!—అంటూ వినతులు చేసినాడు.

ఈపద్యంలో పోతన శ్రీరామచంద్రుణ్ణి శ్రీమహావిష్ణువుగనే ప్రతిపాదించినాడు. ఆమాట తానుగాక సముద్రునిచేత చెప్పించి

నాడు. అందుకే సముద్రుడు రాముణ్ణి ఓ గుణనిధీ! దీనజన పోషకా అంటూ సంబోధిస్తూ నీవు కేవలం ఒక్క కాకుత్స్థకులానికి చెందిన రాజమాత్రుడవు కావు. నీవు ఈలోకాలన్నిటికీ ప్రభువువై అనాది నుండీ నడిపిస్తూనే ఉన్నావు. అంతేకాదు; ఈ లోకాలన్నీ నీ కడుపులోనే పుడ్తూ నశిస్తూ ఉంటాయి. మీశక్తి మీకు తెలియదా ప్రభూ! నేను మీ కోపానికి ఏపాటివాడినీ ! నావల్ల తప్పే జరిగినా అది నాకు సహజం ఎందుకంటారా? నేను జడనిధిని. వీళ్లకు నిధినికదా ప్రభూ తాము అనుగ్రహించిన విశేషాన్ని మరిచినారా? అంటూ జ్ఞాపకం చేసినట్లూ ఉంది, రెండవ అర్థంలో నేను జడుణ్ణీ, ఉత్త తెలివి తక్కువవాడినీ; అందుకే తెలియక తప్పుచేసినాను, కోపగించకండి ప్రభూ అంటూ వేడుకున్నట్లుగా కూడా ఉంది ఈ 'జడనిధిన్' అనే ప్రయోగం.

సీ. ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు
 నొకచోటనక నిండియుండనేర్తు
నెవ్వనివాఁడనం చేమని పలుకుదు
 నాయంత వాఁడనై నడువనేర్తు
నీ నడవడియని యెట్లు వక్కాణింతుఁ
 బూని ముప్పోకలఁ బోవనేర్తు
నదినేర్తు నిదినేర్తు నని యేల చెప్పంగ
 నేరుపులన్నియు నేన నేర్తు

ఆ. నొరులుగారు నాకు నొరులకు నేనొదు
 నొంటివాఁడఁ జుట్ట మొకఁడు లేఁడు

సిరియుఁ బొల్లిఁ గలదు సెప్పెద నాకెంకి
సుజనులందుఁ దఱచుఁ జొచ్చియుందు.

దానవలక్ష్మిని దేవతలకు దోచిపెట్టేందుకు శ్రీమహావిష్ణువు వామనుడుగా అదితి గర్భంలో జనించి, పుట్టీ పుట్టంగానే సకల విద్యలు నేర్చి బలియజ్ఞశాలకు వెళ్ళినాడు. ఆ సమయంలో రూపు దాల్చిన వెలుగులా ప్రకాశిస్తూ ఉన్న పొట్టి వడుగును చూస్తూ, అందరు సభికులతో పాటు దానవచక్రవర్తి కూడా ఆశ్చర్యాన్ని వ్యక్తం చేస్తూ నీవెవ్వరూ? ఎక్కడివాడవూ? అంటూ ప్రశ్నించినాడు. ఆ పశ్నకు సమాధానంగా వామనుడు తన మాటల చమత్కారాన్ని చూపుతూ చెప్పిన పద్యం ఇది.

అయ్యా! ఓ దానవ చక్రవర్తీ! ఇచ్చోటు నాకు మనికిపట్టూ, ఇక్కడ ఉంటానూ, అంటూ ఎట్లా పలుకగలనూ, ఒక్క చోటంటూ లేక అన్నిచోట్లా నిండి ఉంటాను. ఫలానివారి బిడ్డనూ అంటూ ఎట్లా చెప్పగలను. నాయంతవాణ్ణి నేనే ఐ నడువగలను. నా ప్రవర్తన విధానం ఇట్లా ఉంటుందీ, ఈతీరుగా నేను నడుస్తాను అంటూ ఎట్లా చెప్పగలను. మూడు తీర్లుగా పోవనేర్చిన వాడిని, అంతెందుకూ ఇది వచ్చూ అది వచ్చూ అంటూ పేర్కొంటూ చెప్పడం దేనికీ, అన్ని విన్నాణాలనూ నేర్చినవాణ్ణి. ఇతరులు ఎవ్వరూ నాకు లేరు. నేనే అందరికీ అయిన వాడినీ, కాగలవాడినీ. ఒంటరిగాడిని, చుట్టాలెవ్వరూ లేరు. ముందు బాగా బ్రతికిన వాడినీ. నిజంగా నేనుండేస్థానం చెప్పవలెనంటే. సత్పురుషుల్లో సాధారణంగా నేను కలిసి ఉంటాను, అన్నాడు.

ఈ పద్యంలో వామనుడు సామాన్యంగా అయ్యా! నేను ఒంటరినీ, తల్లీ తండ్రీ బంధువులు అంటూ లేని వాడినీ, ముప్పొద్దులూ నడిచేవాడినీ, ఒక్క చోటంటూ నిలిచేవాడినికానూ, నాకు నా ఇల్లంటూ లేని వాడినీ, అన్ని విద్యలు నేర్చిన వాడినీ, ముందు బాగా ఉన్నవాడినీ, మంచి వాళ్ళతోనే కలిసి ఉంటాను— అంటూ చెప్పినట్లుగానే చెప్పినాడు. కాని సూక్ష్మంగా ఆలోచిస్తే సర్వవ్యాపీ, సర్వజ్ఞుడూ, ప్రాతఃమధ్యాహ్న సంధ్యలందూ సంచరించే సూర్యాత్మకుడైన త్రివిక్రముడనీ, విచిత్ర చారిత్రకుడనీ, పుట్టువు లేనివాడనీ, లక్ష్మీదేవిని ఏలిన శ్రీహరి ఈ వామనుడు అంటూ వ్యక్తం కావించినాడు.

మ. గొడుగో జన్నిదమో కమండలువొ
నాకున్ ముంజియో దండమో
వడుగే నెక్కడ భూములెక్కడ
కరుల్ వామాక్షు లశ్వంబు లె
క్కడ నిత్యోచిత కర్మమెక్కడ
మదాకాంక్షా మితంబైన మూ
డడుగుల్ మేరయ త్రోవ
కిచ్చుటయె బ్రహ్మాండంబు నాపాలికిన్.

బలి యజ్ఞశాలకడకు అఖండ తేజస్సుతో ప్రకాశిస్తూ వచ్చిన వామనమూర్తిని చూచీ ఆనందంతో బలిచక్రవర్తి నాయనా! నీవెవ్వరివాడవూ, ఎక్కడినుండి వచ్చినావూ? నీకేంకావాలి? ఏనుగులా? గుర్రాలా, మాడలా, మగువలా, రత్నాలా, దండలా,

భూఖండమా? ఏది కావాలో చెప్పు ఇస్తానంటూ ప్రశ్నింపగా, ఆ మాటలువిన్న పొట్టివడుగు తాను ఒంటరివాడననీ, తనకీ భోగభాగ్యాలేవి అక్కరలేదంటూ చెబుతూ తనకు కావలసింది మూడడుగుల భూమిమాత్రమే అంటూ సమాధానం ఇచ్చిన సందర్భంలోనిది ఈ పద్యం.

ఓ ప్రభూ! నాకు ఎండకాచుకోవడానికి గొడుగో, బ్రాహ్మణ బ్రహ్మచారినికాబట్టి జన్నిదమో, నీటికి అక్కరకువచ్చే కమండలమో, నడుముకు కట్టుకునే ముంజీ బంధమో, చేతిలోపట్టుకునే దండమో-ఇలాటి వస్తువులయితే నాకు అక్కరకు వస్తాయి. కానీ, బ్రహ్మచారిని నేనెక్కడా? భూములూ, ఏనుగులూ, గుర్రాలూ, సుందరాంగనలూ ఎక్కడా? నాకొద్దు ప్రభూ, నేను కోరేదల్లా నా కోరికకు సరిపడగా మూడడుగులు మాత్రపు నేల; ఆమాత్రం దారి కోసం ఇస్తే చాలు. అదే బ్రహ్మాండంగా భావిస్తాను అన్నాడు.

పుట్టినేర్చెనో పుట్టక నేర్చెనో పొట్టివడుగు ఈపుట్టెడు బుద్ధులంటూ వాటనూ, శ్రోతలనూ ముక్కుమీద వ్రేలేసుకునేటట్లు చేస్తూ, కన్నుండగనే కంటిపాపను తీసేంతటి వాక చక్యాన్ని ప్రదర్శించిన వామనమూర్తి మాటచమత్కారాన్ని ప్రదర్శించిన పద్యం ఇది.

నిజానికి వామనుడు అగ్నిశిఖవంటి బ్రహ్మచారి. ఆ బ్రహ్మచారికి అవసరాలే లేవు. ఒకవేళ ఉన్నా అది అతి సామాన్యమైన గొడుగూ, యజ్ఞోపవీతం, కమండలమూ, ముంజత్రాడో ఐ ఉంటుంది. అంతేకానీ, మహాభోగులైన వారికి ఉపకరించే

భూ. కరి, హరి, వామాక్షులతో పనేలేదు. దాత అధికారానికీ, ఔదార్యానికీ తగినట్లుగా దేనైనాసరే ఇస్తానన్నాడు కానీ పరిగ్రహించేవాడు ఇచ్చిన వస్తువులను అంగడిలో పెట్టి మారుబేరం చేస్తూ డబ్బు గడించేవాడు కాడు. అందుకే తనకు ఉపయోగం లేని అమూల్యవస్తువైనాసరే కాదన్నాడు. తన కోరిక మేరకు తనకు కావలసింది మూడు అడుగుల త్రోవ. అంతమేర దొరికితే చాలు, అది బ్రహ్మాండమే తనపాలికి. వినేవారు ఈ మాటను లక్షణార్థంగా గ్రహించినారు. నిజానికిది యథార్థపు మాటయే. ఈ మూడడుగుల వల్లనే వామనుడు త్రివిక్రముడై భూమ్యాకాశ పాతాళాలనూ ఆక్రమించినాడు. నిజానికి బలిచక్రవర్తి దానంగా బ్రహ్మాండాన్నే ధారపోసి నట్లైంది కదా!

శా. కారే రాజులు రాజ్యముల్ గలుగవే
గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరిమూట గట్టుకొని
పోవం జాలిరే భూమిపైఁ
బేరైనం గలదే శిబి ప్రముఖులుం
బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్
మఱచిరే యిక్కాలమున్ భార్గవా.

వామనుడు ఎంతో చాతుర్యంతో బలిని మూడడుగుల దానమంటూ మూలముట్టుగా దోచుకోదలచిన తీరును పసిగట్టిన శుక్రాచార్యుడు బలిచక్రవర్తి శ్రేయస్సును కోరుతూ, ఓత్యాగమూర్తీ!

ఈ వచ్చిన వాడు ఎవడో కాడూ విశ్వంభరుడు, దానం గీనం అంటూ పోయి నాశనం కాకూ. నిన్నూ, నీకులాన్నీ, రాజ్యాన్నీ కాపాడుకో! నామాట వినూ అంటూ బుద్ధిచెప్పినప్పుడా మాటలకు బలిచక్రవర్తి తానేమైనాసరే! ఆడినమాటకు తిరుగులేదంటూ సమాధానం ఇచ్చినప్పటి పద్యం ఇది.

ఓ ఆచార్యా! ఎందరు రాజులు కాలేదూ, ఎన్ని రాజ్యాలు వృద్ధి పొందలేదూ, ఎంత గర్వాతిరేకాన్ని పొందలేదూ, వారంతా ఇప్పుడెక్కడున్నారూ? సంపాదించిన ధనరాశిని మూటగట్టుకుని వెంబడి తీసుకొని పోగలిగిరా? ఈ భూమ్మీద వారిపేరన్నా విన బడుతుందా? శిబిచక్రవర్తిమొదలైన రాజశ్రేష్ఠులు ఎంతో ప్రేమతో కోరినవారికోర్కెలు తీర్చలేదా? వారు గతించి ఎంతో కాలం ఐందికదా! ఈ నాటికీ వారిని మరిచిన వారున్నారా? అంటూ అడిగినాడు.

విశ్వంభరుని విశ్వవ్యాపకత్వాన్ని ఎరిగిన దానవగురువు నీతినిపాటిస్తూ నిన్నూ, నీకులాన్నీ, నీరాజ్యాన్నీకాపాడుకొమ్మంటూ సలహా చెప్పినాడు. అందుకు సమాధానంగా దానవ శ్రేష్ఠుడైన బలి 'ఓ ఆచార్యా! మీరు రాజ్యం, కులం అంటూ అంటున్నారు, ఇందులో ఏదిశాశ్వతం? ఎన్నిరాజ్యాలు రాలేదూ, ఎన్నిపోలేదూ? గర్వంతో కన్నూమిన్నూ కానక తిరిగిన రాజులంతా ఈనాడు ఎక్కడున్నారు? డేగబారినుండి తన్నాశ్రయించిన పావురాయిని కాపాడేందుకు ఆత్మార్పణం చేసిన శిబివంటి మహానుభావులు కీర్తి శరీరంతో ఈనాటికీ స్థిరులై జీవిస్తున్నారుకదా?' అన్నాడు. ఈ మాటల్లో అస్థిరాలైన రాజ్యమూ, రాజవైభవమూ, నశ్వరమైన

శరీరంకన్నాకూడా స్థిరమైంది ఇచ్చినమాట తప్పక పోవడం. అదే నిత్యమైందీ అంటూ రూఢిపరిచినాడు పోతన.

మరచిపోని పోతన భాగవతపు పద్యాలల్లో ఇదొకటి.

శా. ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపైఁ
నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ
బాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందుకరంబు గ్రిందగుట
మీఁదై నా కరంబుంట మే
ల్గాదే రాజ్యము గీజ్యమున్
సతతమే కాయంబు నాపాయమే.

మూడడుగుల నేలను తాను దానం ఇచ్చింది కేవలం ఉత్త పొట్టివడుగుకు కాదూ శ్రీహరికే అంటూ తెలిసిన బలిచక్రవర్తి తనభాగ్యానికి మరింత ఆనందిస్తూ అంతకన్నా కావలసింది తన కింకేమీలేదంటూ ప్రకటించిన సందర్భంలోది ఈపద్యం.

తొలుత లక్ష్మీదేవి కొప్పుపైనా, తరువాత శరీరంపైనా, ఆ తల్లిఎదపై ఉన్నసన్నని ఉత్తరీయంపైనా, తామరలవంటి పాదాల పైనా, చెక్కిళ్ళపైనా, పాలిండ్లపైనా కొత్తరీతితో సింగారాలొలికే ఆ మహావిష్ణువు చేయి క్రిందై మీదైన నా చేతిది భాగ్యం కాదా? రాజ్యమూ గీజ్యమూ శాశ్వతమా? ఈ శరీరం మాత్రం ఏ ఆపాయమూ పొందకుండా కలకాలం స్థిరంగా ఉంటుందా? అంటూ శుక్రాచార్యుల వారికి సమాధానం చెప్పినాడు. ఈ పద్యం

శృంగార రసాత్మకమై వినేవారి చెవులకు విందును చేస్తుంది, ఎంత శృంగారాన్ని రంగరించినా ఏ మాత్రం భక్తిగౌరవాలకు వెలితిని కలిగించక భావనకు సొగసును చేకూర్చిన పద్యం ఇది. ఈ పద్యంలో మొదటి రెండు చరణాలల్లో శృంగార నాయకుడు కేళీ వినోదంలో తగిలి అనుకూలవతి ఐన నాయికను తరతరాలుగా కరగిస్తూ స్వాధీనం చేసుకుని రక్షించే విధానం చిత్రింపబడి ఉంది. తరువాతి రెండు చరణాలల్లో విరక్తి ధ్వనిస్తుంది. ఈ వైరాగ్య భావన పై శృంగార రసాన్ని పరిపుష్టం పొందనీయక భక్తి వైపు మరలిస్తుంది. ఈ పై రెండు పాదాలు శ్రీ హరిచేతికి ఉన్న మహిమాధిక్యాన్ని ప్రకటించడానికి మాత్రమే ఉపయోగిస్తున్నాయి. అందరికీ ఆరాధ్యఐ అన్ని ఇండ్లను వెలిగించే శ్రీదేవి ప్రతి అంగాన్నీ రసలోలుప బుద్ధితో తాకి క్రొత్త సొగసులు సంతరించుకున్నంత చేయి ఈ సందర్భంలో దానాన్ని చేపట్టడంతో క్రిందుచేయబడింది, ఇచ్చేదాతగా, యాచకుడై చాచినచేతిపైన బలిచక్రవర్తి చేయి మీదున్నది. అంతటి ఆదిమహావిష్ణువు చేతిని క్రిందు చేయగలిగిన సౌభాగ్యం కన్నా, అశాశ్వతాలైన రాజ్య సంపదలూ, ఈ శరీరమూ భిన్నం కాదుకదా! అందుకే ఇంతటి ఉదాత్తుడైన బలిని నిగ్రహించి నప్పటికీ శ్రీహరికి ఆతని వాకిట కావలి ఉండక తప్పిందికాదు.

శా. ఇంతింతై వటుఁడింతయై మఱియుఁ
దానింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున
కల్లంతై ప్రభారాశిపై

నంతై చంద్రుని కంతయై
ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు
బ్రహ్మాండాంత సంవర్ధియై.

ఎందరు వలదన్నా, కాదన్నా వినక బలిచక్రవర్తి మూడడుగుల మాటతో ముల్లోకాలనూ ఆక్రమింప గలిగిన వామన మూర్తికి సర్వదానవ సామ్రాజ్య లక్ష్మినంతటినీ ధారవోసినాడు. ఆ వెంటనే వామనమూర్తి విశ్వరూపాన్ని ధరిస్తూ తరతరాలుగా పెరగడం ప్రారంభించినాడు. ఆ పెరుగుదలను కండ్లకుకట్టి నట్లుగా వర్ణించిన పద్యం ఇది.

ఇంతంత పెరుగుతూ పొట్టి వడుగు కొంచెం పెరిగినాడు, ఆ మీద కొంత సేపటికి మరింత పెరిగినాడు. మరికొంత సేపటికి ఆకాశమార్గంపై ఎదిగి కానవచ్చినాడు. తరువాత ఆకాశంలో మేఘమండలానికి కొంతదూరంలో ఉన్నాడు. ఆ తరువాత కాంతి వలయాన్ని దాటీ, చంద్రకక్ష్యను దాటీ, ధ్రువ నక్షత్ర మండలాన్ని అతిక్రమించీ, మహర్వాటినికూడా అధిగమిస్తూ సత్యలోకంతో సమానుడౌతూ, చివరకు బ్రహ్మాండం యొక్క అంతం వరకూ పెరిగినాడు— అంటూ వర్ణించినాడు.

ఈ సందర్భంలో వామనుడు పెరుగుతున్నట్లుగానే ఉపయోగించిన పద్యాలన్నీ చెంగు చెంగున దుముకులు వారుతూ మనకు ఆనందాన్నీ ఆశ్చర్యాన్నీ కలిగిస్తున్నాయి. 'ఇంతింతై, తానింతై, అంతై, అల్లంతై, పై అంతై' అనేపదాలు క్రమక్రమమైన అభివృద్ధి

ప్రమాణాన్ని చిత్రగతిలో చూపడానికి ఎంతో చిగుప్పైనవి ఇంతింతై. తొలుత పెరుగుదల మెల్లమెల్లగా ప్రారంభమైంది. ఒక్కసారి పెరగటం ప్రారంభించిన తరువాత శిఖరస్థానాలను అందుకోవడం క్షణ క్షణాలల్లో జరిగి పోయింది. అందుకే ఆ భావాన్ని ఇంతై, అంతై అనేపదాలతో పోతన ఎంతో సమర్థవంతంగా సూచించి నాడు. భూమి పైభాగంలో మొదట ఆకాశవీథి, దానిపైన మేఘ మండలం, ఆపైన కాంతిమండలం, అదే నక్షత్ర మండలం. ఆపైన ధ్రువమండలం, ఆపై మహర్వాటీ మండలం. అన్నిటి కన్నాపైన ఉండేది సత్యలోకం, అదేగోలోకం, ఏ ప్రాణీ గమించ లేని విష్ణు స్థానం. మానవులకు అగోచరమైన త్రివిక్రముని మూడవ పాదక్రమం అంటూ పెద్దలు చెబుతారు. ఈ ఖగోళ రహస్యాలనుఎరిగిన పోతన ఈపద్యంలో పొందుపరచి చూపినాడు

మ. రవిబింబంబుపమింపఁ

బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతమై గళాభరణమై
సౌవర్ణ కేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి
నుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు
దా బ్రహ్మాండమున్నిండుచోన్.

ముచ్చపైన మూడడుగుల దానంతో వామనుడు విజృం భించడం మొదలు పెట్టినాడు. ఎదుగుతూ ఎదుగుతూ సూర్య

మండలం వరకు ఎదిగినాడు. ఇక ఆ తరువాతి పెరుగుదలను ఒక జాలాన్ని ప్రదర్శించినట్లుగా పోతన ఈ పద్యంలో చూపినాడు.

బ్రహ్మాండాన్ని నిండుతూ విక్రమిస్తున్న వామనమూర్తికి మనం ఉపమానంగా చెప్పదలచుకుంటే సూర్యబింబాన్ని తగిన గొడుగుగా మారించి అని చెప్పవచ్చు. ఆ తరువాత ఆయన తల ధరించే రత్నంగా ప్రకాశించింది. మరికొంత సేపటికి చెవికి పెట్టుకునే ఆభరణ విశేషమైన కుండలంగా మారింది. ఇంకా కొంత సేపటికి కంఠాభరణమై పోయింది. చూస్తుండంగనే ఆ సూర్యబింబము దండచేతికి పెట్టుకునే దండపట్టిగా, ముంజేతి కడియంగా, మొలను కట్టే పట్టుబట్టగా, కాలి కడియంగా, చివరకు పాదపీఠంగా మారిపోయింది అంటూ చెప్పినాడు.

ఈ పద్యములో పోతన త్రివిక్రమ స్ఫూర్తికి తగిన అలంకార విశేషాలన్నీ ఒక్కొక్కటే తప్పక చెప్పినాడు. సూర్య బింబం ఒక్కటే వామనమూర్తి ఆయా అంగాలను ఆశ్రయిస్తూ ఆయా ఆభరణ విశేషాలుగా పరిణమించింది. తొలుత వామనుడు సూర్యబింబంకన్న కొంత క్రిందికి ఉన్నాడు. అప్పుడా బింబం వామనునికి విడలేని అలంకారమైన గొడుగైంది. తరువాత ఆ సూర్యుడు మరి కొంత దగ్గర పడగా శిరోలంకారము ఐనాడు. విష్ణువు పైకి విక్రమిస్తూ ఉంటే రవిబింబం తరతరాలుగా కిందికి దిగుతూ ఉన్నట్లు గోచరింప చేస్తుంది కాని ఇక్కడ రవిబింబం మాత్రం ఉన్నతావునే ఉంది. ఎదుగుతున్నవాడే వామనుడు. సూర్యుడు తేజోమూర్తి. అంతేకాదు, ఈ ప్రకాశమే వామనమూర్తి అంగాలల్లో అలంకారాదులుగా భాసించింది. త్రివిక్రమునికీ

సూర్యునికీ అవినాభావ సంబంధం ఉంది. జ్ఞానచక్షుహ్హా, సర్వ వ్యాపి ఐన వానకు త్రివిక్రముడు అందరికీ చీకట్లను తొలగిస్తు వెలుతురును ఇచ్చే సూర్యుని తోడి సంబంధానికి పోతన సహజాలంకార సంశ్లిష్టమైన అతిశయోక్తిని అమృతరసంతో మేళవిస్తూ రసానందాన్ని పంచినాడీ పద్యంలో. ఇందులో అప్రధానంగా ఉల్లేఖంకూడా భాసించక పోలేదు.

క. ఉదరము లోకంబులకును
సదనంబగుటెఱిఁగి శివుఁడు చటుల విషాగ్నిన్
గుదురుకొనఁ గంఠబిలమున
బదిలంబుగ నిలిపె సూక్ష్మ ఫలరసము క్రియన్.

దేవదానవులు సముద్రాన్ని మథించినప్పుడు సర్వలోకాలకూ మహాభయాన్ని కలిగిస్తూ భయంకరమై కణకణలాడే నిప్పువంటివిషం పుట్టింది. అందరి మేలును కోరే సమర్థుడైన పరమశివుడు ఆ విషాన్ని చేతబట్టి తనగొంతులోనే ఆపినాడు. ఆ శంకరుడా విషాన్ని ఎట్లా, ఎందుకు నిలిపినాడో చెప్పే సందర్భంలో ఉన్నదీ పద్యం.

తన కడుపు లోకాలకు నివాస స్థానం అంటూ తెలుసుకున్న శివుడు చటులమైన ఆ విషాగ్నినీ స్థిరపడేటట్లు తనకుత్తుకతొఱ్ఱలో భద్రంగా, సూక్ష్మమైన ఫలరసాన్ని నిలిపినట్లుగా నిలిపినాడు—అంటూ చెప్పినాడు.

విశ్వగర్భుడు పరమేశ్వరుడు. అందుకే లోకాలన్నీ తన కడుపులో ఉన్న విషయం తెలిసిన సర్వజ్ఞుడు ఆయన. పుట్టిన విష

షమైనా మహాభయంకరంగా వ్యాపిస్తుంది. ఆ విషం అట్లా బయట ఉండటానికి వీలులేదు అప్పుడాయన చేయవలసింది దాన్ని మ్రింగివేయడమే. అట్లా ఆ విషాగ్నిని అవలీలగా మ్రింగి వేయగలడు, కానీ, ఇక్కడో చిక్కుంది. బయటివిషాన్ని మ్రింగి కడుపులోకి పంపితే ఆ కడుపులో ఉన్న లోకాలన్నీ దహించుకు పోతాయి. అందుకే పరమకారుణ్యమూర్తిఐన ఆ శివుడు ఏ జీవికీ బాధకలుగకుండా ఆ విషాన్ని తన కంఠనాళంలో పదిలంగా కుదురు పడచేసినాడు శివుడు ఈ హాలాహలాన్ని ముద్దగాచేస్తూ ఎంత అవలీలగా తనకంఠంలో పొందు పర్చినాడంటే అల్లనేరేడు పండురసాన్ని గొంతులోదాచినంతసుళువుగా మింగి కంఠదేశంలో నిలుప గలిగినాడంటూ పోతన శివుని శక్తిని చెప్పకే చెప్పినాడు. సూక్ష్మఫలం అంటే ఏదో చిన్నపండు అనేదానికన్నా నేరేడు పండు అనేఅర్థాన్ని గ్రహిస్తేనే స్వారస్యం చెడకుండా ఉంటుం దని ఈ అర్థాన్నే గ్రహించడం జరిగింది.

క. మ్రింగెడివాఁడు విభుండని,
మ్రింగెడిదియు గరళ మనియు మేలని ప్రజకున్
మ్రింగుమనె సర్వమంగళ
మంగళ సూత్రంబునెంత మది నమ్మినదో!

శివుడు హాలాహలాన్ని భక్షించేప్పుడు, దానికి పార్వతి అనుమతించినట్లుగా భావిస్తూ ఆమె పాతివ్రత్యాన్ని ప్రశంసిస్తూ చెప్పిన పద్యం ఇది.

విషాన్ని మ్రింగేవాడు తన భర్త అనీ, మ్రింగేది ప్రాణా లకే ఎసరుపెట్టే విషమనీ తెలిసే సర్వమంగళఐన పార్వతీదేవి

ఆ పని ప్రజలకు మేలుచేస్తుందని సరే ప్రమింగులే అన్నది. ఆ సర్వమంగళ తన మంగళసూత్రాన్ని ఎంతనమ్మిందో కదా! అంటూ పోతన ఆశ్చర్యాన్ని ప్రకటించినాడు.

లోకంలో సాధారణంగా ఒక సాహసకృత్యాన్ని చేయుమంటూ ఇతర్లను ఎంతైనా పురికొల్పవచ్చు. కానీ అది తనకూ తనవారి వంతుకూ వచ్చేవరకు వెనకా ముందాడడం సహజం. కానీ పార్వతి మాత్రం అట్లా కాకుండా ప్రవర్తించింది. మింగేదేమో ప్రాణాలుతీసే విషం అనీ తెలుసు. మింగేవాడు తన ముత్తైదువతనానికి ప్రాపైన భర్త అనీ తెలుసు, పైగా ఆ విషాన్నిమింగితే తనకు లాభించేది రవ్వంతైనా లేదనీ తెలుసు. ఐనప్పటికీ ఆమె తన భర్తను ఆ విషాన్ని మింగుమన్నది. మరి ఆతల్లికి తన మంగళసూత్రం మీద ఎంత నమ్మకం ఉందో అంటూ ప్రశంసించినాడు.

పూర్వకాలంలో మంగళసూత్రాన్ని పరమ పునీతంగా భావించేవారు. భర్త గండం గడిచి బయటపడితే ఆ ఇల్లాలి మంగళసూత్రబలమే ఆయన్ను కాపాడింది అనేవారు. ఇక్కడ మంగళసూత్రం అంటే ఆ ముత్తైదువ పాతివ్రత్య ప్రభావం అంటూ మనం గ్రహించవలసి ఉంటుంది.

ఇక్కడ పోతన పార్వతిని 'సర్వమంగళ' అనే పదంతో సూచిస్తూ ఔచిత్యాన్ని పోషించినాడు. ఆమె రూపుదాల్చిన శుభం. సకలశుభాలకూ ఆకరం. అందుకే ఆమె సర్వజగాలకు మేలును కోరుతూ తన మంగళసూత్రాన్ని గట్టిగా నమ్మి తన భర్తకు ఏముప్పూరాదంటూ దృఢనిశ్చయంతో సకల జనసుఖకారక

మైనపని చేయడానికి అంగీకరించింది. సర్వమంగళ సరే అన్నచోట అశుభం జరగడానికి వీలులేదని పోతన హృదయం.

ఆ. హరుఁడు గళమునందు హాలాహలము వెట్టఁ
గప్పు గలిగి తొడవు కరణి నొప్పె
సాధురక్షణంబు సజ్జనులకు నెన్న
భూషణంబుగాదె భూవరేంద్ర.

దేవదానవులు వాసుకిని తరిత్రాడుగా చేసి మందరపర్వతాన్ని కవ్వంగా చేసి పాలసముద్రాన్ని చిలికినప్పుడు, ఆ సంద్రంలోంచి మహాభయంకరమైన విషం పుట్టింది. బ్రహ్మాదుల ప్రార్థనను మన్నిస్తూ శివుడు విషాన్ని మింగి కంఠంలో ఆపినప్పుడా స్థితిని వర్ణిస్తూ చెప్పిన పద్యం ఇది.

ఓ రాజశ్రేష్ఠుడా! శంకరుడు గొంతులో హాలాహలం అనే విషాన్ని నిలుపగా ఆ విషం నల్లనిదైన కారణంతో ఆయన కుత్తుకకు ఒక ఆభరణంగా మారి ప్రకాశించింది. అవును మరి, సాధుజనులరక్షణం సత్పురుషులకు ఒక ఆభరణమే కదా! అన్నాడు.

శివుడు పాలనురుగువంటి తెల్లని శరీరకాంతి కలవాడు. అంతటి సుధాధవళమూర్తి నల్లటిపొగలూ సెగలు చిమ్ముతూ లోకభయంకరంగా విజృంభిస్తున్న విషాన్ని ఆహారిస్తూ తన గొంతులో నిలిపినాడు. ఆ నల్లటి విషం స్వామి కుత్తుకకు తన నలుపును పులుముతూ ఒక ఆభరణవిశేషంగా, అలంకార ప్రాయంగా అందగించింది. ఈ విశేషణాన్ని పోతన సాధురక్షణం ఎప్పుడూ

సజ్జనులకునెన్న భూషణంబుగాదే, అనే సామాన్యోక్తి సమర్థిస్తూ అర్థాంతరన్యాస అలంకారాన్ని చొప్పించినాడు.

మనం బాగా ఆలోచించిచూస్తే పోతన చెప్పిన ఈ మాట పొల్లుపోని నిజంకదా! భాగవతాన్ని చదివే సహృదయుడు విడువక చదివే పద్యాలల్లో ఇదొకటి.

మ. అమరన్ లోకహితార్థ మంచునభవుం
డౌఁగాక యంచాడెఁబో
యమరుల్ భీతిని మ్రింగుమీయనిరి వో
యంభోజగర్భాదులుం
దముఁగావన్ హర! లెమ్ము లెమ్మనిరివో
తాఁజూచి కన్గంట న
య్యుమ ప్రాణేశ్వరు నెట్లు మ్రింగు మనె న
య్యుగ్రానల జ్వాలలన్.

సకలప్రాణి భయంకరంగా మహావిషం ఉద్భవించినప్పుడు ఆ విషాన్ని మ్రింగడానికి చూస్తూ చూస్తూ పార్వతీదేవి భర్తను ఎట్లా కోరిందో? ఎట్లా అనుమతించిందో?- అంటూ ఆశ్చర్య పడుతూ వ్రాసిన పద్యం ఇది.

పొందుగా తానుచేసే ఈ పని లోకహితంకోసం అంటూ శివుడు 'సరే' అంటూ పలికితే పలికి ఉండవచ్చు. దేవత లందరూ భయంతో అయ్యా! తామూ మ్రింగండీ! అని అంటే అని ఉండవచ్చులే! బ్రహ్మ మొదలైనవారు తమను రక్షించే

కొరకు ఓ కూర, లే, లెమ్మంటే అన్నారుపో, కానీ పార్వతీదేవి తన కంటి ఎదురుగా మహాఘోరమైన ఆ విషాన్ని చూస్తూ తన ప్రాణేశ్వరుడైన శివుణ్ణి ఆ హాలాహలాన్ని మ్రింగుమంటూ ఎట్లా అని ఉండవచ్చు అంటూ ఆశ్చర్యాన్ని వెలిబుచ్చినాడు కవి.

భయంతో దేవతలూ, ఆత్మ రక్షణార్థం బ్రహ్మాదులూ, శివుణ్ణి విషాన్ని మ్రింగడానికి ప్రోత్సహిస్తే ప్రోత్సహించి ఉండవచ్చు. లోకకల్యాణాన్ని కాంక్షించీ ఆ శివుడు ఆ విషాన్ని మ్రింగడానికి అంగీకరిస్తూ సరే అట్లే అని ఉండవచ్చు. ఇందులో ఆశ్చర్యం లేదు. కానీ ప్రాణాధికప్రియుడూ ఐన తన భర్తనే చూస్తూ చూస్తూ పార్వతి మ్రింగుమనడంలోనే విశేషంఉంది. ఈ భావాన్నే మంచి తెలుగు జాతీయాలను పొదిగిస్తూ పోతన ఈ పద్యంలో వ్యక్తంచేసినాడు. నోనోట, కన్గంట, చేజేత అనే జాతీయాలు తెలుగువారికి కొత్తలుకావు. పోతన ఇటువంటి జాతీయప్రయోగం చేస్తూ తెలుగువారికి మరింత దగ్గరివాడైనాడు.

సీ. వేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు
నబలలతోడ వియ్యంబులందు
గుజ్జెన గూళ్ళను గొమరొప్ప వండించి
చెలులకుఁ బెట్టించుఁజెలువు మెఱయ
రమణీయ మందిరారామ దేశంబులఁ
బువ్వుఁ దీఁగెలకును బ్రోదిసేయు
సదమల మణిమయ సౌధ భాగంబుల
లీలతో భర్మడోలికల నూఁగు

తే. బాలికలతోడఁ జెలరేఁగి బంతులాడు
శారికా కీర పంక్తికిఁ జదువు చెప్పు
బర్హి సంఘములకు మురిపములు గఱపు
మదమరాళంబులకుఁ జూపు మందగతులు.

శ్రీ రుక్మిణీదేవి కుండిన పురాధీశ్వరుడైన భీష్మకునికి పుట్టి దినదిన ప్రవర్థమానఐ తనతోటి బాలికలతో ఆడుకున్న విధానాన్ని వర్ణిస్తూ చెప్పిన పద్యం ఇది.

రుక్మిణీదేవి వేరు వేరుగా బొమ్మలకు పెండ్లిళ్లు చేస్తూ తన తోటి బాలికలతో వియ్యాలు అందుకునేది. గురుగుల్లో వంట కాలను వండిస్తూ ఎంతో ఇంపుగా తన స్నేహితులకు పెట్టించేది. మనోహరమైన మంచెరాల్లో ఉన్న ఉద్యానవనాలల్లో పూలతీగెలకు పాదులు చేయిస్తూ, నీళ్లుపోస్తూ, పందిళ్లకు పారిస్తూ పోషించేది. పరిశుభ్రమైన మణులు తాపిన మేడలల్లో వేడుకతో బంగారుటు య్యాలలు ఊగేది. తోటి ఆడపిల్లలతో ఎంతో ఉత్సాహంతో బంతులాడుకునేది. గోరువంకలకూ, చిలుకలకూ చదువులు చెప్పేది. నెమిళ్లకు మురిపాలు నేర్పేది. మదించిన హంసలకు నడకలు నేర్పేది— అంటూ వర్ణించినాడు.

ఈ పద్యంలో పోతన నిరుపేద ఇంటి ఆడపిల్ల మొదలు ఎండ కన్నెరుగని రాచకన్నియ వరకూ యుక్త వయస్సు రాక పూర్వం ఆడుకునే ఆటలను పేర్కొన్నాడు. కొంతకాలానికి పూర్వం ప్రతి ఇంట్లో ఆడపిల్లలు బొమ్మరిల్లు వేసుకుని బొమ్మ లాటలు ఆడుకునేవారు. వాటికి పెండ్లిళ్లు చేస్తూ వియ్యాలందు

కుంటూ సగం కయ్యాలు పెట్టుకోవటమూ వాటిని పరిష్కరించు కోవటమూ నేర్చుకునే వారు. అల్లే గుజ్జెన గూళ్ల వండటంకూడా పనికి పనీ వేడుకకూ వేడుకగా ఉండేది. మన పూర్వులు పనిలో ఆటనూ, ఆటలో పనితనపు తీర్పునూ జోడించే ఉంచినారు అనడానికి గురుగుల్లో వంటకాలే నిదర్శనం అని చెప్పవచ్చు.

రాచకన్నెలకు పూలతోటలో విలాసంగా పూతీగెలను పెంచడమూ, బంగారుటుయ్యాలలూగడమూ, నెమళ్లకు నాట్యాలు నేర్పడమూ, చిలుకలకు చదువులు చెప్పడమూ, హంసలకు నడకలు నేర్పడమూ సాధ్యపడేవి. అన్నిటికన్నా విశేషంగా ఆడపిల్లలు బంతులాడటం గమనించ తగింది. ఈ విధంగా ఈ పద్యంలో పోతన రుక్మిణీదేవి వ్యపదేశంతో ఆనాటి రాచకన్నెల క్రీడా విశేషాలను ప్రకటించినాడు.

ఉ. శ్రీయుత మూర్తి! యో పురుష
సింహమ! సింహము పాలి సొమ్ము గో
మాయువు గోరు చందమున
మత్తుఁడు చైద్యుఁడు నీ పదాంబుజ
ధ్యాయిని ఐన నన్ను వడిఁ
దాఁగొని పోయెదనంచు నున్నవాఁ
డా యధమాధముం డెఱుగఁ
డద్భుతమైన భవత్ప్రతాపమున్.

రుక్మి తన చెల్లెలైన రుక్మిణీదేవిని శ్రీకృష్ణునికి ఇచ్చేందుకు ఇష్టపడక శిశుపాలునికి ఇస్తానంటూ మాట ఇచ్చి వివాహాన్ని

విశ్చయించినాడు. వార్తను అందుకున్న శిశుపాలుడు ఇతర రాజ బంధు వర్గంతో కూడా వచ్చిచేరినాడు. కాని రుక్మిణీదేవి ఇంత వరకు తనను శ్రీకృష్ణునికి మానసికంగా అర్పణ చేసుకొంది. తాను అతని సొమ్ము. ఆ హరి సొమ్మును ఇతరులు తాకకూడదు. అందుకే ఆమె ధైర్యంతో శ్రీకృష్ణునికి సందేశం పంపింది. ఆ సందేశంలో వ్యక్తం చేసిన భావం ఈ పద్యం.

లక్ష్మీవంతమైన ఓ శుభమూర్తీ! ఓ పురుష శ్రేష్ఠుడా! సింహము పాలి సొత్తును నక్క ఆశిస్తున్నట్లుగా మత్తుడైన శిశుపాలుడు నీ పాదపద్మాలను ఆశ్రయించి ధ్యానిస్తున్న నన్ను వెంటనే కొని పోతానంటున్నాడు. ఆశ్చర్యకరమైన నీ శౌర్యాన్ని నీచాతి నీచుడైన ఆ శిశుపాలుడు ఎరుగడు సుమా! అంటూ సందేశాన్ని పంపింది.

ఈ పద్యంలో రుక్మిణీదేవి శ్రీకృష్ణుణ్ణి సంబోధించిన తీరు లోనే విశేషం ఉంది. శ్రీకృష్ణుడు శ్రీయుతమైన మూర్తి కలవాడు, అంటే శుభకరమైన ఆకారం కలవాడనీ సామాన్యార్థం, అన పాయిని ఐన శ్రీదేవితో కూడినట్టి మంగళమూర్తి ఐన విష్ణువు అని విశేషార్థం. అట్లే ఆయన పురుషసింహుడు అంటే వీరులల్లో గణనీయుడనీ, విష్ణుపరంగా పురుషోత్తముడైన ప్రధానుడు అనే అర్థం కూడా పొసగుతుంది.

సాధారణంగా మృగరాజైన సింహపు సొత్తును మరే ఇతర సత్వమూ తాకదు. ఆ సందర్భంలో అల్పాతి అల్ప సత్వం అయిన ఓ నక్క సింహము పాలిటి ఆ సొమ్మును ఆశించడం అతి విచిత్రం. అట్లే అప్పుడు ఎంతో అధముడైన శిశుపాలుడు

రుక్మిణీ దేవిని వెంటనే దక్కించుకోవాలంటున్నాడు. అదే నక్క పని. అయితే శిశుపాలుడు పురుషుడేకదా! అవివాహిత అయిన కన్యను కోరడంలో తప్పేం ఉంది — అంటూ అనడానికి తావు లేకుండా రుక్మిణీదేవి తనను "శ్రీకృష్ణ పదాంబుజ ధ్యాయిని"గా ప్రకటిస్తూ ఆయన ఎడల తన ప్రగాఢమైన భక్తి విశ్వాసాలను వ్యక్త పరిచింది. అంతే కాదు. తనను అప్పుడే ఆ పురుష సింహాని సొత్తుగా నిర్ణయించుకొంది. అందుకే ఎంత అధముడు కాకపోతే హరికి అంకితమైన తనను కాంక్షిస్తాడు- అనే విషయాన్నే కాకుండా పరులసొమ్మును కోరడం మహాపాపం అంటూ ధ్వనింప చేసింది.

పురుషసింహమైన హరిముందు సాధారణులైన వీరపురుషులందరు నక్కలవంటి వారే కదా! మరొక విశేషం, అల్పశక్తి కలిగిన నక్క ఎట్లా హరిసొమ్ము ఆశించ గలిగిందీ అంటే అది మత్తతవల్ల, అదే అజ్ఞత, అదే అహంకారంవల్ల ఏర్పడిన కన్ను గానని తనం. మత్తుడైనవాడు బొగాములను, అంటే మంచీ చెడ్డలను, ఆలోచించ లేడు అందుకే విజ్ఞుడైన పోతన చైద్యుడు అనే పదానికి విశేషణంగా మత్తుడు అనే పదాన్ని ఉంచుతూ ఇంతటి అర్థాన్ని సాధించినాడు. ఈ పద్యంలో ఇంకొక చమత్కారం ఉంది. రుక్మిణీదేవి సందేశం వీరపురుషునికి పురెక్కిస్తున్నట్లుగా ఉంది. లే, కృష్ణ పరాక్రమించు! నీ సొమ్మైన నన్ను కోరుతున్న నక్కవంటి ఆ శిశుపాలుణ్ణి దండించి నన్ను కొనిరా! నీ ముందు వాడొక లెక్క! నీ ప్రతాపం చూపుదువుగాని రా! అంటూ ఆహ్వానించినట్లు పిలిచింది. ఇది లౌకిక దృష్టి.

శివ పార్వతులవలె లక్ష్మీనారాయణులూ అనాదిదంపతులు. ఆసంస్కారమువల్లనే రుక్మిణీ సందేశంలో ఆమె ప్రకటితం చేయ గలిగింది. శ్రీకృష్ణుని శ్రీయుతమూర్తి అంటూ పిలిచి శ్రీకృష్ణుడే ఆది నారాయణుడు అనే విషయాన్ని స్థిరపరిచింది. పోతన ఈమెను నవవిధాలయిన భక్తులకు కూడలిపట్టుగా కూడా వర్ణించినాడు.

ఉ. నమ్మితి నా మనంబున
సనాతను లైన యుమామహేశులన్
మిమ్ముఁ బురాణదంపతుల
మేలు భజింతుఁ గదమ్మ! మేటిపె
ద్దమ్మ! దయాంబురాశివి
గదమ్మ! హరిం బతి సేయుమమ్మ! నిన్
నమ్మిన వారికెన్నఁటికి
నాశము లేదు గదమ్మ! యీశ్వరీ!

కృష్ణుడు వచ్చినాడన్న శుభవార్తవినీ రుక్మిణీదేవి వివాహోచితా లైన మంగళ అలంకారాలన్నీ సింగారించుకొని ముత్తైదువలు ముందు నడుస్తుండగా సనాతనియైన గౌరీ ఆలయానికి పూజకోసం వెళ్ళి అక్కడ ఆమె తనకు ఆ హరినే భర్తగా చేయుమంటూ ప్రార్థించిన విధానం ఈ పద్యంలో ఉంది.

ఓ ఈశ్వరీ! నామనస్సులో పురాతనులైన పార్వతీపరమేశ్వ లను నమ్మినాను. తల్లీ! ఆది దంపతులైన మిమ్ములను ఎప్పుడూ భజిస్తూనే ఉంటాను, మీమేలును ఎప్పుడూ కోరుతూనే ఉంటాను.

మేటి పెద్దమ్మా! నీవు దయకు సముద్రం వంటి దానవుకదా తల్లీ! అమ్మా! నాకు హరిని భర్తగా అనుగ్రహించు తల్లీ! అమ్మా! నిన్ను నమ్మిన వారెప్పుడు చెడరు కదా! తల్లీ- అంటూ ప్రార్థించింది. పోతన వ్రాసిన 'లావొక్కింతయులే'దనే పద్యం ఆపద మొక్కులకు అక్కరకు వచ్చినట్లే, కోరిన వరుడు కావాలనుకునే ప్రతీ కన్నె చిన్నదీ చదువుకునే తెలుగుపద్యం ఇది.

రుక్మిణీదేవి తొలుత గౌరీదేవిని ప్రార్థించేప్పుడు గౌరీపతిని కూడా మరచిపోకుండా ఎంతో జాగ్రత్త పడింది. అంతే కాదు సనాతనులూ, పురాణ దంపతులూ అయిన మిమ్ము అంటూ జతగానే కలిపిమ్రొక్కింది. దీనివల్ల గౌరీదేవికి తాను ఇంతకు పూర్వం తను కోరిన వరుడు లభించేందుకు ఎంత తపించవలసి వచ్చిందో ఆ విషయాన్ని ఇప్పుడు జ్ఞాపకం చేసినట్లైంది. పూర్వ స్మృతితో ఆర్ద్రత పొంది రసతరంగితమైన ఆదేవి మనస్సును తనవైపుకు తిప్పుకొంటూ అమ్మా! నీవు మేటి పెద్దమ్మవు కదా అన్నది. త్రిమూర్తులభార్యలు గొప్పఇల్లాండ్రు. వాళ్ళందరిలో గొప్పది గౌరీదేవి. ఈమె మూల దొంతివంటి మొదటి ముత్తైదువ. అందరికన్నా గొప్ప ఇల్లాలు. అందుకే ఆమె ఏమైనా చేయ గలుగుతుంది. అయితే అవసరానికి ఆదుకోనిపెద్దరికం ఎందుకూ అనే సందేహం రాకుండా "నీవు దయాంబురాశివి'' అంటూ పెత్తనానికి దయను జోడిస్తూ రుక్మిణీదేవి కోరికలను పండింపజేసుకొంది. ఇవ్వగల సమర్థత, ఇచ్చే ఆర్ద్రత ఉన్నప్పుడు అర్థుల కోరికలు అట్టే నెరవేరుతాయి. ఇది తెలిసే రుక్మిణీదేవి తాను కోరిన శ్రీహరిని తనకు పతిగా చేయుము అంటూ విన్నవించుకొంది.

అమ్మా! అనే సంబోధన ఆప్యాయతకు చిహ్నం. అంతే కాదు. అది గౌరవ వాచకం. అమ్మ ప్రేమ స్వరూపిణి. ఈమె చలువకూ, కనికరానికీ సంకేతం. అందుకే రుక్మిణీదేవి సొంత తల్లితో గోముచేసినట్లు పదే పదే అమ్మా! అమ్మ అంటూ పిలిచింది. ఈ రహస్యాన్ని ఎరిగే పోతన తన పద్యంలో అమ్మ అనే శబ్దాన్ని పునరుక్తం చేసినాడు.

సీ. మా సరివాఁడవా మా పాపఁ గొనిపోవ
  నేపాటి గలవాఁడ వేది వంశ
మెందు జన్మించితి వెక్కడఁ బెరిఁగితి
  వెయ్యది నడవడి యెవ్వఁడెఱుఁగు
మానహీనుఁడవీవు మర్యాద లెఱుఁగవు
  మాయఁగైకొనికాని మలయరావు
నిజ రూపమున శత్రు నివహంబుపైఁ బోవు
  వసుధేశుడవుగావు వావి లేదు

ఆ. కొమ్మనిమ్ము నీవు గుణరహితుండవు
విడువు విడువవేని విలయకాల
శిఖిశిఖా సమాన శిత శిలీముఖముల
గర్వమెల్లఁ గొందుఁ గలహమందు.

కృష్ణుడు గౌరిదేవి ఆలయం నుండి రుక్మిణీదేవిని అప హరించి అడ్డు వచ్చిన రాజసమూహాన్ని చెల్లాచదరుచేస్తూ ఆమెను రథం ఎక్కించుకుని పోతుండగా, రుక్మి ఎదురునిల్చి కృష్ణుని

సామాన్యుడుగా భావిస్తూ అధిక్షేపిస్తూ పలికిన సందర్భంలోని పద్యం ఇది.

ఏరా కృష్ణా! మాకు సమానుడవనా! మా పాపను తీసుకు పోతున్నావ్? మాతో పోలిస్తే ధనంకానీ, రాజసంకానీ, శౌర్యం కానీ ఏపాటి ఉంది? ఏది నీ వంశం? ఎక్కడ పుట్టిందీ? ఎక్కడ పెరిగిందీ? ఏది నీ నడవడి? ఎవ్వరికీ తెలియదే? అభిమానం లేనివాడవు. మర్యాదలు అసలే తెలియనివాడవు. మాయతో గాని చుట్టిముట్టిరావు. నీ నిజ రూపంతో ఎప్పుడన్నా శత్రువులను ఎదిరించినావా? నీవేమి రాజువా, నీ కొక్క వావీ వరుసలు అంటూ ఉన్నాయా? ఓరీ బుద్ధి తక్కువవాడా! ఆ పిల్లను ఇట్లాతెచ్చి ఇవ్వు, విడిచిపెట్టు, విడవకుంటివా! చూడు నిన్నేంచేస్తానో, ప్రళయకాల భయంకరమైన అగ్ని మంటలవంటి వాడిబాణాలతో యుద్ధంచేస్తూ నీ గర్వాన్ని హరించివేస్తాను జాగ్రత అన్నాడు.

ఈ పద్యంలో పోతన వ్యాజ నిందాలంకారాన్ని ప్రయోగిస్తూ దాని ద్వారా శ్రీకృష్ణుడు విచిత్రవర్తనుడైన సాక్షాత్తు శ్రీహరి అనే విషయాన్ని స్థాపించినాడు. నిజానికి శ్రీకృష్ణుడు ఉత్తమ క్షత్రియుడైన రుక్మికి సరి వచ్చేవాడు కాడు. ఆయన జన్మించిందొక చోటా, పెరిగింది గొల్లపల్లెలో. అందుకే కృష్ణుడు గొల్లడా! క్షత్రియుడా! ఏ వంశీయుడో చెప్పలేము. ఉత్తమ వీరుడు ఎప్పుడూ కూటయుద్ధం చేయకూడదు. అందుకే మాయలు పన్నుతావంటూ రుక్మి ఈసడించుకున్నాడు. భూపతి కాడు, కృష్ణుడు, అంతేకాదు వావి లేకుండ మేనల్లునికి భార్య కాబోయే రుక్మిణిని అపహరించినాడు ఇంత తగని పని చేయడం

పాడిగాదు, పిల్లను విడువు లేదా బాణాలతో నిప్పులు కురిపిస్తూ ప్రాణాలు తీస్తాను అంటూ రుక్మి బెదిరించినాడు.

శ్రీకృష్ణుడే శ్రీహరి. ఆయనకు ' ఒకరు సాటి పోటీ కూడానా! ఆయన పాటిని నిర్ణయించేదెవరు? హరికి కులగోత్రా లెక్కడా? ఏది వంశం, ఏది జన్మస్థానం, ఆయన అజుడూ, సర్వవ్యాపీ,సర్వాంతర్యామి. శ్రీహరి శీతోష్ణసహుడు, నిరహంకారి అంతేకాదు మాయామయుడు.ఆయన నిజరూపాన్ని ఎవ్వరూ చూడ లేదు. అనేక అవతారాలెత్తి అనేక రూపాలతో శత్రు సంహారం చేసినవాడు. కేవల వసుధేశుడు కాడు, నిఖిలేశ్వరుడు, గుణా తీతుడూ, గుణరహితుడూ, నిర్గుణుడైన పరంధామపతి అంటూ నిందాఛలంతో గుణవర్ణనం చేసిన విచిత్ర రీతి ఈవిధానం. ఇంత గహనమైన గూఢార్థం ఉన్నా పద్యం సరళంగా ఎంతో సాఫీగా నడిచింది.

మ. ధృవకీర్తిన్ హరి పెండ్లియాడె
నిజచేతో హారిణిన్ మానవై
భవగాంభీర్య విహారిణిన్
నిఖిల సంపత్కారిణిన్ సాధుబాం
ధవసత్కారిణిఁ బుణ్యచారిణి
మహాదారిద్ర్య సంహారిణిన్
సువిభూషాంబర ధారిణిన్
గుణవతీ చూడామణిన్ రుక్మిణిన్.

శ్రీకృష్ణుడు రుక్మిణీదేవిని వివాహమైన సందర్భంలో. శ్రీహరి వివాహమైన కన్య ఎటువంటి గుణవిశేషాలు కలిగినట్టిదో ఆ గుణాలను వర్ణిస్తున్న పద్యం ఇది.

స్థిరమైన కీర్తి కలదానినీ. తన మనస్సును దోచుకున్న దానినీ, అభిమానమూ, గాంభీర్యమూ కలిగి ప్రవర్తించేదానినీ, సమస్త సంపదలు ఇచ్చేదానినీ, సజ్జనులనూ, బంధుజనులనూ మర్యాదతో మన్నించే దానినీ, ఉత్తమ ఆభరణాది అలంకారాలనూ, మేలైన బట్టలనూ ధరించిన దానినీ, గుణవంతురాండ్రైన స్త్రీలల్లో తలమానికం అని చెప్పదగిన రుక్మిణీదేవిని శ్రీహరి పెండ్లి ఆడినాడు - అంటూ వర్ణించినాడు.

ప్రధానంగా వరునికి వధువు నచ్చినదై ఉండాలి, పిల్ల మానమర్యాదలతో గంభీరంగా ఉండాలి, ఇంటికి వచ్చే చుట్ట పక్కాలనూ, సాధుసన్యాసులనూ ఆదరించేదిగా ఉండాలి. ఇవి సాధారణంగా సంసారపరంగా వధువులో చూచే మంచి లక్షణాలు. కానీ రుక్మిణి రాచకన్నె. అందుకే ఆమె ఈ గుణాలకు తోడూ 'సుభూషాంబరధారిణి'గా ఉంది. ఇంత సంపత్తి ఉండీ ఆమె గర్వంతో అహంకారం చూపేదిరాదు. సత్ప్రవర్తన కలిగినట్టిది. అందుకే 'పుణ్యచారిణి' అన్నాడు పోతన.

రుక్మిణీదేవిని శ్రీమహాలక్ష్మిగా ఆలోచించినప్పుడు ఆమె ఇంతవరకే చిరకీర్తిని పొందినటు వంటిదీ, హరి మనస్సును దోచినట్టిదీ, సకల సంపదలను కలుగజేసేదీ, మహాదారిద్ర్యాన్ని తొలగించే సాక్షాత్తు హరిప్రియయైన శ్రీదేవి అంటూ స్పష్టం చేసినాడు.

ఏ విధంగా చూచినా రుక్మిణీదేవి "గుణవతీ చూడామణి" అనేది మాత్రం వివాహ సందర్భంలో అందరికీ సమ్మతమైన విషయం.

ఈ పద్యంలో అనుప్రాసాలంకారం చెవికి ఇంపైన శబ్దసుఖాన్ని అందిస్తూ ఉంది.

సీ. సమద పుష్పంధయ ఝుంకారములుగావు
భీషణ కుంభీంద్ర బృంహితములు
వాయు నిర్గత పద్మవన రేణువులుగావు
తురగరింఖాముఖోద్ధూత రజము
లాకీర్ణ జలతరంగాసారములు గావు
శత్రుధనుర్ముక్త సాయకములు
కలహంస సారస కాసారములుగావు
దనుజేంద్ర సైన్య కదంబకములు

తే. కమల కల్హార కుసుమ సంఘములుగావు
చటుల రిపుశూల ఖడ్గాది సాధనములు
కన్య! నీ వేడ రణరంగ గమన మేడ
వత్తు వేగమ నిలువుము వలదు వలదు.

శ్రీకృష్ణుడు నరకాసుర సంహారానికై బయలుదేర బోతూండగా సత్యభామ తననుకూడా యుద్ధరంగానికి వెంట తీసుకొని పోవలసిందిగా కోరింది. అప్పుడు శ్రీకృష్ణుడు ఆమెను

రావద్దని వారిస్తూ యుద్ధరంగం అంటే విలాసదృశ్యం కాదు, మహాభయంకరమైంది అంటూ చెప్పినప్పటి పద్యం.

యుద్ధభూమిలో వినవచ్చే భయంకరమైన ఏనుగుల ధ్వనులు మదించిన గండుతుమ్మెదల రొదలుకావు. మహా వేగంతో పరుగెత్తుతూ ఉన్న గుర్రాల గిట్టలవల్ల పైకిలేచే దుమ్ము గాలివల్ల ఎగిరివచ్చే పద్మాల పుప్పొడికాదు. విరోధుల సింగిణీల నుంచి విడువబడే బాణాలు, దట్టంగా జలతరంగాలు కురిసే చల్లని జల్లులు కావు. దనుజేంద్రుడైన నరకాసురుని సైన్యసమూహాలు కలహంసలూ బెగ్గురుపక్షులూ కాపురం ఉండే కొలన్లు కావు. పదునైన శత్రువులబల్లేలూ, కత్తులూ మొదలైన ఆయుధాలన్నీ కమలముల, కలువల రాశులు కావు. ఓబాలా! నీ వెక్కడా? ఈ రణరంగానికిప్రయాణం ఎక్కడ? నీవు రావద్దు; వద్దు. ఇక్కడే ఉండు. నేను వెళ్లి వెంటనే తిరిగి వస్తాను అంటూ చిన్నదాన్ని బుజ్జగిస్తున్నట్లుగా పలికినాడు.

సాధారణంగా రణభూమి అంతా వీరులసింహనాదాలతో, ఏనుగుల ఘీంకారాలతో, గుర్రాలవేగంతో నిండిన దుమ్ముతో, పుంఖానుపుంఖంగా వస్తూ ఉన్న బాణాలతో, చతురంగబలాలతో, మారణాయుధాలతో నిండి ఉంటుంది. సుకుమారహృదయలైన అబలలు విలాసం కోసం ప్రవేశించే ప్రదేశం ఎంత మాత్రం కాదు. రాచకన్నెలకు అంతఃపురాలల్లో ఉద్యానవనాలూ, మకరందాన్ని నిండుగా త్రాగి జుంమ్మనే గండుతుమ్మెదల ఝుంకారాలూ, చల్లనీటి జల్లులూ, కనువిందైన కాసారాలు, పుప్పొళ్లూ, కలువలూ, కమలాలూ కలబోసిన పూలరాశులే తెలుసు.

అంటూనే ప్రియుడితో విలాసయాత్రకు బయలు దేరినట్లు యుద్ధ రంగానికి బయలుదేరుతానంటున్న సత్యభామను వారిస్తూ అతి చమత్కారంగా రాణివాసానికీ, రణరంగానికీ ఉన్న భేదాన్ని చూపినాడు శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణుని నోట, పోతనే స్వయంగా పలికించినాడు.

మ. ఖగనాథుం డమరేంద్రుఁ గెల్చి
సుధ మున్ గైకొన్న చందంబునన్
జగతీనాథులఁ జైద్యపక్ష
చరులన్ సాళ్వాదులం గెల్చి భ
ద్రగుఁడై చక్రి వరించె భీష్మక
సుతన్ రాజీవగంధిన్ రమా
భగవత్యంశ భవన్ మహా
గుణమణిన్ బాలామణిన్ రుక్మిణిన్.

భాగవతంలో రుక్మిణీ కల్యాణ ప్రారంభంలో రుక్మిణి కల్యాణాన్ని సాకల్యంగా చెప్పవలసిందిగా అడిగిన పరీక్షన్మహా రాజునకు శుకమహర్షి రుక్మిణీదేవిని శ్రీకృష్ణుడెట్లా వివాహమాడి నాడో వర్ణిస్తూ చెప్పిన పద్యం ఇది.

పూర్వం పక్షీంద్రుడైన గరుత్మంతుడు దేవేంద్రునిజయించి అమృతాన్ని తీసుకున్నట్లుగా శుభగుడైన హరి శిశుపాలుణ్ణీ, అతని పక్షాన్ని అవలంబించి తిరిగే సాళ్వాదులైన భూనాథులనూ జయిస్తూ, భీష్మకుని కుమార్తెనూ, తామర పువ్వువంటి సుగంధంతోకూడిన శరీరం గలదానినీ, భగవతియైన లక్ష్మీదేవి అంశతో

జనించినట్టి దానినీ, ఉత్తమ గుణమణినీ, రుక్మిణి అనే యోగ్యురాలైన బాలికను వరించి పెండ్లి ఆడినాడు— అంటూ చెప్పినాడు.

స్వర్గంలో ఎంతో భద్రంగా కావలా పెట్టి కాపాడుతూ ఉన్న అమృతభాండాన్ని ఆ అమృతానికి అధికారిగా వుంటున్న ఇంద్రుణ్ణీ అతని పరివారాన్నీ జయించి గరుడుడు గ్రహించినాడు. ఇప్పుడు శిశుపాలునికి రుక్మిణీదేవి భార్యగా పెద్దల చేత నిర్ణయించబడింది. అందుకే అమృతకుంభం వంటి రుక్మిణీదేవి శిశుపాలుని ధనంగా భావింపబడుతూ గట్టికావలాతో భద్రంగా ఉంచబడింది. మరి ఆధనాన్నిదొంగిలించడం సాధ్యం కాని పని. మహాపరాక్రమ వంతమైన వీర మండలిని ఛేదించి కానీ ఆమెను తేవడానికి వీలు పడదు. అందుకే శ్రీకృష్ణుడు శిశుపాలపక్షచరులైన సాళ్వాది వీరులను జయించీ అమృతరూపిణి అయిన రుక్మిణీ దేవిని హరించినాడు. ఈ హరించడాన్ని పక్షినాథుడైన గరుడుడు దేవాధిపతి అయిన ఇంద్రుణ్ణి జయించిన విధానంతో పోలుస్తూ పోతన పోలిక చెప్పినాడు. ఈ పోలిక సందర్భశుద్ధితో ఔచితీ శోభితమై ఉంది.

సాధారణంగా అమరాధిపతి ముందు పక్షిరాజు ఒక లెక్కలోనివాడుకాడు. అయినా శౌర్యంతో అమరేశ్వరుణ్ణి జయించి నప్పుడు అమృతాన్ని సాధింపగలిగినాడు. సామాన్య యాదవుడుగా చూడబడుతున్న శ్రీకృష్ణుడు పౌరుషాన్ని ప్రకటిస్తూ క్షత్రియ శ్రేష్ఠులను జయించి విజయలక్ష్మిని దక్కించుకున్నట్లుగా రుక్మిణీ దేవిని దక్కించుకొన్నాడు.

ఈ పద్యంలో పోతన రుక్మిణీదేవిని రమాభగవతి అంశగా పేర్కొంటూ ఆమెకు అనురూప వరుడుగా విష్ణువునే సూచించి నట్లు 'కృష్ణు'నికి చక్రి అనే పదాన్ని వాడినాడు. ఈ విధంగా పోతన ఈ పద్యంలో అర్థ విశేషాన్నే కాక చివరి పాదంలో అనుప్రాణితమైన 'ణ'కారయుక్త"న"కారాన్ని ఉపయోగిస్తూ చెవికి ఇంపును కలిగించే శబ్దాలంకారపు తళుకును సంతరించినాడు.

ఉ. దానవులైననేమి మఱి
 దైత్య సమూహములైననేమి నీ
 మానిత బాహు దుర్గముల
 మాటున నుండఁగనేమి శంక నీ
 తో నరుదెంతు నంచుఁ గర
 తోయజముల్ ముకుళించి మ్రొక్కెన
 మ్మానిని దన్ను భర్త బహు
 మాన పురస్సర దృష్టిఁ జూడగన్.

భూమిపుత్రుడైన నరకుడు ఇంద్రాదులను బాధింపగా వారు స్వర్గాన్ని వదలి ద్వారకాపురికి వచ్చి తమబాధలను శ్రీకృష్ణునితో చెప్పుకున్నారు. అప్పుడు కృష్ణుడు నరకసంహారానికోసం బయలుదేర బోతూండగా సత్యభామ, తానువెంబడి వస్తాను అంటూ కోరింది. అప్పుడు కృష్ణుడు తాను వెళ్ళేది యుద్ధానికికానీ వనకేళికి కాదనీ, తలపడేది దనుజేంద్రుని సైన్యకదంబాలే కాని కలహంస సారసకాసారాలు కావూ, నీవెక్కడా యుద్ధభూమి

ఎక్కడ వద్దు అన్నాడు. అందుకు సత్యభామ సమాధానం చెప్పి నప్పటి పద్యం ఇది.

దానవులైతే ఏం, అటుగాక దైత్యుల సమూహాలైతే మాత్రం ఏముంది? మానితమైన నీ భుజాలు అనే దుర్గాలచాటున ఉండే నాకు ఏ సందేహం ఎందుకూ? నీతోతప్పక వస్తానంటూ పద్మాల వంటి తన రెండు చేతులనూ మొగ్గగా చేసి అంటే జోడిస్తూ ఆ మానవతి, భర్త తనను గౌరవపురస్సరమైన చూపుతో చూస్తూ ఉండగా మ్రొక్కింది అంటూ వర్ణించినాడు.

సత్యభామకు కృష్ణుని బాహుబలంపై ఎంతో గురిఉంది. శ్రీ కృష్ణుని శౌర్యపరాక్రమాలు తాను ఇంతవరకు అనేకసార్లు విన్నదీ చూసిందీ కూడా! అయితే ఇప్పుడు వెళ్ళేది భూలోకంలో ఉన్న ప్రదేశాలకు కాదు. నరకుడు ఉండే మాహిష్మతీ పురానికి. గరుడ గమనంతోగాని వెళ్ళలేరు, అందుకే తానూవస్తానన్నది, నిజానికి సత్యభామకేమీ బెదురులేదు. అందుచేతే దానవులైతే భయమా, దైత్యులైతే భయమా! అన్నది. అయితే ఆ ధైర్యానికి కారణం సమ్మానితమైన వజ్రపంజరం వంటి శ్రీకృష్ణుని బాహు రక్షణ. ఆ దుర్గాన్ని భేదించడం ఎవరి తరమూ కాదు. ఆ మాటను జ్ఞాపకం చేస్తూ సత్యభామ "నీ మానితబాహు దుర్గముల మాటున నుండగ నేమిశంక" అంటూ గట్టిగా చెప్పింది. అప్రతిమాన వీరుడి బాహుపంజరరక్షితమైన కీరంవలె ఉన్న సత్యభామకు భయ మెక్కడిదీ,బుగులెక్కడిదీ! అసలు ఆ మాటకు వస్తే సత్యభామకు ఎదురు నిలువగలిగిన వీరుడే లేడేమో! అయినా శ్రీకృష్ణుని బాహుపరాక్రమాన్ని పొగడ్తూ నారీధర్మాన్ని కాపాడుకుంది.

సత్యభామవంటి శృంగార వీరాంగన చేతులు జోడింపగా కరిగి కోరిక దీర్చనిమగవాడు ఉండడుకదా! ఆకారణం చేతనే శ్రీకృష్ణుడామె నయగుణానికి మెచ్చి సన్మానపూర్వకంగా చూచినాడు.

శ్రీకృష్ణుడు త్రికాలవేది. భవిషత్కార్యానికి అనుగుణంగా వెదుక బోయిన తీగె కాల తగిలినట్లు సత్యాదేవి ప్రార్థించింది. నరకుని వధకు సత్యభామ సన్నిధి తప్పనిసరి. పూర్వం భూదేవికి ఇచ్చిన మాటను నిలబెట్టుకునేందుకు భూదేవి అపరావతారం ఐన సత్యభామ సమ్మతి నరకసంహారానికి ఉపకరించింది. అందుకే కృష్ణుడామెను సన్మానించినాడు.

సీ. రాకేందుబింబమై రవిబింబమై యొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగంబు
కందర్పకేతువై ఘన ధూమకేతువై
యలరుఁ బూఁబోణి చేలాంచలంబు
భావజు పరిధియై ప్రళయార్కు పరిధియై
మెరయు నాకృష్టమై మెలఁత చాప
మమృత ప్రవాహమై యనల సందోహమై
తనరారు నింతి సందర్శనంబు

ఆ. హర్షదాయియై మహారోష దాయియై
పరఁగు ముద్దరాలి బాణవృష్టి
హరికి నరికిఁ జూడ నందంద శృంగార
వీరరసములోలి విస్తరిల్ల.

శ్రీ కృష్ణుడు సత్యభామనుగూడి మాహిష్మతీ పురానికి వెళ్లి నరకాసురునిపై దాడిచేసినాడు. కొంతసేపటికి శ్రీకృష్ణుడు తన చేతివింటిని సత్యభామకు అందించి యుద్ధము చేయుమన్నాడు. అప్పుడు సత్యభామ ఉత్సాహంతో పొంగుతూ యుద్ధానికి ఆయత్తమై నిలిచిన రీతిని వర్ణించిన పద్యం ఇది. ఆపద్మాక్షిముఖం చంద్ర బింబంగానూ సూర్యబింబంగాను ప్రకాశించింది. పూవువంటి మెత్తని శరీరం కలిగిన ఆ సత్యభామ చేలాంచలం మన్మథుని ధ్వజంగానూమహా అరిష్టకారియైన తోకచుక్కగానూ గోచరించింది. సత్యభామచేత బాగా లాగబడిన విల్లు,కామదేవునికి పరివేషంగానూ ప్రళయకాలపు సూర్యునికి కాంతిచక్రంగానూ భాసించింది. ఆమె దర్శనం అమృత ప్రవాహంగానూ, కణకణలాడే నిప్పుకల కుప్పగానూ ఒప్పింది. ఆ ముగ్ధ కురిపించే బాణవర్షం సంతోష దాయకంగానూ మహారోషదాయకంగానూ మారుతూ శ్రీహరికీ, శత్రువుఐన నరకాసురుడికి చూడగా చూడగా శృంగార వీర రసాలను ప్రవర్ధనం చేసినాయి—అంటూ వర్ణించినాడు. ఒకే సత్య భామ ఆశ్రయభేదంతో వీర శృంగార రసాలకు స్థాయిఐన విధా నాన్ని పోతన ఈపద్యంలో వర్ణించినాడు. మనోజ్ఞమైన సత్యాదేవి ముఖమూ, చేలాంచలమూ, ఆకృష్టమైన చాపమూ ఇవన్నీ ప్రియు డైన శ్రీకృష్ణుని పురస్కరించుకుని శృంగార రసపుష్టికి అవసర మైన ఆలంబన, ఉద్దీపన విభావ సాత్త్విక వ్యభిచారాదులను సమ కూర్చగా, ఈ విభావాదులే ఆశ్రయ భేదంతో శత్రువును గురి చేస్తూ వీరరసాంగాలుగా పరిణమించినాయి. ఒకే పద్యంలో ఒకే వస్తువు రెండు విభిన్న రసాలకు వేరువేరు విభావాదులను ఆశ్రయ భేదంతో సమకూర్చే విధానాన్ని నాచన సోమనాథుడు తెలుగు

సాహిత్యంలో ప్రవేశపెట్టినాడు. ఆమార్గానికి ప్రతిబింబంగా పోతన ఈ పద్యాన్ని రచించినాడు.

కం. తొలుకారు మెఱుఁగు కైవడి
తళతళయని మేనుమెరయ ధగధగ యనుచున్
గలుముల నీనెడు చూపుల
చెలువంబుల మొదలి టెంకి సిరిపుట్టె నృపా!

పాలసముద్రాన్ని త్రచ్చినప్పుడు ఆ సముద్రంలోంచి శ్రీదేవి పుట్టింది. ఆమె పుట్టిన పుట్టుక తీరునూ సొగసునూ సంపదలకు ఆటపట్టైన ఆమె చూపులనూ వర్ణిస్తూ చెప్పిన పద్యం ఇది.

ఓ రాజా : వర్షాకాలపు మెరుపువలె తళ తళ లాడుతూ శరీరం మెరుస్తూ ఉండగా ధగ ధగ మంటూ సంపదలు ఈనుతున్న చూపులతో చక్కదనాలన్నిటికీ మొదటి గుర్తుగా, తొలిస్థానంగా లక్ష్మీదేవి పుట్టింది— అంటూ చెప్పినాడు.

ఈ పద్యం అంతా దాదాపు అచ్చ తెలుగు పదాలతో కూడిందే. ఐనా ఎంతో సొగసుగా ఉంది. 'తళ తళ' 'ధగ ధగ' అనే పదాలు కేవలం తొలుకారు మెరుపు మెరుగునే కాక శ్రీదేవి శరీరపు కాంతి తుళుక్కునూ, సంపదలను వర్షించే ప్రసన్నమైన ఆ చూపుల తీరునూ, ప్రదర్శిస్తూ లక్ష్మీదేవి శరీరపు నిగ్గు తీరుగనే సాగింది. "చెలువంబుల మొదలిటెంకి" అనే పదప్రయోగం అర్థస్వారస్యంతో పాటు తెలుగు పలుకుబడి తేనెలన్ని నిండుగా నింపుకున్నట్టిది. రసజ్ఞుల చెవికి మనస్సుకూ హాయిని గూర్చే

ఈ ప్రయోగం పాఠకుల చెవిపండుగలకు మొదటి టెంకిగా ఈనాటికీ నిలిచింది.

సీ. భావించి యొకమాటు బ్రహ్మాండ మంతయు
        నాటల బొమ్మరిల్లని తలంచుఁ
    బోలించి యొకమాటు భువనంబు లన్నియుఁ
        దనయింటిలో దొంతులని తలంచుఁ
    బాటించి యొకమాటు బ్రహ్మాది సురలను
        దన యింటిలో బొమ్మలని తలంచు
    గొనకొని యొకమాటు కుంభినీచక్రంబు
        నలవడ బొమ్మపీఁటని తలంచు

ఆ. సొలసి యొక్కమాటు సూర్యేందురోచుల
    నచటి దీపకళికలని తలంచు
    భామ యొక్కమాటు భారతీ దుర్గల
    నాత్మసఖు లటంచు నాదరించు.

కొత్తకారు మెరుపుకొనల తళుకుమేని నిగనిగలతో పాలసముద్రంలో పుట్టిన శ్రీదేవి దినదినం పెరుగుతూ శ్రీమహావిష్ణువును చేపట్టక పూర్వం తనఈడు ఆడపిల్లలతో కలిసి బొమ్మలాటలాడుకున్న తీరును వర్ణించిన పద్యం.

సంపదలతల్లి లక్ష్మీదేవి బ్రహ్మాండం అంతటినీ తాను ఆడుకునే బొమ్మరిల్లుగా భావించేది. అల్లే ఒక్కొకసారి ఈ సకల లోకాలను తన ఇంట్లో దొంతులుగా తలిచేది. మరొకసారి

నిజానికి ఆ విషయాన్ని వారు పూర్తిగా నమ్మినా, నమ్మక పోయినా ఇక ముందు జాగ్రతకు హెచ్చరికలు పలికినారు.

ఇట్లా అమాయికలైన గొల్లెతల మాటలకుకూడా ములు గోలవాడిని పదునుగా కల్పి మాట్లాడించిన నేర్పరి పోతనా మాత్యుడు.

క. కామోపభోగ సుఖములు
వేమాఱును బురుషుఁ డనుభవించుచునున్నం
గామంబు శాంతిఁ బొందదు
ధూమధ్వజుఁ డాజ్యవృష్టిఁ ద్రుంగుడువడునే!

పోతన భాగవతంలో ఆయా కథాకథన సందర్భాల్లో అనే కాలైన లౌకికాలౌకిక విషయాలు ప్రస్తావింపబడ్డాయి. అందులో అశమన రూపాలైన కోరికల లక్షణాలను వివరిస్తూ చెప్పిన పద్యం ఇది.

కామానుభవ రూపమైన సుఖాలను మానవుడు అనేకమార్లు అనుభవిస్తున్నప్పటికీ ఆ కోరిక శాంతించదు. ఎప్పుడైనా ధూమ కేతు డైన అగ్ని నేతితడుపుతో తగ్గుముఖం పడ్తాడా ? అంటూ స్పష్ట పరచినాడు.

ధర్మమయమైన మన భారతీయ సంఘ జీవితానికి ఆయువు పట్టుల వంటివి ధర్మార్థకామమోక్షాలు అనే పురుషార్థాలు. అర్థ కామాలు రెండూ ఇహ జీవితపు సుఖానికి ఆలంబనాలు కాగా 'ధర్మం' ఎప్పుడూ తొలుత ఉంటూ ఈ రెంటిని నియమిస్తూ

మోక్షం వైపు దృష్టిని మరలిస్తూనే ఉంటుంది. అయినా మానవుడు కామానుభవం నుండి విరమించడం ఎంతో కష్టం. కోరికలకు ఉపశమనం అంటూ ఉండదు. ఒకసారి అనుభవంతో చల్లారే గుణం వాటికి లేదు. అందుకే మన ఇతిహాస పురాణాదులన్నీ మానవుని దృష్టిని చిరంతన సుఖం అంటే మోక్షం వైపు దృష్టిని మళ్ళిస్తూ అనుపశమన శీలాలైన కామోపభోగాలను గూర్చి—

న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే॥

అంటూ నేతితడుపుతో నాలుకలుచాస్తూ తిరిగితిరిగి పైకి లేచే మంటలుగా కోరికలను వర్ణించినాయి. ఈ భావాన్నే భాగవతం కూడా ప్రబోధించింది. పోతన భారత హరివంశాది గ్రంథాలు చెప్పిన శ్లోకాలను యథాతథంగా అనువాదం చేసినట్లుగా, కామోపభోగాది సుఖాలను మానవుడు ఎంత ఉపభోగించినప్పటికి ఆ కామం శాంతించదు అంటూ వాచ్యంగా చెప్పే ఆ భావం ఇంకా మనస్సులో స్థిరంగా నిలిచేందుకు అనునిత్యం మనం చూస్తూ అనుభవంలో ఉన్న విషయాన్ని ఉపమానంగా చూపినాడు అగ్నికి నేయి అభివర్ధన కారకం. ఆ రుచికి ఎప్పుడూ అగ్ని అర్రులు చాస్తూనే ఉంటాడు. స్వరూపంలో నేయి ద్రవరూపం కదా అగ్నిని చల్లారుస్తుంది అని అనుకోవడం పొరపాటు. అట్లాగే కామాదులు కూడా ఒకసారి అనుభవిస్తే తగ్గేవికావు. తిరిగి తిరిగి అనుభవాన్నే కోరుతాయి. అందుకే మోక్షార్థి ఐనవాడు తొలుతనే ఇంద్రియాలను నిగ్రహిస్తూ వాటి జోలికి పోకుండా ఉండడం మంచిదంటూ వీతరాగులు చెప్పినారు. కానీ కోరికలను మొదలంటగా కోయడం

సామాన్యులకు తరంకాదు. కానీ సాధ్యమైనంత వరకు వాటిని నియమించడానికి పోతన వ్రాసిన ఈ పద్యం ఉపకరిస్తే ఉపకరించవచ్చు.

క. ముదిసెను దంతావళియును
ముదిసెను కేశములు దనువు ముదిసెం దనకున్
ముదియనివి రెండు చిక్కెను
బ్రతికెడి తీపియును విషయపక్షస్పృహయున్.

నిస్సారమైన సంసారాన్ని, ఆ సంసారానికే బంధించి ఉంచే ఆశాపాశాదుల స్వరూపాన్ని వర్ణిస్తూ భాగవతం చెప్పిన పద్యం ఇది.

బాగా వయస్సు పండి పళ్లన్నీ ముదిసిపోయినాయి అంటే పటుత్వాన్ని తప్పినాయి, అట్లే తలవెంట్రుకలూ పండిపోయినాయి. శరీరం కూడా ముసలితనంతో బిగువు సడలింది, కానీ ముదియకుండా నిత్య యౌవనంతో మిగిలినవి రెండున్నాయి. ఒక ఇంకా బ్రతుకవలె అనే తీపి, రెండవది విషయ సుఖాలను అనుభవించవలె అనే కోరిక అంటూ వివరించినాడు.

సాధారణంగా సృష్టిలోనే ప్రతి జీవికీ పుట్టడం, పెరగడం, ముదిమిని పొందడం, చివరకు నశించడం అనేవి నిత్యంగా ఉన్నాయి ఈ క్రమ పరిణామాన్ని అనుసరించే శిశువు యౌవనం దశను పొందీ విషయోపభోగాలను అనుభవిస్తూ వయస్సు పడమటికి మళ్లుతూ ఉండగా మెలమెల్లగా సర్వావయవ పటుత్వం తగ్గుతూ చివరకు పళ్లన్నీ ముదిసీ రాలీ వెంట్రుకలు పండీ తల

ముగ్గు బుట్టలా తెలుపెక్కుతుంది. ఇంతటి దయనీయమైన స్థితిని పొందినప్పటికీ ఆతనిలో రెండు విషయాలు మాత్రం నిత్య యౌవనాన్ని భజిస్తూ పచ్చగా ఉంటాయి. ఆ రెంటికి 'ఇంకా' 'ఇంకా' అనేదే తప్ప చాలు అనే తృప్తి తెలియదు. అది తాను జీవించాలి అనే కోరిక. బ్రతుకుపై మమకారం, రెండవది కామోపభోగాలపై స్పృహ. చింత చచ్చినా పులుపు చావదు అన్నట్లు మానవుడు ముదిసి జీవించినా ఆతనిలో ఉన్న కోరిక మాత్రం చావదు. ఇదే సృష్టి విచిత్రం. ఇదే ఇహలోకపు ఉనికికి మూలాధారం. ఇదే మాయ. దీన్ని ఛేదించడం పరమయోగులకు తప్ప ఇతరులకు సాధ్యం కాదేమో? అయినా పరాన్ని పూర్తిగా మరచి ఇహంలో మునిగి తేలకుండా హెచ్చరికలు పలికినప్పుడు కొందరికైనా పరార్థ చింత కలుగుతుంది. ఇంత వరకే పెద్దలు ఈ విషయాలను గూర్చి ప్రసంగిస్తూ "యా న జీర్యతి జీర్యతః" అంటూ చెప్పి వాటిని నియమించడం ఎంత కష్టమో సూచించి నారు.

రెండు చేతులా పద్యాన్ని నడుపగలిగిన పోతన ఏదో చమత్కారాన్ని ప్రవేశపెడుతూ పద్యానికి ఇంపును కూర్చగలుగు తాడు. అటువంటిదే ఈ పద్యం కూడా.

సీ. వనజాక్షి! నేఁగన్న వైజయంతికనైనఁ
గదిసి ప్రేలుదుఁగదా కంఠమందు
బింబోష్ఠి! నేఁగన్న పీతాంబరమనైన
మెఱసి యుండుదుఁ గదా మేను నిండఁ

గన్నియ! నేఁగన్న కౌస్తుభమణినైన
నొప్పుచూపుదుఁగదా యురమునందు
బాలిక నేఁగన్న పాంచజన్యమునైన
మొనసి చొక్కుదుఁగదా మోవిఁగ్రోలి

ఆ. పద్మగంధి! నేను బర్హదామమునైన
చిత్రరుచుల నుందు శిరమునందు
నమచుఁ బెక్కుగతుల నాడిరి కన్యలు
గములు గట్టి గరుడగమనుఁ జూచి.

శ్రీ కృష్ణుడు నరకాసురుని సంహరించిన తరువాత ఆనర కుని నగరులో చెరచిక్కిన పదహారువేలమంది రాచకన్నె లను విడిపింప బోయినాడు. శుభరూపగుణోపేతలైన ఆ కన్యలందరూ శ్రీకృష్ణుని పతిగా భావిస్తూ ఆతని సాహచర్యసౌభాగ్యాన్ని భావిస్తూ అది తమకు దక్కితే ఎంతబాగుండునంటూ పారవశ్యంతో నర్తించినప్పటి పద్యం ఇది.

ఓ పద్మాక్షీ! నేనుగన్న ఆకృష్ణుడు మెళ్ళోధరించే తోమాలను ఐఉంటే ఎప్పుడూ పాయకుండా ఆ మెడలోనే వ్రేలుతూ ఉండే దాన్ని కదా! ఓ దొండపండు పెదవి దానా! నేనే స్వామి ధరించే పచ్చబట్టను ఐఉంటే ఆయన శరీరాన్ని అంతాచుట్టుకుని మెరుస్తూ ఉండేదాన్ని కదా! ఓ బాలా! నేనుగన్న కౌస్తుభరత్నాన్ని ఐఉంటే ఎప్పుడూ ఆహరి ఎదలో ఒప్పులొల్కుతూ ఉండే దాన్ని కదా! ఓ చిన్నదానా! నేనే పాంచజన్యం అనే శంఖాన్నే ఐఉంటే ఆహరి

అధరాన్ని త్రాగుతూ చొక్కి ఉండేదాన్ని కదా! ఓపద్మగంధీ! నేనే నెమలి పింఛపు దండనై ఉంటే రంగురంగులైన విచిత్రకాంతులతో ఆ కృష్ణుని నెత్తి నెక్కి ఉండకపోదునా? అంటూ అనేక విధాల భావిస్తూ గరుడగమనుడై వచ్చిన ఆ హరిని చూచి కన్యలందరూ గుంపులు గట్టి ఆడినారు అంటూ చెప్పినాడు.

ఈ పద్యంలో పోతన రాజకన్యలను శ్రీకృష్ణుడు భార్యలుగా పరిగ్రహించక పూర్వమే వారు ఆతని ఎడల శృంగార రసతరంగిత హృదయలు అనే ధర్మసూక్ష్మాన్ని చెప్పడానికోసం కమ్మటి ఈ పద్యాన్ని రచించి ఔచిత్యాన్ని కాపాడినాడు. కామోత్కంఠలైన ఈ కన్యలు ఆ హరిస్పర్శనూ, ఆలింగన చుంబనాదులను అనుభవించడానికొరకు జడస్థితిని పొందడానికైనా వెనుదీయలేదు. చైతన్యం కలిగీ స్వామి సాహచర్యసౌభాగ్యానికి నోచుకోని తమకన్నా ఎల్లప్పుడూ ఆ హరి సర్వాంగాలతోలాలింపబడే వైజయంతీ వనమాలికా, పీతాంబరమూ, కౌస్తుభమణీ, పాంచజన్యమూ, బర్హదామమూ మొదలైన అచేతన పదార్థాలే సౌభాగ్యవంతాలంటూ పొరపొరపొక్కినారు. ఇందులో ఆ పదార్థాల సౌభాగ్యానికి పైకి మెచ్చుకుంటూనే అయ్యో! అనే ఈర్ష్యకూడా ఆకన్యల ఎదలలో ధ్వనింప చేసినాడు పోతన. ఈ ఈర్ష్య ఒకే వస్తువుపై అనురాగం పెంచుకున్నవారికే కలుగుతుంది. అదే సపత్నీత్వం.

ఈ పద్యంలో రాజకన్యల శృంగార భావాన్ని ఎంతో సుకుమారంగా, ఔచిత్యవంతంగా వర్ణించిన పోతన శ్రీకృష్ణవల్లభలు కాదగిన వారి ఆభిజాత్యాన్ని, శీలాన్ని ఎంతో శుచిమంతంగా ప్రదర్శించినాడు, ఈపద్యంలో కేవల శృంగారభావనేకాక భక్తిభావం

కూడా నిండారి ఉంది. ఎందుకంటే శాండిల్యనారదాదులు భక్తిని నిర్వచిస్తూ 'సాత్వస్మిన్ పరమప్రేమరూపా' అంటూ చెప్పినారు. పరమమైన ప్రేమను కృష్ణుని ఎడల పెంచుకున్న ఆ రాజకన్యలు మహాభక్తురాండ్రు కాగా స్వామి ఐన కృష్ణునికి వారిని అనుగ్రహింపక తప్పింది కాదు! అందుకే ఈ కృష్ణుడు అందరినీ వివాహమైనట్లు పోతన స్పష్టం చేసినాడు.

ఆ. సిగ్గు పడుట గల్గి సింగారమును గల్గి
భక్తి గల్గి చాల భయము గల్గి
నయముఁ బ్రియముఁ గల్గి నరనాథు చిత్తంబు
సీత దనకు వశము చేసికొనియె.

సీతాదేవి అన్నిగుణాలు కలిగి భర్తఐన శ్రీరాముణ్ణి వశం చేసుకొన్న విధానాన్ని ఈ పద్యంలో పోతన వర్ణించినాడు.

సీతాదేవి సిగ్గూ, సింగారమూ, భక్తీ, భయమూ, నయమూ, ప్రియమూ మొదలైన మంచిగుణాలన్నీ కలిగీ నరనాథుడైన శ్రీరామచంద్రుని చిత్తాన్ని తన స్వాధీనం చేసుకున్నది అంటూ పోతన చెప్పినాడు.

స్త్రీకి సిగ్గే సింగారం, అందుకే పోతన సిగ్గునుకూడా ఒక గుణ విశేషణంగానే సన్మానించినాడు. సిగ్గరి ఐన సీత సింగారాలొలుకుతూ భర్త ఎడల భయమూ, భక్తీ, నీతీ, ప్రేమా అన్ని గుణాలను ప్రదర్శిస్తూ గర్వించక, గయ్యాళి కాక, ఒదిగి మెదిగి మెలగుతూ తన భర్త ఐన శ్రీరామచంద్రుణ్ణి వశం చేసుకొన్నది అంటూ పోతన వర్ణించినాడు.

ఈ పద్యంలో చెప్పిన గుణాలన్ని స్త్రీకి పెట్టని తొడవులు. అత్తవారింట్లో కాలుపెట్టిన కోడలికి ఒక్కచక్కదనం మాత్రమే ఉంటే సరిపోదు. దానికి తోడు నయమూ, భయమూ, ఒద్దికా, ఒడుపూ, సిగ్గు అన్నీ ఉంటేనే ఆ సొగసు రాణిస్తుంది. అందుకే ఈ గుణాలన్నీ ఒక్క సీతాదేవికే కాక భార్యలందరూ అలవర్చు కొని తమ భర్తల మదికెక్కిన వారై మెలగవలెనంటూ పోతన ప్రబోధించినాడు. పోతన కూర్చిన ఉత్తమ ఇల్లాలి బొమ్మ ఇది.

చ. కటకటః మోసపోయితిమి
కాంతలపాటియు బుద్ధిలేదు నే
డిట హరిఁగానబో నెఱుఁగ
మేము దురాత్ములమేము కల్మషో
ద్భటులము విష్ణు దూరగుల
ప్రాజ్ఞత లేల తపంబు లేల? ప
ర్యటనము లేల శీలములు
యాగములున్ మఱియేల కాల్పనే.

కృష్ణుని పంపున గోపాల బాలకులు వచ్చి మునులను అన్నం అర్థింపగా కృష్ణుడు గొల్లడనే భావంతో చులకనగా మాట్లాడి పంపినారు. కానీ వారి భార్యలు మాత్రం కృష్ణునివద్దకు అన్నాన్ని తీసుకొని వచ్చి ఆరగింప చేసీ అనుగ్రహింపబడి నప్పుడూ వారి భర్తలు పొగడినప్పటి పద్యం ఇది.

అయ్యయ్యో ! ఎంత మోసపోతిమీ! ఆడువారికి ఉన్నంత పాటి బుద్ధికూడా లేదాయె, ఈనాడు హరిని చూడటానికి పోజాలక

పోతిమి. మేమెంత దురాత్ములమూ! ఎంతటి పాపగరిష్ఠులమూ! విష్ణువును దూరంచేసుకున్నవారి జ్ఞానం ఎందుకూ? తపస్సెందుకూ? యాత్రలెందుకూ? మంచి నడవడీ యజ్ఞయాగాదులూ ఇవన్నీ ఎందుకూ? కాల్పనా? అంటూ వాపోయినారు మునులు. పాపం మునిపత్నులకు భర్తల తోడిదే లోకం. గృహమేధులైన కారణంతో వారి నిత్యనైమిత్తికాదులల్లో ధర్మ భాగస్వామినులుగా మాత్రమే జీవించేవారు. నాగరికమైన ఏ ప్రపంచపు విషయాలతో అంతగా సంబంధంలేని వారు స్వయంగా తామై ఏకార్యాన్నీచేయ లేని అబలలు. అట్టి వారు ఈనాడు భర్తలు వారించినా శ్రీకృష్ణునికి భిక్ష పెట్టి, సాక్షాత్తు శ్రీహరినే అన్నంతో తృప్తిని పొందింప చేసినారు. ఈ భాగ్యం వారికి శాస్త్రాధ్యయనంతోగానీ, యజ్ఞ యాగాదులవల్లగాని, తత్త్వచింతనం చేతగానీ లభింపలేదు. కేవలం శ్రీకృష్ణునిమీద పెంచుకున్న మమకారం. అదే భక్తి. దాని వల్లనే తరింప బడ్డారు. ఇది తెలిసిన మునులు ఇంతకాలం అరణ్యాల్లోఉంటూ, తపమంటూ యాగమంటూ, శీలం అంటూ ప్రాకులాడినారే కాని విష్ణువును శ్రీకృష్ణునిలో చూడలేక పోయినారు. అందుకే తమకన్నా స్త్రీలే మెరుగు అంటూ మిడుకుతూ ఇంతకాలం తమకు పెరటి కల్పకంలా ఉన్న శ్రీహరిని గొల్లపిల్లడంటూ చులకన చూచినారేకాని పరబ్రహ్మంగా చూడలేకపోయినారు.

పోతన దృష్టిలో విష్ణు దూరగుడగుట కన్న మహాపాపం ఇంకొకటిలేదు. అటువంటివాడు చేస్తున్న కఠినతపమూ, పర్యటనమూ,యాగాదులూ అన్నీ వృథాయే. ఈమాటలను మునులచేత

పల్కించి సాధారణ జనానీకానికి విష్ణుభక్తి మహిమను వెల్లడి చేసినాడు.

క. భూసురుఁడవు బుద్ధి దయా
భాసురుఁడవు శుద్ధ వీరభట సందోహా
గ్రేసరుఁడవు శిశుమారణ
మాసుర కృత్యంబు ధర్మమగునే తండ్రీ!

అశ్వత్థామ తండ్రిపగను చల్లార్చుట కొరకు రాత్రినిద్రలో ఉన్న ద్రౌపదేయు లందరినీ మట్టుపెట్టినాడు. ద్రౌపదికోరిక దీర్ప భీమాదులు అశ్వత్థామను పట్టుకొని వచ్చి ద్రౌపది ముందు ఉంచి నప్పుడామె ద్రోణపుత్రునితో మాట్లాడిన మాటలతీరు ఈపద్యం.

బ్రాహ్మణుడవూ, బుద్ధితో, దయాగుణంతో ప్రకాశించే వాడవూ, సిసలైన వీరభట సమూహానికి ముందుండేవాడవూ, బాల హింస రాక్షసకృత్యం కదా? ఇది నీకు ధర్మమా తండ్రీ; అంటూ మెత్తగా ప్రశ్నించింది.

పోతన ఎత్తుగడలోనే 'భూసురుడవు' అంటూ ప్రారంభించి నాడు. బ్రాహ్మణుడైనవాడికి జన్మతోనేకాక సంస్కార విధితో కూడా కొంత నిష్ఠానియమం అదనంగా వస్తుంది. దాంతో ఇతర్ల కన్నా నిగ్రహం ఎక్కువగా ఉండ వలసినచోటు, ఆ స్థానంలోనే ఆవేశమూ, తొందరపాటూ మూర్తీభవించగా కోపశోకవేగాలతో బుద్ధి గ్రుడ్డిదైంది. ఆ కన్నుగాననితనంతో అశ్వత్థామ వీరధర్మానికి విరుద్ధంగా నిద్రిస్తున్న కుమారులను చంపినాడు. అందుకే ద్రౌపది

అశ్వత్థామలో ఉద్రేకంతో ఏగుణాలు మరుగున పడ్డాయో వాటిని మేల్కొలుపుతున్నట్లుగా 'బుద్ధి దయాభాసురుడవు, శుద్ధవీరభటసందోహాగ్రేసరుడవు' అంటూ సంబోధించింది. ఈ బుద్ధితో నిజంగా వీరుడైన వాడు కత్తిదెబ్బపడకే చచ్చికూర్చుంటాడు. ఈ విధంగా శూరశ్రేష్ఠుడైన అశ్వత్థామను ఎందుకూ పనికిరాని చవటనుగాచేస్తూ పువ్వులకన్నా మెత్తని పలుకులలో ప్రాణాంతకమైన విషాన్ని నింపి రువ్వింది. ఇంతతో తృప్తిని పొందక ఆతడు చేసిన శిశుమారణాన్ని స్పష్టంగా దృష్టికితెస్తూ, అది ఆసురకృత్యం కదా? మరి నీకు ధర్మమగునా తండ్రీ అన్నది. సాధారణంగా ఈ పద్యాన్ని ద్రౌపది ఓరిమికీ, మాతృ స్వభావానికీ, గాంభీర్యానికీ ప్రతీకగా చెప్పవచ్చు. కానీ సూక్ష్మంగా ఆలోచిస్తే మెత్తనిమాట నేర్పుతో చిచ్చుంటించే ఆమె సూక్తిపై చిత్ర్యానికి ఉదాహరణగా గ్రహించవచ్చు. తండ్రీ అనే సంబోధన ఇక్కడ ఆత్మీయంగా లేదు. దుఃఖానికి పరాకాష్ఠ కలిగీ తనకు జరిగిన అపకారానికి శిక్షగా ఎదిరిని ఏంచేసినా తీరని సందర్భంలో ఒక హృదయం నిస్సహాయంగా ధ్వనించే ధ్వని ఇది. ఈ ధ్వనిని పట్టగలిగినవాడు పోతన.

ఉ. అన్న! శమింపుమన్న! తగదల్లుడుగాఁ
డిది! మేనగోడలా
మన్నన సేయుమన్న విను మానినిఁ
జంపుట రాచపాడి గా

దన్నా! సుకీర్తిపై మనఁగదన్నా!
మహాత్ములు వోవు ద్రోవఁ బో
వన్నా! భవత్సహోదరిఁ గదన్నా!
నినున్ శరణంబు వేఁడెదన్.

దేవకీదేవి అష్టమ శిశువును ప్రసవించిందన్న వార్తను విని కత్తి బట్టి చంపుతా నంటూ వచ్చిన కంసునితో తనకీసారి జన్మించింది ఆడపిల్ల, దాన్ని చంపవద్దంటూ దేవకి అన్న కంసుని వేడుకుంటున్నప్పటి పద్యం ఇది.

అన్నా! కొంత శాంతించు! ఈ పని నీకు తగదు, అల్లుడు కాడు; ఇది నీకు మేనకోడలు, కొంత ఆదరం చూపు, నా మాట విను, స్త్రీని చంపడం రాజులకు న్యాయం కాదు, అది వారికితగని లక్షణం. నా ప్రార్థనను మన్నించి కీర్తిని సంపాదించుకుని బ్రదుకు,మహానుభావులుపోయే సుగతిని నీవూ ఆశ్రయించు!! నిన్ను శరణువేడేది వేరే ఎవ్వరోకాదు. నీ చెల్లెలు కదా! అన్నా కొంత దయ చూపు—అంటూ ప్రార్థించింది.

ఈ పద్యంలో ఉన్న సొగసు అంతా ఆ పద్యపు శైలిపై ఆధారపడి ఉంది. అన్నా! అనే పదం అనేకసార్లు పునరుక్తం కావడం వల్ల దేవకీదేవి కలుపుగోలుతనంతోపాటు ఆమె దైన్యాన్నీ ఉట్టిపడజేస్తుంది. అందుకే ఆమె సంబోధన కరుణ రసాత్మకమైన కఠికె గుండెలను కూడా కరగించేట్లు ఉంది. ఆమె మాటలల్లో కేవలం కాపాడుమంటూ ప్రాధేయపడిన విధానమే

కాకుండా మంచి చెడ్డలెరిగిన ఉత్తమ క్షత్రియకాంత చెడుగరికి బుద్ధిని చెబుతున్న విధానం కూడా గోచరిస్తుంది.

మ. మమతన్ మోములు మీఁదికెత్తుకొని రో
మంథంబు సాలించి హృ
త్కమలాగ్రంబులఁ గృష్ణు నిలిపి మురళీ
గానామృత శ్రేణి క
ర్ణములన్ గ్రోలుచు మేఁతమాని
గళితానందాశ్రులై చిత్రితో
పమలై గోవులు చూచుచున్న
వదిగో పద్మాక్షి! వీక్షించితే!

శ్రీకృష్ణుడు గోపవేషంతో పశువుల మేపుతూ వేణువును ఊదుతూ ఉంటే ఆ వేణుగానపు రుచిని మరిగి గోవులు తన్మయత్వంతో ప్రవర్తించిన విధానాన్ని, గోపికలు ఒకరితో ఒకరు ముచ్చటించుకున్నప్పటి పద్యం ఇది.

ఓ పద్మాక్షీ ! మమకారంతో మోరలు మీదికి ఎత్తుకుని, నెమరు వేయడం సాలించి, హృదయ కమలాలపై శ్రీకృష్ణుని నిల్పుకుని, ఆ హరి వేణుగానామృత ప్రవాహాన్ని చెవులతో త్రాగుతూ, మేతలు మానీ, ఆనందాశ్రువులు జాలువారుతూ ఉండగా ఏ మాత్రం చలనం లేకుండా ఆవులన్నీ చిత్రపటంలో చిత్రించిన బొమ్మలవలె చూస్తూ ఉన్నాయి చూస్తున్నావా అంటూ చూపింది.

ఇచ్చట పోతన ఆలమందల తన్మయత్వస్థితిని వర్ణిస్తున్నాడు. సాధారణంగా పశువులు తీరికగా పరుండినప్పుడు నిదానంగా నెమరువేస్తూ ఉంటాయి. అట్లా నెమరు వేయడం మానినప్పుడు పశువు ప్రమాదావస్థలో ఉన్నట్లు భావించడం పరిపాటి. కానీ ఇప్పుడు గోవులున్న స్థితి ప్రమాద సూచకం కాదు. అత్యంతమైన పారవశ్యం. ఈ పారవశ్యానికి కారణం సర్వలోక మనోహరుడైన శ్రీకృష్ణుని సాన్నిధ్యం. ఆ సాన్నిధ్యం కేవలం కర్మేంద్రియాలకు సంబంధించింది కాదు. ఆ గోవులు తమ హృదయపద్మ పీఠికపై ఆ హరిని ప్రతిష్ఠించుకున్నాయి. అంతేకాదు, శ్రవణేంద్రియాలతో మురళీగానామృతాన్ని ఆస్వాదిస్తూ అమృతత్వాన్నే భజిస్తూన్నాయి. అటువంటి గోవులకు మేతల మాట ఎక్కడిది? ఆనందంతో ఆనందాశ్రువులు రాలుస్తూ యోగోద్భవామృతరసాన్ని తాగుతూ, చొక్కిన యోగులవలె కదలిక లేక ఉండినవి. ఆ పారవశ్యాన్నే పోతన 'చిత్రితోపమలై గోవులు చూచుచున్నవని' రచించినాడు. గోవులలో ఈ తన్మయత్వస్థితిని చూడగలిగిన గోపిక నిజంగానే ధన్యురాలు.

పరిశుద్ధమైన భావసంపదను సుందర పదజాలంలో పొదిగిన పద్యం ఇది.

క. ఓడితివో శత్రువులకు
  నాడితివో సాధు దూషణాలాపంబుల్
  గూడితివో పరసతులను
  వీడితివో మానధనము వీరుల నడుమన్.

ద్వారకానగరం నుండి శ్రీకృష్ణ నిర్యాణానంతరం తిరిగి వచ్చిన అర్జునుని ముఖం వగపుతో మాసి వెలవెలబోతూ ఉండగా చూచిన ధర్మరాజు, తమ్ముని ప్రశ్నించినప్పటి పద్యం ఇది.

పగవారికి ఓడినావా? సాధుజనులను దూషించినావా? పరస్త్రీలను అనుభవించినావా? వీరుల మధ్యలో అభిమానాన్ని విడిచి ప్రవర్తించినావా? ఏమిటీ ఈ విషాదానికి కారణం అంటూ ప్రశ్నించినాడు.

ఈ పద్యం ఎంతో చిన్నది. కంద పద్యం అంతా త్రిప్రాసతో నడిచింది. సులభంగా అప్పజెప్పడానికి వీలుగా ఉంది. అయినా ఈ పద్యంలో జరుగగూడని మహోపద్రవాలన్నీ చెప్పబడ్డాయి. మహావీరుడూ, పౌరుషఘనుడూ, పుణ్యకర్ముడూ, మానధనుడూ అయినవాడు పార్థివశ్రేష్ఠుడైన అర్జునుడు. అట్టివాడు అల్పాలైన కారణాలతో వికల మనస్కుడు కాడు. బలీయాలైన కారణాలు ఉండవలె. ఆనాటి వీరపుంగవులకు విన్నదనం కలిగించేవి ప్రధానంగా సాటి వీరులలో అభిమానం గోలుపోవడం. అంటే శత్రువుకు లోబడటమో, కాక అన్నమాట తప్పడమో! ఇక దీనితో సమానమైన పరాభవ కారణాలు- పూజ్యులైన వారిని తిరస్కరించి నిందించడమూ, పరస్త్రీని గమించడమూ అనేవి. ఇవి ఆనాటి భారతీయ సంఘంలో పాటించే పడికట్టు రాళ్లుకాని ఈనాడు మారుతున్న సంఘంలో ఈ మాటలకు విలువే లేదు. అందుకే 'యుగేషు ఆవర్తమానేషు ధర్మోస్యా వర్తతే పునః' అన్నారు. ఆ విధంగా ఆవర్తాన్ని పొందుతూ ఉన్న ధర్మదృష్టితోపాటు సాంఘికాచారాలూ, నియమాలూ, విలువలూ

మారుతాయి. అయినా ప్రాచీనమైన వీరపురుషుల నైతికవిలువలకు ప్రతీకగా నిలిచిన పోతన భాగవతంలోని పద్యం మరువ గూడనిది.

శా. అక్రూరుండని పేరు పెట్టుకొని
నేఁడస్మన్మనో వల్లభుం
జక్రిన్ మాకడఁ బాపికొంచు
నరుగన్ జర్చించి యేతెంచినాఁ
డ క్రూరుండఁట క్రూరుఁడీతఁడు
నిజం బక్రూరుఁడౌనేని ని
ర్వక్రత్వంబునఁ గృష్ణుఁబెట్టి తన
త్రోవం బో విచారింపఁడే.

మధురానగరి నుండి కంసుని పంపున బలరామకృష్ణులను తోడ్కొని పోవ అక్రూరుడు వ్రేపల్లెకు వచ్చినప్పుడు, శ్రీకృష్ణునితో తమ ఎడబాటుకు కారణం అక్రూరుడంటూ తలచిన గోపికలు పరస్పరం సంభాషించుకున్న విధానం ఈ పద్యం.

అక్రూరుడు అనే పేరుపెట్టుకుని ఈనాడు మామనోవల్లభుడైన కృష్ణుని మానుండి వేరుచేసి వెళ్లుటకు ఆలోచించే వచ్చిన ఈతడు అక్రూరుడు ఎట్లా అవుతాడు? నిజంగా ఇతడు క్రూరుడే, కానినాడు స్వేచ్ఛగా శ్రీకృష్ణుని ఇక్కడే ఉంచి తనదారిన తాను పోవడానికి ఆలోచింపడా? అంటూ వాపోయినారు.

ఈ పద్యంలో ఉన్న సొగసు అంతా 'అక్రూర' శబ్ద ప్రయోగ విశేషంలో ఉంది. అక్రూరుడు కంసుని పంపున వచ్చినా శ్రీకృష్ణభక్తుడు. 'అక్రూరుడు' అనే శబ్దానికి క్రూరత్వం లేనివాడు అంటే కఠిన చిత్తుడు కానివాడు అని అర్థం. ఆ పదార్థాన్ని పురస్కరించుకుని గోపికలు ఎత్తిపొడిచినారు. వచ్చిన వాడేమొ అక్రూరుడట. అంటే, దయాదాక్షిణ్యాలు కలిగీ ఎదుటి వారి దుఃఖాన్ని సహింపనివాడు. మరి చేస్తున్న పనిమాత్రం గోపికలకు ప్రాణాధికప్రియుడైన శ్రీకృష్ణునితో ఎడబాటు కలిగించడం. అంతకన్న క్రౌర్యం మరొకటి గోపికలకు ఉండదు. అందుకే వారు ఈయన అక్రూరుడు కాడు సుమా! క్రూరుడు, నిజానికి అక్రూరుడే అయితే మా నుండి హరిని వేరుచేసే పనిని తలపెట్టకుండా, కృష్ణుని ఇక్కడే వదిలి వచ్చిన దారినే మథురా పురికి తిరిగి వెళ్లడా అన్నారు.

'తనత్రోవం బోవుట' అనేది జాతీయం. ఈ పదాన్ని ఈసడింపుగా, నిరర్థకతను సూచించే సందర్భంలో, ఎవ్వరి జోక్యం పెట్టుకోక ముక్కు సూటిగా నడిచే వాడి సందర్భంలో, ఉపయోగిస్తూ ఉంటారు. సమయ సందర్భాలను బట్టి ఈ పదం నానార్థాలను ధ్వనిస్తూ ఉంటుంది.

గోపికల మధురభక్తికి ఈ పద్యం నిదర్శనంగా పోతన రచించినాడు.

సీ. ప్రాచీదిశాంగనా ఫాలతలంబున
దీపించు సింధూర తిలకమనఁగ

దర్పించి విరహుల ధైర్యవల్లులు ద్రెంప
దగ్పకుండెత్తిన దాత్రమనఁగ
నలిగి కాలకిరాతుఁ డంధకార మృగంబు
ఖండింప మెఱయించు ఖడ్గమనఁగ
గగన తమాల వృక్షము తూర్పు కొమ్మను
లలితమై మెరయు పల్లవమనంగఁ

దొగలు సంతసిల్ల దొంగలు భీతిల్లఁ
గడలి మిన్నుముట్టి కడలుఁ కొనఁగ
బొడిచె శీతకరుఁడు భూరిచకోరక
ప్రీతికరుఁడు జార భీతికరుఁడు.

చంద్రోదయాన్ని వర్ణిస్తూ భాగవతంలో పోతన చెప్పిన పద్యం ఇది.

తూర్పు దిక్కు అనే స్త్రీనుదుట ప్రకాశించే సిందూరపు బొట్టుగా, ప్రియుల వియోగంతో బాధపడే వారి ధైర్యపు తీగెలను తెంపేందుకు మన్మథుడు గర్వించి ఎత్తిన కొడవలి అనేట్లూ, కాలం అనే బోయవాడు కోపంతో చీకటి అనే మృగాన్ని ఖండించడానికి జళిపించిన కత్తి ఏమో అనేటట్లూ, ఆకాశం అనే చీకటి మానుయొక్క తూర్పుకొమ్మ చిగురింపగా లలితంగా మెరిసే లేచిగురు అనే విధంగా, కలువలు సంతోషించగా, దొంగలు భయపడగా, సముద్రంలో తరంగాలు ఆకాశాన్ని తాకేట్లు లేస్తుండగా,

శీతకిరణుడైన చంద్రుడు వ్యభిచారులకు భయంకరుడూ చకోరాలకు ప్రియంకరుడూఐ ఉదయించినాడు అంటూ వర్ణించినాడు.

పై సీసపద్యపు నాల్గు పాదాలూ, నాచనసోముడు సూర్యాస్తమయాన్ని వర్ణిస్తూ చెప్పిన పద్యాన్ని, తలపింపజేస్తూ మనోహరంగా ఉన్నాయి. ఈ చంద్రుడు చకోరాలకూ, కలువలకూ పరమ ఆప్తుడు. అందుకే చంద్రునికి చకోరంలా ఎదురుచుస్తున్నాను అనే మాట జనసామాన్యంలో నానుడిగా నిలిచింది. అట్లే చీకటి తప్పుచేసే జారచోరులకూ, విరహులకూ సర్వలోక నయనానంద కరుడైన చంద్రుడు గిట్టనివాడు. ఆయన ఉదయం ఈ దుర్మార్గవర్తులకు విఘ్నకారి. ప్రకృతిసహజంగా పున్నమినాడు సముద్రంలో ఆటుపోటుల ప్రభావం అమితంగా ఉంటుంది. సముద్రానికీ, చంద్రునికీ పితా పుత్ర సంబంధం ఉంది. పుత్రోత్సవంతో ఆనందించే సముద్రుడు మిన్నుముట్టి కడలుకొంటాడు అంటూ వ్రాస్తూ చంద్రోదయంలో జరిగే ప్రకృతి వికారానికి సుందరమైన కారణాన్ని ఊహించేటట్లు చేసినాడు. ఈ పద్యంలో రూపకానుప్రాణితమైన ఉపమానంశ్లిష్టోత్ప్రేక్షాలంకారం ఉంది.

క కనియెదవో బిడ్డల నిఁక
మనియెదవో తొంటి కంటె మనుమల మాటల్
వినియెదవో యిచ్చెద ర
మ్మనియెదవో దానములకు నవనీసురులన్.

కురుక్షేత్రయుద్ధంలో తమ పక్షాన్ని పూర్తిగా గోలుపోయి ఈకలు ఊడినపిట్టలవలె గాంధారీధృతరాష్ట్రులు పాండవుల ఇంట

అతిదీనవృత్తితో కాలం గడుపుతున్న సందర్భంలో విదురుడు ధృతరాష్ట్రునితో పలికిన మాటలు ఈ పద్యం.

ఇంకా బిడ్డలను కంటాననుకుంటున్నావా? కాక తొలిత కన్నా ఇంకా సుఖంగా బ్రతుకుతాననుకుంటున్నావా? లేక మను మల మాటలు వింటాను అనుకున్నావా? ఏదో దానం చేస్తా నంటూ బ్రాహ్మణులను పిలుస్తాను అనుకున్నావా? అంటూ నిరీహను కలిగించినాడు విదురుడు ధృతరాష్ట్రుని మనస్సులో.

సర్వజంతు సామాన్యంగా మానవుడికీ బ్రతుకుమీద తీపి ఎక్కువగానే ఉంటుంది. కానీ తానింకా బ్రతుకదలచే కోరికకు లోకంకోసమైనా కొంత దోహదకారణం ఉండవలసి వస్తుంది. ధృతరాష్ట్రుని విషయంలో మాత్రం ఏవైపునుండి ఆలోచించినా ఆయన బ్రతుకవలసిన పని కనిపించడం లేదు. పుట్టుగ్రుడ్డి, రాజ్యమా లేదు విషయ సుఖానుభవానికా అసలే వయస్సుకాదు. పోనీ కొడుకులు కోడండ్రూ ఉన్నారా అంటే ఆ మూలదుంపే పెకిలించి వేయబడింది. పోనీ మనుమల తొక్కుపలుకులు వింటూ జీవించదలచినాడా అంటే మనుమలూ మునిమనుమలు కూడా యుద్ధరంగంలో ఊడ్చుకొనిపోగా కొమ్మలూ, ఆకులూ, రెమ్మలూ దుల్చిన ఉత్త మ్రోడువలె ఉన్నాడు. రేపు చిగిరించే అవకాశమే లేదు. ఈ సుఖాలేవీ కాకున్నా దానధర్మాలు చేస్తూ అర్హులైన నల్గురిని పిల్చి సత్కరించడానికా సర్వతంత్ర స్వతంత్రుడు కాడు. ఏ ప్రాభవమూ లేక భీమునిచేత అప్పుడప్పుడు సూటిపోటి మాటలు పడ్తూ కాలికొరడులై జీవిస్తున్నారు. అటువంటి ధృతరాష్ట్రుణ్ణి చూచి ఇకనన్నా ఈ మమకారాన్ని వదులుకుని అరణ్యాలల్లో ముని

వృత్తితో ఉండరాదా అంటూ విదురుడు చెప్పినాడు. నిజానికి విదురుడే కాదు, విజ్ఞులైనవారు ఎవ్వరైనా ఆ పరిస్థితిని చూస్తే ఆ విధంగానే పలికి ఉంటారు.

పోతన ప్రయోగించిన త్రిప్రాసతో ఈ కందపద్యానికి ఒక అందం వచ్చింది.

ఉ. నీవడవిన్ బవల్ దిరుగ
    నీ కుటిలాలక లాలితాస్య మి
  చ్ఛావిధిఁ జూడకున్న
    నిమిషంబులు మాకు యుగంబులై చనుం
  గావున రాత్రులైన నినుఁ
    గన్నుల నెప్పుడుఁ జూడకుండ ల
  క్ష్మీవర! ఱెప్పలడ్డముగఁ జేసె
    నిదేల విధాత క్రూరుఁడై.

శ్రీకృష్ణుని విరహాన్ని సహింపలేని గోపికలు ప్రతి నిమిషాన్ని ఒక యుగంగా భావిస్తూ పరి పరి విధాలుగా చింతిస్తూ ఉన్న విధానాన్ని వ్యక్తపరిచే పద్యం ఇది.

ఓ కృష్ణా! నీవు గోపాలకుడవై పగలంతా అడవుల్లో తిరుగుతుంటావు కాబట్టి ముంగురులతో అలంకృతమై ముద్దులొలికే నీ ముఖాన్ని మేము కోరినట్లుగా చూడలేకపోవడంతో ఆ నిమిషాలన్నీ మాకు యుగాలుగా గడుస్తున్నాయి. అందుకే రాత్రిళ్లైనా నిన్ను కండ్లనిండా చూడకుండా ఆ పాడు బ్రహ్మ మా కండ్లకేమో

ఈ రెప్పలు అడ్డంగా సృజించినాడు, ఎంత క్రూరుడో కదా అంటూ వాపోయినారు.

భాగవతంలో భ్రమరగీతాలవలె గోపికాగీతాలు కూడా ఆపాత మధురాలై శృంగార రసతరంగితాలై మనోహరంగా ఉంటాయి. కానీ ఈ శృంగారం పరమాత్ముడైన శ్రీకృష్ణుడు లక్ష్యంగా అభివర్ధనం పొందటంతో అది దైవరతికమై దివ్య శృంగారంగా పరిణమించింది. అందుకే ఈ విరహంలో కూడా భగవంతుని ఎడబాటును క్షణంకూడా సహించని భక్తుని ఆర్తిగా భావించినప్పుడు గోపికల దివ్యశృంగారం మధురభక్తిగా రూపొందుతుంది. అందుకే ఆ గోపికలు ధన్యాత్మలూ,దివ్యాత్మలూ అంటూ కీర్తింపబడ్డారు.

ఈ పద్యానికి అంతటికీ చివరి రెండుపాదాలు రసకందంగా ఉన్నాయి. పగలంత కృష్ణుడు గోవులను మేపుతూ అరణ్యాలల్లో తిరుగుతూ ఉంటాడు సరే ! గోపికలు ఆ కృష్ణుని అలకభ్రాజితమైన ముద్దుమోమును చూడడం పడదు. ఆ క్షణాలన్నీ యుగాలై నిలుస్తాయి కానీ రాత్రి గోపికలు తమ కండ్లను తెరిచి కృష్ణుని ముఖాన్ని కరువుదీరా చూడవచ్చు అనుకుంటే పాపం రెప్పలు అడ్డం వచ్చినాయంట. ఏమి చమత్కారం? ఎంత సుందరమైన భావన— ఈ వాక్యాల్లో గోపికలు తమకూ కృష్ణునికీ మధ్య రెప్పపాటు వాసినికూడా సహించరనేది వ్యక్తం అయింది. అంతేకాదు, గోపికలందరూ దట్టమైన జమిడి రెప్పలున్న కండ్లతో ఎంతో సొగసుకత్తెలనే భావాన్నికూడా పోతన ధ్వనింప చేసినాడు. ఈ పద్యాన్ని రసధ్వనికీ, ప్రౌఢికీ ఉదాహరణంగా గ్రహింపవచ్చు—

మ. అరవిందాక్ష పదారవింద
మకరందాసక్తులై యున్న స
త్పురుషశ్రేష్ఠుల వృత్తముల్
వినక దుర్బుద్ధిన్ విలంఘించి దు
ర్నరవార్తా కథన ప్రపంచములు
గర్ణప్రాప్తముల్ సేసి వా
సరముల్ వ్యర్థతఁ ద్రొబ్బుచుండఁ
జనదీ సంసార మోహంబునన్,

పరమభాగవతోత్తములైన విష్ణుభక్తుల కథలే వినదగిన విషయాలంటూ చెప్పే సందర్భంలో ఉన్న పద్యం ఇది.

పద్మాక్షుడైన విష్ణుదేవుని పాదపద్మాలలో నిక్షిప్తమై ఉన్న తేనెను పానం చేయడంలో ఆసక్తులై ఉన్నటువంటి ఉత్తమ పురుషశ్రేష్ఠుల చరిత్రాలను వినకా, దుర్బుద్ధితో వాటిని కాదంటూ, కాపురుషులైన ఇతర రాజుల కథలను చెవి చొప్పించుకుంటూ దినాలను వృథాగా సంసారపు మోహంలో పడీ గడుపుతూ ఉండడం మేలుకాదు అంటూ హెచ్చరించినారు.

సాధారణంగా మనస్సు కోతివంటిది. దానికి లాఘవాలైన పనులమీద ప్రీతి ఎక్కువ, బహుశః అనుకరణంకూడా ఎక్కువే. అందుకే సామాన్యుని నడవడి పరిసర ప్రభావంతో ప్రభావితం అవుతూ ఉంటుంది. పెద్దలు అందుకే ఉత్తమ సాంగత్యం మంచిదంటూ నియమించినారు. అట్లాగే తాను వినే కథగానీ,

విషయంకానీ ఆ శ్రీహరికో, ఆ హరిభక్తులకో సంబంధించి ఉండవలె. అందుకేనేమొ ప్రాచీనులు 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అన్నారు. పోతనకూడా శ్రీహరి నామస్తుతి లేని కావ్యం అయోగ్యమైన కారణంతో శుభప్రదం కాదూ! అంటూ చెప్పినాడు. అందుకే మన సాహిత్యంలో సాహితీ లక్షణదక్షులైన కవులు కవి వృషభులై తమ కలాలను శృంగార రసంలో ముంచుతూ ప్రబంధాలను వ్రాసినారు. అందువల్ల సామాన్యులందరూ ఐహిక సుఖలోలుప బుద్ధులు కావడానికి ఎంతో ఆస్కారం ఉంది. అందుకే పోతన ఈ సుఖవాసనలు అన్నీ మానవుణి మరీ మరీ సంసార చక్రంలోనే బంధిస్తూ ఉంటాయి అనే విషయాని గ్రహిస్తూ, దానినుండి మానవకోటిని రక్షింపతలచీ 'నాయనలారా! మీకు కథలువినాలి అనే బుద్ధే ఉంటే శ్రీహరి పాదాలమ నమ్మికుని అమృతత్త్వాన్ని భజించే భక్తుల చరిత్రలు వినండి. అంతేకాని ఏదో సామాన్య రాజమాత్రులైన ఇతర నరుల కథలు వింటూ, ఈ సంసార మోహంలో మునకలువేస్తూ అమూల్యంఐన కాలాన్ని వృథాచేయకండి' అంటూ హెచ్చరికలు పలికినాడు.

క. ఎప్పుడు ధర్మక్షయమగు
నెప్పుడు పాపంబు పొడము నీలోకములో
నప్పుడు విశ్వేశుఁడు హరి
దప్పక విభుఁడయ్యుఁ దన్నుఁదా సృజియించున్.

నరకాసుర సంహారం కొరకు శ్రీమన్నారాయణమూర్తి శ్రీకృష్ణుడుగా జన్మించినాడంటూ చెప్పే సందర్భంలోనిది ఈ పద్యం.

లోకంలో ఎప్పుడు ధర్మం నశిస్తుందో, పాపం ఎక్కువగా కనబడుతుందో అప్పుడు విశ్వేశ్వరుడైన శ్రీహరి తాను అనాది నిధనుడై కూడా తనను తాను సృజించుకుని అవతరిస్తూ ఉంటాడు అంటూ స్పష్టపరచినారు.

భారత భాగవత హరివంశాది పురాణాల్లో నారాయణుని దివ్యావతార కథాప్రారంభానికి ముందు, సనాతనుడూ, సర్వేశ్వరుడూ, సహస్రశీర్షుడూ, శ్రీవత్సాంకుడూ, సర్వవిభుడూ ఐన దేవదేవుని సహస్రాధికాలైన అవతారాలకు కారణం చెబుతూ—

హితార్థం సురమర్త్యానాం లోకానాం ప్రభవాయచ ।
బహుశః సర్వభూతాత్మా ప్రాదుర్భవతి కార్యతః॥

సర్వభూతాత్మకుడైన భగవానుడు దేవతలూ, మానవులూ, సర్వ భూతజాలమూ సుఖించేకొరకూ, లోకాలు వృద్ధిపొందేకొరకు అనేకమారులు జన్మిస్తూ ఉంటాడు అంటూ చెప్పి, ఆ జన్మకు ప్రధానావసరంగా—

యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
ధర్మ సంస్థాపనార్థాయ తదా సంభవతి ప్రభుః॥

అంటూ చెప్పబడింది. ఈ శ్లోకగతార్థాన్నే విపులీకరిస్తున్నట్లుగా నరకాసుర కథ ప్రారంభానికి పూర్వం పోతన ఈ పద్యాన్ని రచించినాడు.

ఎప్పుడు ధర్మం బాధింపబడుతూ నశిస్తుందో అప్పుడు పాపం బాహాటంగా విజృంభిస్తుంది. ఆ విజృంభణలో ధర్మజ్ఞులూ,

నిరుపేదలూ, సాధువులూ బాధింపబడుతారు. ఆ సాధురక్షణకు సర్వసమర్థుడైన ఒక శాసకుడు అవసరం. అందుకే—

'పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతామ్
ధర్మ సంరక్షణార్థాయ సంభవామి యుగే యుగే॥

అంటూ భగవానుడే స్వయంగా గీతలో చెప్పినాడు.

చావుపుట్టువులు లేని హరి లోకహితార్థం, ధర్మరక్షణార్థం, ఆత్మమాయతో తన్నుతాను సృజించుకుంటూ జన్మిస్తూ ఉంటాడు. అంటూ స్పష్టంచేసి పోతన శ్రీకృష్ణుడు లీలామానుష విగ్రహుండైన శ్రీహరియే అనే భావాన్ని పాఠకుల మనస్సులలో స్థిరపరచినాడు.

క. ప్రియురాలి వలని వార్తలు
ప్రియజనులకు నెల్ల ప్రొద్దుఁ బ్రియమగు భంగిన్
బ్రియుఁడగు హరి చరితంబులు
ప్రియభక్తుల కెల్ల యెడలఁ బ్రియములుగావే!

కల్యాణాత్మకమైన విష్ణుకథలు ఎన్ని విన్నా తృప్తి కలుగడం లేదూ, విన్నకొద్దీ క్రొత్తగానే భాసిస్తూ ఇంకా ఇంకా వినాలి అనే కుతూహలం కలుగుతూనే ఉంది. ఏమిటీ కారణం అంటూ ప్రశ్నించిన ఋషులకు సమాధానంగా చెప్పిన మాటలు ఈపద్యం. ప్రియులకు ఎప్పుడైనా ఏవేళనైనా తమ ప్రియురాండ్ర సంబంధమైన వార్తలు ప్రియాన్నే కలిగిస్తూ ఉంటాయి. ఆ విధంగానే ఇష్టుడైన హరి జీవితవిశేషాలు ఆయన ప్రియభక్తులందరికీ ప్రీతిదాయకంగానే ఉంటాయి కదా-అంటూ సమాధానం చెప్పినాడు.

మధురభక్తి విధానంలో భగవానుడైన శ్రీహరి పతికాగా ఆతని భక్తులందరూ ప్రియురాండ్రుగా సమ్మానింపబడటం పరిపాటి. భక్తుడైనవాడు పరమేశ్వరుణ్ణి ఏ రూపంలో సేవిస్తే ఆ స్వామి అతణ్ణి ఆ విధంగానే అనుగ్రహిస్తూ ఉంటాడు. ఈ బాంధవ్యంతోనే భగవంతుడు కొందరిభక్తులకు తల్లీ, తండ్రీ, కొడుకూ, స్నేహితుడూ, ప్రియుడు కూడా, దీనులై దిక్కులేని వారికి ఆ శ్రీహరి ఏడుగడ. అతడే పటిష్ఠమైన ఆత్మబలం. కాముకుడైన ప్రియునికి సర్వకాల సర్వావస్థలల్లో ప్రియురాలి విషయమై వినడం, ఆలోచించడం, ఆమె దర్శన స్పర్శల కోసం తహ తహలాడడం పరిపాటి. ఆ విధమైన అత్యంతాసక్తమైన ఒకనొక ఆకర్షణ భగవంతునిపై భక్తునికి ఏర్పడుతుంది. అందుకే ప్రేమికుడూ, పిచ్చివాడూ భక్తుడూ ఒక కోవలోనివారన్నారు. తాము అభిలషిస్తూ తమ మనస్సుకు గురి కుదిరిన ఆ లక్ష్యం నుండి వారి మనస్సు మరలదు. ఎల్లప్పుడూ ఆ ధ్యానంలోనే రమణం పొందుతుంటారు. ఈ విషయాన్ని గ్రహించిన పోతన భక్తజన ప్రియుడైన భగవంతుని చరిత్రలు ప్రియభక్తులందరికీ ప్రియాన్నే కలిగిస్తాయి కదా! అంటూ ఉచితంగా చెప్పి భక్తిని ప్రియవస్తువుగా స్థిరపరచినాడు.

బ్రహ్మ మొదలైన దేవతలందరినీ ఆటబొమ్మలుగా చూచేది. ఇంకొకతూరి ఈ భూమండలాన్నే తన బొమ్మకు పీటగా భావించేది. ఇష్టే సూర్య చంద్రుల కాంతుల్ని అక్కడ వెలుగుతున్న దీప కళికలుగా తలిచేది. ఇక సరస్వతీ పార్వతులను తనకు చెలిమి కత్తెలుగా సంభావించేది. అంటే శ్రీమహాలక్ష్మి అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన శ్రీహరికి కాబోయే ధర్మపత్నికి అవసర మైన ప్రాభవ వైభవాలన్నీ కలిగి ఉన్నట్లు పోతన వర్ణించినాడు.

సాధారణంగా తెలుగుదేశంలో ప్రతి ఇంటా ఆడపిల్లలు కలిగినంతలో బొమ్మరిల్లు కట్టుకుని, రేపు దిద్దుకునే కాపురానికి ప్రాతిపదికగా, ఆటలోనే ఇల్లు చక్కబెట్టుకునే నేర్పరితనాన్ని నేర్చుకునేందుకు దొంతులూ, గురుగులూ, బొమ్మలు పెట్టుకుని, తమ ఈడువారితో కలిసి బొమ్మలాట లాడుకునే సంప్రదాయం ఉండేది. ఎవరెవరి శక్తినీ,అభిరుచినీ, స్తోమతనూ బట్టి వారివారి బొమ్మలూ, ఆటవస్తువులూ, ఉపకరణాలూ ఉంటాయి. శ్రీమహా లక్ష్మి సామాన్యురాలు కాదు. ఆమె కలుములకు టెంకి. బ్రహ్మాండాలను కడుపులో దాచుకున్న ఆదివిష్ణువు ఎదలో కాపురం చేయబోయే భాగ్యవతి. అందుకే ఆమెకు బ్రహ్మాండం అంతా బొమ్మరిల్లు కాగా, బ్రహ్మాదులు బొమ్మలుగా, బ్రహ్మాండాలు దొంతులుగా, చివరకు ఈ బ్రహ్మాండమే ఒక బొమ్మ పీటగా కానవచ్చిందని పోతన వర్ణించినాడు.

క. కడులచ్చి గలిగె నేనియుఁ

గుడుతురు గట్టుదురుగాక కొడుకుల నగుచున్

బడుగుల వాడలపైఁ బడ
విడుతురె రాకాంతచెందు విమలేందుముఖీ!

గోపమ్మలు కృష్ణయ్య ఆగడాలను యశోదమ్మతో చెప్పి, మేము ఊరి విడిచిపోతామంటూ బెదరింపు మాటలు పలికి, అవి ఇంకా పనిచేస్తాయో? చేయవో? అంటూ సందేహిస్తూ రాచవారికి మర్యాదలు నేర్పుతూ ఓ చురక తగిలించినట్లుగా చెప్పిన మాటలీ పద్యం.

మచ్చలేని చంద్రబింబంవంటి ముఖం కలిగిన ఓ యశోదమ్మా! చాలా సంపత్తి కలిగితే ఇష్టమైన పదార్థం తినవచ్చు, నచ్చిన బట్ట కట్టుకోవచ్చు, అంతేగానీ నవ్వుతూ తమకొడుకులను నిస్సహాయులైన నిరుపేదల వీథుల్లోకి పిడుస్తారా రాజకాంత లెక్కడైనా? అంటూ కటువుగా పలికినారు.

నిజానికి సంపన్నులైనవారు వారి సంపదకు అధికారులు, కాబట్టీ వారి వారికి ఇష్టమైన కమ్మని పదార్థాలను తింటూ, కంటికి ఇంపైన బట్టకడ్తూ, భోగాలను అనుభవించవచ్చు, అది వారి సొత్తు. ఎట్లైనా అనుభవించనీ, ఏమైన చేయనీ, అంతేకానీ తమ ముద్దుకొడుకులను ఏమీ చేయలేరు కదా అంటూ బక్కచిక్కిన వారి వాడలపైకి నవ్వుతూ పంపుతారా తల్లీ, ఇదెక్కడి రాచపాడి అంటూ ప్రశ్నించినారు. 'నగుచున్' అనే పదప్రయోగంతో కొడుకు చేస్తున్న ఈ తులువచేష్టలకు తల్లి అనుమతించింది అనే భావాన్ని గోపమ్మలు ధ్వనింపచేసినారు.